# ఎన్నెమ్మకతలు 5వ సంపుటం.

## విషయసూచిక

# పరిచయం

మొదట చెప్పవలసింది ఈసంకలనంకూర్పులో భిన్నత. ఇంతకుముందులా కాక, ఇందులో అనేక ప్రక్రియలు ఉన్నాయి. సాహిత్యవ్యాసాలు, చిన్న కథలు, కవితలు, సమీక్షలూ కేవలం 2017-2023 మధ్య కాలానికే పరిమితం కాదు. అంతకుముందు ఏ సంకలనంలోను చేర్చనివి ఇందులో చేర్చడం జరిగింది. వాటి వరుసక్రమంలో తేదీలు పాటించలేదు. వస్తువు ప్రధానంగా తీసుకుని, ఒకే అంశంమీద ఉన్న రచనలు అనిపించినవి ఒకచోట చేర్చేను. అందులో కొంత పునశ్చరణ ఉన్నా, ఒక అంశంమీద నాఅభిప్రాయాలు ఎలా ఉంటాయి అన్నది తెలుసుకోడానికి ఉపయోగపడుతుంది అనుకున్నాను. ఇటీవల రాసిన కొన్ని కవితలు, ఆషామాషీ కబుర్లు వదిలేసేను, ఈ సంకలనంలో చేర్చదగినవి  కావు అనిపించి.

పనిలో పనిగా కొన్ని కాలనుగుణంగా మారిన నాఅభిప్రాయాలు, అధికవిశేషాలు కూడా చేర్చి కొన్ని వ్యాసాలు, కవితలు update చేసేను. కొన్ని కొత్తవి, అంటే తెలుగు తూలిక బ్లాగులో ప్రచురించనవి, ఇక్కడ చేర్చేను.

ఈ సంకలనంలో 3 విభాగాలు ఉన్నాయి. 1. సాహిత్యం, 2. సమాజం, 3. తదితరములు అంటే ఇంతకుముందు ఊసుపోక, ఎన్నెమ్మకతలు వంటి ధారావాహికలలో ప్రచురించినవి.

ఈ తదితరములు విభాగంలో కొన్ని నాఅనుభవాలే అయినా, నూటికి నూరుపాళ్లూ నావిగా కాక, సార్వజనీనం అనుకున్నవి మాత్రమే చేర్చేను. అలా కానివి బ్లాగులో ఉన్నాయి కానీ ఇందులో లేవు.

ఈసంకలనంలో చేర్చిన **రచయితలూ పాఠకులూ ఎవరు ఎవరికి స్ఫూర్తి** అన్న వ్యాసంగురించి ఒక మాట చెప్పాలి. నేను ఇంగ్లీషులో రాసిన What is a Good Story (published on my web site, thulika.net, June 2003) తెలుగులోకి అనువదించి **రచయితలకీ పాఠకులకీ మధ్య గల అవినాభావసంబంధం** అన్న శీర్షికతో తెలుగు తూలికలో ఫిబ్రవరి 11, 2022 తేదీన ప్రచురించేను. ఇంగ్లీషువ్యాసం విదేశీయులను కూడా ఆకర్షించింది. అంచేత ఇప్పుడు మళ్లీ ఇంకొంచెం సవరించి ఈసంకలనంలో చేర్చేను.

అలాగే ప్రాయికంగా సంకలనాలగురించి నేను రాసినవి 3 పోస్టులు కనిపించేయి. అవి నాఇతర సంకలనాలలో లేవు.  వీటిలో ఒకటి కల్పనా రెంటాల తెలుగు సాహిత్యచరిత్రగురించి 2012లో చేసిన ఇంటర్వ్యూ. అందులో సంకలనాలకి సంబంధించిన అంశము ఇక్కడ చేర్చేను. కల్పనతో నాఇంటర్వ్యూ పూర్తిపాఠం archive.org లో ఉంది. చివరలో లింక్ ఇచ్చేను.

సంకలించడం ఒక శ్రమ అన్నాను ఇంతకుముందు. అది వేరేవారి రచనలను సంకలించడంగురించి. నారచనలే నేనే సంకలించుకోడం కూడా శ్రమే అని ఈ సంకలనంతో తెలిసింది. రెండు వారాలుగా అన్ని పనులూ వదులుకుని, ఈ ఒక్క పనితోనే సతమతమయినా, ఇంకా సరిగా చేయలేదేమో అన్న అనుమానం ఉంది. ముఖ్యంగా ఇంతకుముందు సంకలనాలలో చేరనివి కనిపించేయి. దాంతో ఇంతా ఏమున్నాయో అని వెతుక్కోడం, కొన్నిటిని నాకు కొత్తగా వచ్చిన జ్ఞానంతో సరి దిద్దడం లేదా మార్చడం - ఇలా ఎంత చేసినా ఇంకా ఏదో చేయవలసింది ఉందేమో అన్న అనుమానం పీక్కు తింటోంది. లింకులు కూడా మరొక సైటులోంచి ఇచ్చినవైతే సమస్యే. కనిపించినంతవరకూ సరి దిద్దేను.

మరో విషయం నేను ఇప్పుడే చూసుకున్న మరో సంకలనం కవితాసంకలనం.

నాసాహిత్యం PDF పేజీలో పెట్టలేదని కూడా ఇప్పుడే చూసుకున్నాను. అంచేత, 2012 తరవాతి కవితలు ఈసంకలనంలో చేర్చేను.

సమాహారం అంటే చెదిరిపోయినవి పోగు చేయడం అని నిఘంటువు చెప్తోంది. ఆవిధంగా చూస్తే, ఉపశీర్షికలో సమాహారం అనడం ఉచితమే కదా.

మీఅభిప్రాయాలు తెలియజేస్తే సంతోషం.

- ఇట్లు

- నిడదవోలు మాలతి

malathini@gmail.com

సెప్టెంబర్ 17, 2023.

## హెచ్.వై. రామకృష్ణ (అనుసృజన). **వసిష్ఠ రామ సంవాదము**

**(యోగవాసిష్టం** అన్న శీర్షికతో నాల్గాగులో పరిచయం చేయబడింది)

ఇది 3 వేల పేజీలు ఉంది. ఆరు ప్రకరణాలలో సత్త, భ్రాంతి, మోక్షము వంటి గహ్వరమైన తత్త్వవిచారణ ఈనాటి సరళ వ్యావహారికంలో వివరించేరు.

సాధారణంగా యోగవాసిష్ఠం అన్నపేరుతో ప్రసిద్ధమైన ఈ **వసిష్ఠరామసంవాదం గ్రంథం**లో కర్మ, జ్ఞానం పరస్పరవిరుద్ధం కాదనీ, రెంటినీ ఆచరిస్తూ మోక్షం సాధించవచ్చన్న ప్రతిపాదనతో ఆధునికులను ఆకట్టుకునేవిధంగా ఆవిష్కరించడం జరిగింది. ఇంకొంచెం వివరంగా చెప్పాలంటే, కర్మసాధనకి జ్ఞానమార్గం తోడవుతుంది. మూలవిషయం అర్థం చేసుకోకుండా ఏ కార్యమూ సాధించలేము అన్నది లోకవిదితమే కదా. ఇది ఎవరికి పఠనయోగ్యం అంటే "తాను సంసారబంధంలో మగ్నమయి ఉన్నానన్న అవగాహనతో, వీటినిండి ముక్తి పొందగల మార్గం అన్వేషించాలన్న మానసికస్థితి" చేరుకున్నవారికి అంటారు. పతంజలి యోగసూత్రాలు "అథ" అని ప్రారంభమవడంతో మూలభావం కూడా ఇదే అంటారు విజ్ఞులు.

రామునికి 16 వత్సరాల వయసు. విశ్వామిత్రుడు రాముని యజ్ఞసంరక్షణకి పంపమని కోరినసందర్భంలో ప్రాపంచికవిషయాలగురించి రాముడు తనవేదన వెలిబుచ్చుతాడు. మొదటి ప్రకరణంలో ఈ ప్రకరణం దాదాపు 60 పుటలుంది. ఇందులో రాముడు వెలిబుచ్చిన సంశయాలు, సదసద్వివేచనా చాలా విపులంగా ఉన్నాయి. ఇలాటి సందేహాలు చాలామందికి ఏదో ఒక సందర్భంలో కలగవచ్చు. ఉదాహరణకి ఈ శ్లోకం చెప్పుకోవచ్చు.

తరవో2పి హి జీవన్తి, జీవన్తి మృగపక్షిణః

స జీవతి మనో యస్య మననేన నజీవతి (XIV-II)

వృక్షాలు, మృగాలూ, పక్షులూ కూడా జీవిస్తున్నాయి. కానీ ఏం లాభం? ఎవనికైతే ఈ దృశ్యసంకల్పముయొక్క మననము క్షీణిస్తుందో అట్టి మనసు కలవాడే వాస్తవమైన జీవితమును అనుభవిస్తున్నాడు. ఈ జీవితముపట్ల ఈ కనబడే దృశ్యవ్యవహారముపట్ల సరైన అవగాహన కలిగి ఉండాలి అంటాడు రాముడు. అలాగే రాముడికి జీవితపరమార్థంగురించిన అవగాహన –

పరోపకార కారిణ్యా, పరార్తి పరితప్తయ

బుద్ధ ఏవ సుఖీమన్యే, స్వాత్మ శీతలయాధియా (XXVI-39)

ఎవరైతే పరోపకారపారాయణులై ఉంటారో ఇతరులకష్టములు తమవంటివేనని అనుకుని పరితపించుతారో, బుద్ధిబలంచేత తత్త్వజ్ఞానమును సంపాదించి స్వాత్మయందే రమిస్తూ ఉంటారో … అట్టి మహనీయులే ధన్యులు. వారే ఈ మాయాజగత్తునందు ఉత్తమమైన సుఖమును పొందుచున్నారని నాకు అనిపిస్తోంది అంటాడు రాముడు.

మానవజీవితంపట్ల ఎంతో గహనమైన అవగాహన కలిగిన రాముడు లౌకికవ్యవహారాలపట్ల విముఖత చూపడం గమనించి, విశ్వామిత్రుడు వశిష్టుని కోరుతాడు రామునికి జ్ఞానబోధ చేయమని. ఆ బోధ కలిగిన తరవాత రాముడు, "ప్రకృతిసిద్ధమగు రాజ్యపాలన మొదలైన లౌకికవ్యవహారములకు, మోక్షస్థితికి, … ఒకదానితో మరొకదానికి … విరోధమేమీ వాస్తవానికి లేదు. ఆత్మవిచారణచే ఉత్తమ యోగస్థితి పొంది, ఆ పై ఎప్పటిలాగానే వ్యవహరింవచ్చు"నని చెప్తాడు.

వశిష్టుడు చక్కగా సక్రమపద్ధతిలో రామునిసందేహాలకు తగిన సమాదానాలుగా జననమరణాలు, జీవుడు, విముక్తివంటి అనేక విషయాలు విశదంగా బోధించడమే ఈ గ్రంథం, సుమారుగా నాకు అర్థమయినంతవరకూ.

వస్తువుఅమరిక విషయంలో గ్రంథకర్త తీసుకున్న నిర్ణయాలు రెండు. మొదటిది  భాష – 1950లో ప్రచారంలోనికొచ్చిన వ్యావహారిక భాష ఎంచుకున్నారు. ఆ క్రమంలోనే అక్కడక్కడ ఇతరమతాలలోనుండి సామ్యాలు స్పృశించేరు. కొన్ని పదాలకి ఇంగ్లీషులో అర్థాలు కూడా ఇచ్చారు.

రెండవది వసిష్ఠుని సమాధానాలు సుదీర్ఘం అయినచోట, వాటిని నేర్పుగా విరిచి, రామునిపరంగా ప్రశ్నలు చొప్పించడం. ఇందుమూలంగా మనకి విషయం అర్థం చేసుకోడం తేలికవుతుంది. రామునిప్రశ్నలు నేను అడిగినట్టే అనిపించింది నాకు. ఈవిధంగా పాఠకుడికి చర్చలో పాల్గొంటున్న భావన కలుగుతుంది.

అట్టే పెద్ద దోషం కాదు కానీ కొన్నిచోట్ల "… అని వసిష్ఠులు చెప్పుచున్నారు" వంటి వాక్యాలు కనిపించాయి. అలాటి సందర్భాలలో ఇది రచయిత అవగాహనేమో, మూలగ్రంథం యథాతథంగా అనువదించలేదేమో అనిపిస్తుంది. ఇది చిన్న సందేహం మాత్రమే.

వసిష్ఠుడు తనవాదనలని సమర్థిస్తూ దృష్టాంతాలను చిన్న కథలరూపంలో ఇవ్వడం బాగుంది. ఇక్కడ నాకు నచ్చినభాగం, దృష్టాంతాలపేరుతో మితిమీరి సాగదీయకపోవడం. వస్తువు అతి సూక్ష్మమైనది అయినందున అక్కడక్కడ పునశ్చరణ అయినట్టు తోచినా, విషయం అవగాహన క్లిష్టతరమైనది కనక నామటుకు నాకు బాగుందనే అని మాత్రమే చెప్పగలను.

ఇంతవరకూ చదివినభాగంలో నాకు చాలా బాగుందన్న ఉపాఖ్యానం – శుకుడు జ్ఞానసముపార్జనకోసం జనకునిదగ్గరికి  నీవెళ్ళడం, జనకుడు శుకుని మూడువారాలపాటు పరీక్షించి, తరవాత బోధ చేయడం. ఈ వ్యవహారం నిత్యజీవితంలో సర్వసామాన్యం. సర్వే సర్వత్రా ఇలా జరిగే అవకాశం ఉంది. రెండోకథ లీలోపాఖ్యానం. ఈకథలో లీల భర్త పద్మ్ముడు మరణించనతరవాత ఆయన తనతోనే ఉండేలా వరమిమ్మని సరస్వతీదేవిని కోరడం. ఈకథలో సరస్వతీదేవి లీలకి వరమిచ్చినప్పుడు నాకు కలిగిన సందేహం, ఆ తరవాత చిదాకాశంగురించిన చర్చతో కొంత విశదమయింది. లీలా, విధ్వుడు పూర్వజన్మలో బ్రాహ్మణదంపతులనీ ఆవిధంగా వారు ఎప్పుడూ విడిపోలేదనీ చెప్తుంది. పుస్తకం పూర్తిగా చదివేక మరింత వివరంగా తెలుస్తుందనుకుంటాను.

ఆర్కైవ్.ఆర్గ్ లో లభ్యం. లింక్ - https://yhramakrishna.com/yoga_vasistam/Vasishta%20Rama%20Samvadam.pdf

(మే 1, 2017)

## ఏ మతము సమ్మతము?

ప్రపంచంలో మాటాడుకోడానికి నిత్యనూతనమైన విషయాలు రెండే – మతమూ, రాజకీయాలూ. మాటాడుకోడానికి ఏమీ లేకపోతే ఈరెంటిలో ఒకటి మొదలుపెడితే చాలు. తెల్లిగ్గా రోజు మొత్తం గడిచిపోతుంది. అలాగే రాయడానికేమీ లేకపోయినప్పుడు కూడా. ఇది ఆ రెండోవర్గంలో చేరుతుందనుకోండి.

మామూలుగా నేను మతవిషయంలో గోడమీద పిల్లివాటంగా ఉంటాను. అది వైయక్తికమనీ, ఎవరిష్టం వారిదీ అనే నాఅభిప్రాయం.

ఏదో చర్చ కనిపించినప్పుడల్లా ఏ మతం ఏమి చెప్తోందా చూదాం అనిపిస్తూ ఉంటుంది. అలాటప్పుడు నాకు దొరికిన పుస్తకం తీసి చూస్తాను.

అంటే ప్రముఖగ్రంథాలన్నీ క్షుణ్ణంగా చదివేసి, ఒక సిద్ధాంతం చేయగలస్థాయికి వచ్చేసేనని కాదు కానీ ఇలా కొంతకాలం చదివేక, ఆలోచించేక నాకు అర్థమయింది ఇది.

నేను చూసిన పుస్తకాలు, భగవద్గీత, భాగవతం, విదురనీతి, పతంజలి యోగసూత్రాలు,  బౌద్ధమతంగురించి రెండు పుస్తకాలు. ఆమీదట అంతో ఇంతో వినికిడిగా తెలుసుకున్న సంగతులు- మహమ్మదీయం, క్రైస్తవం, యూదులమతం. ఈవిషయంలో పుస్తకాలకన్నా పరిచయాలమూలంగా తెలుసుకున్నసంగతులే ఎక్కువ. ఈ పరిమితులలో ఏర్పడిన అభిప్రాయాలు ఇవి.

మతము అన్న పదం స్థూలంగా ఏదో ఒక సమూహానికి వర్తింపచేస్తారు. కానీ ఆ పదానికి అభిప్రాయము, ఇష్టము, కోరిక అన్న అర్థాలు కూడా ఉన్నాయి. ఇదే అసలు మతం అన్నపదానికి నాందియేమో అని నాకు అనిపించింది. అంటే ఒకే విధమైన ఇష్టమో అభిప్రాయమో గలవారందరూ ఒక మతము ఏర్పర్చుకున్నారేమో అని. ఇది ఒక కోణం.

మరోకోణం ఏమతానికైనా కేంద్రబిందువు మంచీ చెడూ విచక్షణ, యుక్తాయుక్తజ్ఞానం. ఏ కథా, పుస్తకం, సినిమా, సైన్సు ఫిక్షన్, ఏది తీసుకున్నా మంచిని సమర్థిస్తూనూ, చెడుని విమర్శిస్తూనూ ఆవిష్కరించడం జరుగుతోంది. ఎన్ని అద్భుతాలూ, సంభ్రమాలూ, పదగుంభనా, భావసౌందర్యం–ఏమేమి తొడుగులు తొడిగినా, వాటన్నిటిలోనూ కేంద్రబిందువై నిలిచిన, ముఖ్యమైన వస్తువు మంచీ-చెడూ విచక్షణే.

ఈ నేపథ్యంలో ఏమతం ఏమి చెప్తోంది అని స్థూలంగా అర్థం చేసుకోడనికి ప్రయత్నించేను. ఇది సమగ్రంగా అన్నిబృహద్గ్రంథాలు చదివి, సహేతుకంగా పరీక్షించి చూసి చేసుకున్న నిర్ణయం

కాదని మొదటే చెప్పేను కదా. ఇది కేవలం నాకు అప్పుడప్పుడూ కలుగుతూ వచ్చిన ఆలోచనలకి అక్షరరూపం మాత్రమే.

ఇప్పటికి నామనసులో నాటుకున్న కొన్ని అభిప్రాయాలు లేక ఆలోచనలు ఇలా ఉన్నాయి.

భగవద్గీత ఆత్మే ఆత్మని ఉద్ధరించుకోవాలి అని చెప్తుంది. బుద్ధులు ఆత్మ లేదన్నా, బుద్ధగీతలో అదే పదాన్ని ఉపయోగించి అదే అభిప్రాయాన్ని వెలిబుచ్చడం జరిగింది.

జేతవనము 379 లంగూలుఁడు (భిక్షువు)

ఆత్మచే నాత్మ శోధించి, యాత్మన్ బ్రేరేచి యాత్మచే
ఆత్మచే నాత్మఁ బ్రోవఁగా, భిక్షు! క్రీడింతు హాయిగా.

అలాగే, ప్రాణహింసని హైందవంలో కొన్ని సందర్భాలలో అంగీకరించేరు. బౌద్ధమతం కూడా మొదట్లో హింసని గర్హించడం కనిపిస్తోంది. ఈక్రింది ధమ్మపదంలో "చంపింపక" అన్న పదం చూడండి. కేతవనములో ఒక భిక్షువుగురించి అన్న పదంక్రింద ఇలా ఉంది.

జేతవనము 405 ఒక భిక్షువు

చరాచరంబులై నట్టి, ప్రాణులన్ దయతోఁగన్ని
చంపింపకయుఁ జంపని, వానిన్ బ్రాహ్మణుఁ డందును.

ఇందులో మరోవిశేషం ఎవరు బ్రాహ్మణుడు అన్న ప్రశ్నకి సమాధానం. బుద్ధుడు వర్ణాశ్రమధర్మాలను అంగీకరించలేదు. అందరూ మనుషులే అన్నాడు. మరి బ్రాహ్మణులు, శూద్రులు అంటూ వేరు వేరుగా లేరు అంటే, మరి ఎవరు బ్రాహ్మణుడు అని ఎందుకు నిర్వచించడం అని నా సందేహం. ఇంకా కొన్ని పుస్తకాలు చదివితే తెలుస్తుందేమో. కానీ ఆవివరణ సద్వర్తనగురించి కనక నాకు నచ్చింది. బుద్ధగీత అన్న పుస్తకంలో 28 వర్గాలు ఉన్నాయి. ఒక వర్గం అంతా ఈ విషయంమీదే. ఉత్తమ మానవుడు అన్న అర్థంలో మనిషికి ఉండవలసిన గుణాలు వర్ణించేరు. బ్రాహ్మణుడు అన్న పదం వాడినా ప్రధానంగా కావలసింది ఉత్తమగుణాలు అవుసరం. ఆమేరకు నాకు నచ్చేయి ఈ పదాలు.

అదే అర్థం ఇచ్చే మరో పదం, బ్రాహ్మణుడు పుట్టుకచేత కాడు, నడవడిచేతనే బ్రాహ్మణుడు అనిపించుకోగలడు అని.

గోత్రములచే జడలచే, జాతిచేఁగాఁడు బ్రాహ్మణుఁ
డెందుండున్ సత్యధర్మంబుల్, వాఁడె బ్రాహ్మణుడున్ శుచి.

ఈ పదాలు అన్న పదంగురించి ఒకమాట చెప్పాలి. నేను ధమ్మపథం అనుకున్నాను. పథం అంటే మార్గం కనక సరిపోతుంది అని. చర్ల గణపతిశాస్త్రి గారు అనువదించిన **ధమ్మపదం** (బుద్ధగీత)లో పదం అని వాడేరు. పదం అంటే పాడుకోడానికి అనువైనది అని వివరించేరు. ఏది సరైన పదమో నాకు తెలీదు. నేను చర్ల గణపతిశాస్త్రిగారు **ధమ్మపదం** పుస్తకంలోనుండే ఉదాహరణలు తీసుకున్నాను కనక, పదం అన్న పదమే వాడుతున్నాను.

పోతే హింసమాట తీసుకుంటే, "చంపింపక" అని అప్పట్లో ఉన్నా, తరవాతికాలంలో మార్పు వచ్చింది. తాము చంపరు కానీ ఇతరులు చంపిన జంతువుమాంసం తినవచ్చు అన్నారు.

అలాటిదే మరో అంశం భ్రూణహత్య. హిందువులు అంగీకరించరు. క్రైస్తవులు కూడా అంతేనట. నేను అమెరికా వచ్చేక, ఈవిషయంలో జరుగుతున్న చర్చలూ, మారణహోమాలవల్ల తెలిసింది. ఆకారణంగానే, సాంప్రదాయకులైన క్రైస్తవులు (conservatives) abortionవిషయంలో హోరాహోరీ పోరాడుతున్నారు.

గతంలో ఏమైందో నాకు తెలీదు కానీ ప్రస్తుతం, ఈ "సంప్రదాయం" పేరున డాక్టర్లనీ, ఆస్పత్రులనీ బాంబులేసి చంపడం మాత్రం సమర్థనీయంగా కనిపించలేదు నాకు. ఒకరిని చంపకూడదని మరొకరిని చంపడం ఎలా సమర్థంచగలరు? అది మాత్రం హింస కాదా? పైగా వారివాదం, "ఆ తల్లికి బిడ్డని పోషించగల స్తోమతు లేకపోతే, లోకంలో ఎంతోమంది పెంచుకోడానికి సిద్ధంగా ఉన్నారు" అన్నది. ఇది కూడా అర్థరహితమే నాదృష్టిలో. ఇప్పటికే పుట్టేసి, తిండి లేక మలమల మాడుతున్న పిల్లలు లక్షలసంఖ్యలో ఉన్నారు. అంత ప్రేమగలవారు ఆ కూటికి అల్లల్లాడుతున్న పసివాళ్ళని పెంచుకోవచ్చు. లేదా మరొకరకమైన వసతి ఆ పిల్లలందరికీ ఏర్పాటు చేయవచ్చు. వాళ్ళందర్నీ ఉద్ధరించేక, పుట్టనిపిల్లలవిషయం ఆలోచించండి అని నాసలహా. సరేలెండి బండి దారి తప్పింది.

నేననేది ఎవరో ఒకరు ఇలాటి వాదాలు మొదలుపెట్టి, మూలసిద్ధాంతాలకు విపరీత వ్యాఖ్యానాలు కల్పించి, అనేకమంది ప్రజలని తప్పు దారులు తొక్కిస్తున్నారని.

అసత్యమాడరాదు అని హరిశ్చంద్రుడికథ చెప్పుకుని, తరవాత ఆపద్ధర్మం పేరున అవుసరాన్నిబట్టి అసత్యాలు, అర్థసత్యాలు పలకడంలో తప్పులేదని సమర్థించుకోడం జరుగుతోంది. నిజానికి ఏదో ఒక సమయంలో ఈ చిన్నచిన్న అసత్యాలు పలకనివారు ఈభువిలో లేరనే నానమ్మకం.

బౌద్ధంలో విజ్ఞానం అన్నపదానికి ఇచ్చిన నిర్వచనం నిజానికి పునర్జన్మగురించి. తాత్వికపరమైన వివరణ. ఇది కూడా హిందూ తత్వానికి చేరువగానే ఉంది. పతంజలి యోగసూత్రాలలో దీనికి సరి పోలగల సూత్రాలు కనిపిస్తాయి.

పతంజలి యోగసూత్రాలలో మరొక సూత్రం దృక్ దర్శనశక్త్యోరేకాత్మతేవా అస్మితా అని. దృష్టి వేరు దృశ్యము వేరు అని గ్రహించకపోవడమే అస్మిత (అజ్ఞానం) అంటారు. ఇంచుమించు అదే భావం ఈక్రింది ధమ్మపదంలో వ్యక్తమయింది.

విజ్ఞానము :- దేహధారియైన పుద్గలుడు (జీవుడు) ఆయా ఇంద్రియ వేదనల వల్ల సుఖ దుఃఖానుభవములను పొందును. ఆయా వేదనలు అతని మనస్సుపై కల్గించిన ప్రతిక్రియ వలన ఒకని వ్యక్తిత్వము రూపు దిద్దుకొనును. ఆయా సంవేదనలను, సంఘటనలను విశ్లేషించుకోవటంలో అతని గతజన్మ సంస్కారాలు అతనిదైన ఒక దృష్టిని ఏర్పరుస్తాయని కూడా మరువరాదు. అంటే యీ వ్యక్తిత్వము ఇప్పుడే రూపొందటం ప్రారంభం కాలేదని ఇదే ముగింపుకాదనీ తేలుతుంది. ఇది నిరంతరం పరిణామం చెందే తత్వం. ఇది ఎప్పుడు ప్రారంభమైందీ అన్న ప్రశ్నను బుద్ధు "అవ్యాకృత మంటాడు" అంటే వివరింప గూడనిది అని.

ఇతరులనొమ్ము కోరరాదు, ఆర్తులకీ, ఆపదలో ఉన్నవారికీ చేయగల సహాయం చేయాలి లాటి సూక్తులు కూడా చాలా మతాల్లో కనిపిస్తున్నాయి.

ఈనాడు కులధర్మాలు ఆచరించడం చాలా తక్కువే. ఆచరించేవారు కూడా తాము ఉన్న ప్రదేశాలకీ, పరిస్థితులకీ, సమాజానికీ అనువైనవిధంగా మార్చుకోవలసివస్తోంది.

ఒకే ఇంట్లొ ఒకరికి ఒకరు ఇష్టదైవం అయితే మరొకరికి మరొకదేవరో దేవతో ఇష్టదైవం కావచ్చు. అధికంగా ఇప్పుడు స్వామి, బాబా, అమ్మ, టీవీగురువులవంటి కలియుగ దేవుళ్ళు కూడా హెచ్చుసంఖ్యలోనే ఉన్నారు.

ఇవి నేను ఎందుకు చెప్తున్నానంటే, మతం అన్నది అనాదినించి ఒక్కలాగే లేదు. కాలగతిలో ఆయా కాలాల్లోని పరిస్థితులనుబట్టీ, ఆచారవ్యవహారాలనుబట్టీ మతానికి సంబంధించిన నమ్మకాలు కూడా మార్పు చెందుతూ వస్తున్నాయి అని చెప్పడానికి.

మొదట్లో చెప్పుకున్నట్టు ఈ మతం అన్నది వైయక్తికం. ఎవరు ఏపద్ధతిలో అవలంబిస్తారు అన్నది కూడా వ్యక్తిగతమే. ఎవరి ఇష్టాయిష్టాలు వారివి. ఏ ఒక్కమతం తీసుకున్నా స్పష్టంగా కనిపిస్తున్నది ఒక్కొక్కరు వారి ఇష్టాయిష్టాలూ, సౌకర్యాలనుబట్టి వారికి తోచినట్టు నడుచుకుంటున్నారే గానీ సామూహికంగా ఒకమతానికి చెందినవారందరూ ఒక్కలాగే నడుచుకోడం లేదు.

ఈసరికి మీరు గ్రహించే ఉంటారు. ఏదో ఒకమతం అని కాక, నేను చదివినపుస్తకాలలోనూ, చూసిన మనుషులలోనూ కనిపిస్తున్న ఒకరకమైన నీతిని తీసుకుంటున్నాను. ఇతరులని బాధ పెట్టకుండా నామటుకు నాకు నచ్చినరీతిలో జీవనం సాగించడమే ఉత్తమము. అదే నామతము.

ఇదంతా చూసి, నన్ను మానవతావాది అనొచ్చు. కానీ నాకు అది సమ్మతం కాదు. ఎందుకంటే మానవతావాదులు దైవం ఉందని నమ్మరు. నేను నమ్ముతాను. ఏ పేరైనా పెట్టొచ్చు కానీ మానవాతీతశక్తి ఒకటి ఉంది, అది మనని నడిపిస్తోంది అనే నానమ్మకం.

మొదట్లో చెప్పినట్టు ఇది నాఅభిప్రాయం. ఇష్టం, కోరిక …

000

చర్ల గణపతిశాస్త్రి గారి ధమ్మపదము (బుద్ధగీత)లో గ్రంథకర్త బుద్ధగీతకీ హైందవధర్మానికీ సారూప్యం చక్కగా వివరించేరు. ఇది పాలీభాషనుండి అనువదించబడింది.

పిడియఫ్ ఫైలు ధమ్మపథము చర్ల గణపతిశాస్త్రి archive.org కి ధన్యవాదాలతో.

(మార్చి 3, 2019)

## తిరుమల రామచంద్ర. **పలుకుబడి**

తిరుమల రామచంద్ర(1913-1997) గారిపేరు వినగానే చాలామందికి జ్ఞాపకం వచ్చేది **హంపీనుంచి హరప్పావరకూ**. **లిపి పుట్టుపూర్వోత్తరాలు**, **నుడి నానుడి** కూడా ప్రసిద్ధమే. పూర్తివివరాలకు తెవికీలో చూడండి.

పలుకుబడి 1995-96మధ్య ఒక ఏడాదిపాటు వారం వారం ఆంధ్రప్రభలో వరసగా ప్రచురించిన వ్యాసాలసంకలనం. ప్రస్తుతం వాడుకలో ఉన్న అనేకపదాలకు ఇప్పుడున్న రూపం, దరిమిలా కాలక్రమంలో భ్రష్టు పట్టిన రూపం, ఆ పదం మూలస్వరూపం సాధికారికంగా చర్చించేరు. చాలా ఆసక్తికరంగా ఉంది.

రామచంద్రగారు తెలుగుభాషయందు చూపిన అభిమానం గౌరవం అడుగడుగునా ప్రతి పేరాలోనూ కనిపిస్తుంది. ఒక్కొక్కపదానికి ధాతువు, ప్రత్యయం, ఉపసర్గలూ విడదీసి, వాటి అర్థాలు స్పష్టం చేసి, గుణింతాలు మారినచోట అర్థాలు ఎలా మారుతాయో చక్కగా వివరించేరు. నేను కూడా ఇలాటి తప్పులు చేసేను, యాదాలాపమా, యదాలాపమా, యథాలాపమా అన్నది నాకెప్పుడూ సందేహమే. నిఘంటువులు చూస్తాను కానీ రామచంద్రగారంత చక్కగా వివరించినవారు లేరు. వీరివివరణ చూసేవరకూ యథాలాభం అని మరో పదం ఉందని కూడా తెలీదు. నేను చదివిన పుస్తకాల్లో ఎక్కడా తగల్లేదు నాకు ఈ పదం. అలాటిదే మరోపదం ఘనాపాఠి. 'న'కి దీర్ఘం లేదని ఈపుస్తకం చదివేక తెలిసింది. అలాగే మరిన్ని వివరణలు - అయిష్టం కాదు అనిష్టం అనాలి. నిర్దుష్టం పేరూ నిర్దిష్టం పేరూ, కూటము పేరు కూటమి పేరు. నేను లెక్కపెట్టలేదు కానీ దాదాపు ఏడాదిపాటు ఒకొక వారం రెండు మూడు పదాలు తీసుకుని వివరించేరు కనక 70, 80 పదాలవరకూ ఉన్నాయి ఉన్నాయనుకోవచ్చు ఈ పుస్తకంలో.

ప్రధానంగా "ఎవరో వాడేరు అంటే చాలదు, ప్రమాణాలు చూడాలి," అన్న మాట నాకు నచ్చింది. "కాళిదాసు చెప్పినట్టు పరప్రత్యయనేయబుద్ధులు – ఇతరులమాటలకు మోసపోయేవారు – కారాదు," అన్నారాయన(పు. 47). ఇలాటిమాట వినగానే, మనకి వెంటనే తోచేమాట ఇప్పుడు ఎవరికండీ అంత తీరిక అని. రెండోది, ఆయన వివరించినంత క్షుణ్ణంగా తెలుసుకోవాలంటే పాణినీయం వ్యాకరణసూత్రాలు తెలియాలి. ఈరోజుల్లో వ్యావహారికభాషలో కథలు, కవితలు, వ్యాసాలు రాస్తున్న చాలామందికి ఇవి అగమ్యగోచరమే అనుకుంటాను.

ప్రస్తుతానికొస్తే, కొన్ని పదాలు, నాలో ఏదో ఒక విధమైన ఆలోచనలు రేకెత్తించినవి, తీసుకుని నాకు తోచిన అభిప్రాయాలు చెప్పడానికి ప్రయత్నించేనిక్కడ.

అస్తమానం అన్నపదం నిఘంటువులలో లేదు. అస్తమయ, అస్తమయిన, అస్తమనం ఉన్నాయి కానీ అస్తమానం లేదంటూ మరికొంత వివరణ ఇచ్చి, హంసవింశతి, కిరాతార్జునీయం కావ్యాలు ప్రయోగించేయి కనక, నిఘంటువులో లేకపోయినా, సాధువుగానే గ్రహిద్దాము అన్నారు రచయిత. ఈవాక్యంలో చివరిభాగం గమనార్హం. ఏ కవి అయినా ఒక పదం ప్రయోగించేరంటే అది వాడుకలో ఉండి ఉండొచ్చు అనే కదా. అప్పటికే వాడుకలో ఉండబట్టి ఆయా కావ్యకర్తలు ప్రయోగించిఉండాలి. తామే స్వయంగా సృష్టించినది అయితే, అమవసనిశి లాగ, అది వేరే సంగతి. పెద్దన అమవసనిశి అన్నందుకు తెనాలి రామకృష్ణుడు హేళన చేసినట్టు కథ ఉన్నా, ఆ పదం వాడుకలోకి వచ్చినట్టు లేదు. అక్కడితో ఆగిపోయింది. అలా కాక కొన్ని తెలుగుపదాలు, అస్తమానంలాటివి ప్రచారంలోకి వచ్చేయి. మరి అలాటప్పుడు అంగీకరించాలా అంగీకరించకూడదా అన్నదే చర్చ. సూక్ష్మంగా పరిశీలిస్తే, రామచంద్రగారు పదాల మార్పులక్రమం ఎలా వచ్చిందో చూపడానికి వ్యాకరణసూత్రాలు ఉటంకించేరు. అంటే రామచంద్రగారు ఆమార్పులను నిరూపించేరే కానీ ఇది తప్పు అని అనలేదు. మూలపదం ఇది, ఇలాగే పలకాలి, ఇలాగే వ్రాయాలి అంటూనే, కొన్నిటిని మాత్రం ఆమోదించేరు అనే నాకు తోచింది ఈవ్యాసాలు చదువుతుంటే.

ఉదాహరణకి, ఉపాధ్యాయిని అన్న పదం చూడండి. పాఠములు బోధించే స్త్రీలను ఉపాధ్యాయిని అని అనడం ఎప్పుడు ప్రారంభమయిందో నాకు తెలీదు. రామచంద్రగారు ఆఅంశం స్పృశించలేదు. కాని, ఉపాధ్యాయిని అంటే గురువుభార్య అని చెప్పి, నిర్దిష్టమైనపదం ఉపాధ్యాయ అని స్పష్టం చేసేరు. అలాగే విలేఖరి పదానికి కూడా ఉపసర్గలూ, ధాతువు, ప్రత్యయాలు విడదీసి, ఏరూపానికి ఏ అర్థం వస్తుందో చెప్పి, చివరికి మాత్రం విలేఖరి అన్నపదం వాడడం "ప్రమాదభరితం" కాదని భావిస్తున్నానన్నారు. చరిత్ర పదాన్ని విశ్లేషిస్తూ, రామచంద్రగారు చేసిన వ్యాఖ్యానం కూడా గమనార్హం. "కాలంతోపాటు కొన్నిపదాలకు అర్థచ్ఛాయలు ఏర్పడడం, నూతనార్థాలు ఏర్పడడం భాషాలక్షణం కనుక చరిత్ర పదానికి హిస్టరీ అనే అర్థం కలగడం సంతోషించదగిందే(పు. 62) అన్నారు. మరి విలేఖరి అంగీకరించినట్టుగానే ఉపాధ్యాయిని అంటే బోధించే స్త్రీ అన్నవాడుక కూడా ఆమోదించవచ్చు కదా.

అచ్చతెలుగు పదాలకు సంస్కృత ఉపసర్గలు చేర్చి, తెలుగుపదంగా ప్రచారం చేయడం సమంజసం కాదంటారు రచయిత. ఈ "దునియాలో అరకొర జ్ఞానం గలవారి పెత్తనమే ఎక్కువ" కనక ఇలా తెలుగులోకి వచ్చి స్థిరపడిపోయేయి అన్నారు. ఈవ్యాసం దాదాపు 30 ఏళ్లక్రితం

వ్రాసినది. ప్రస్తుతం ఇప్పుడు ఈ అరకొరజ్ఞానం ఎంతగా ప్రబలిపోయిందో చూస్తే ఆయన ఏమంటారో ఊహించడం కష్టం.

**పేర్లకి పట్టిన పీడ** అన్నవ్యాసంలో ఉచ్చారణగురించి ప్రస్తావిస్తూ, first లో r, often లో t సైలెంట్ అన్నారు (పు. 68). ఇంగ్లీష్ భాష ఉచ్చారణకి వేరే సిద్ధాంతాలున్నాయి. మనలా గుణింతంలో ప్రతి అక్షరం పలకరు, కొన్ని ఒకేలా పలకరు. ఉదాహరణకి, u అన్న అక్షరం but లో అ లాగ పలుకుతారు, put లో ఉ లాగ పలుకుతారు. నిజానికి మనం ప్రస్తావించవలసింది మనవాళ్లు మన అలవాటుప్రకారం alphabet లో ఉన్నట్టు పదాలలో పలకడం. Rudyard అన్న పదం అని మలో మొదటఅక్షరం ర అని మనవాళ్లలో చాలామందికి తెలీదు. అలాగే pizza పిజ్జా అని పలకడం కూడా తప్పే. Often లో t బ్రిటిషువాళ్లు పలకరు కానీ అమెరికనులు often ఆఫ్టెన్ అనే పలుకుతారు. షికాగోని చికాగో అనడం కూడా రామచంద్రగారు ప్రస్తావించేరు. ఇది నాక్కూడా ఆశ్చర్యమే, ముఖ్యంగా అమెరికాలో, షికాగోలో ఉన్న తెలుగువారు కూడా చికాగో అనే పలకడం, రాయడం ఆశ్చర్యం. వార్తల్లో, చుట్టూ ఉన్న అమెరికనులూ, టీవీలోనూ షికాగో అని పలకడం వింటూనే ఉంటారు కదా, మరి ఎందుకు గమనించరు అంటే సమాధానం లేదు. ఇక్కడే రామచంద్రగారి మరొక ప్రయోగం పాశ్చాత్యమ్మన్యులు అన్నది. ఇది వారే కల్పించిన పదం అనుకుంటాను, నాకు సరిగా తెలీదు.

ఈ సందర్భంలో పండితమ్మన్యులు అన్నపదం ప్రస్తావించాలి. నేను చాలాకాలం పండితమ్మన్యులు అంటే పండితులలో మాన్యులు అనే అనుకున్నాను. ఇటీవలే తెలిసింది అది తాము పండితులం అనుకునేవారిగురించి హేళనగా అనేమాట అని. కేవలం కుతూహలంకొద్దీ కొంచెం అంతర్జాలంలో రిసెర్చి చేసేను. కొందరు ప్రతిభావంతులైయిన పండితులే (చింతా రామకృష్ణారావుగారు, పుట్టపర్తి నాగపద్మినిగారు, ఉదాహరణకి) ఈ పదాన్ని "గొప్ప పండితులు" అన్న అర్థంలో వాడడం కనిపించింది. అంచేత ఈపదం నేను వాడడం మనేశాను కానీ సందేహం అలాగే ఉండిపోయింది. భవిష్యత్తులో ఈపదం గొప్ప పండితులు అన్న అర్థంలో స్థిరపడగలదని నానమ్మకం.

రామచంద్రగారు పేర్లవిషయం ప్రస్తావిస్తూ, తెలుగువారు 'రే' అంటారు, రాయ్ అనకుండా అన్నారు. ఇక్కడ ప్రత్యేకంగా గమనించవలసింది ప్రసిద్ధరచయితలు తమకి తామే స్వయంగా అలా తమపేర్లని మార్చుకున్నారు అన్నది. ఆంగ్లేయులకి సులభగ్రాహ్యం చేయడానికి అని జనవాణి. రవీంద్రనాథ్ టాగోర్ అంతటి మేధావి తాను అనువాదం చేసుకున్న గీతాంజలి పుస్తకంమీద Rabindranath Tagore అనే ప్రచురించుకున్నారు కానీ ఠాకుర్ అని

కాదు.(చూ. తెవికి). అలాగే పదహారణాల ఆంధ్రుడు సర్వేపల్లి రాధాకృష్ణయ్య, ప్రముఖ భారతీయ తత్త్వవేత్త, రాధాకృష్ణయ్య అన్న అచ్చతెలుగు పేరును రాధాకృష్ణన్ అని మార్చుకున్నారు.

రామచంద్రగారు కణ్ణబిరాన్ పేరు ఎంతగా ఛిన్నాభిన్నం అయిందో చెప్తూ, కణ్ణబిరాన్ గారు ఒక ఇష్టాగోష్టి పెట్టి, "నాపేరు ఇది, ఇలా ఉచ్చరించండి అని చెప్తే బాగుండు," అని సూచించేరు. రామచంద్రగారు ఇప్పుడు లేరు కానీ ఉంటే నాఅనుభవం చెప్పి ఉండేదాన్ని. నాకు అనుభవమే. అలా చెప్పినా ఎవరూ వినరు. నాపేరు "మాలతీ గారు" కాదు అని ఎంతమందికి ఎన్నిసార్లు చెప్పేనో లెక్కలేదు. యూనివర్సిటీ చదువులు చదివి విస్తృతంగా సాహిత్యసేవ చేస్తున్నవారు కూడా "మాలతీ గారూ", మధ్యలో విరామంతో సహా రాస్తున్నారు. నాపేరు మాలతి. సంబోధించినప్పుడు మాలతీ అవుతుంది. గారు చేరిస్తే, ఆ సంబోధనవిభక్తి ప్రత్యయం – దీర్ఘం – గారుకి చేర్చాలి. మాలతిగారూ అని సంబోధనవాచకాలు అని ఎంత పాఠం పెట్టినా, మర్నాడు మళ్లీ "మాలతీ గారూ" అనే.

**ఇష్టాగోష్ఠి ఇష్టగోష్ఠ** వ్యాసంలో రామచంద్రగారు "భాషకు సామ్యం-సాదృశ్యం అనేది పెద్ద విస్తరణసూత్రం" అన్నారు.

ఇప్పుడు సంస్కృతప్రత్యయాలు, ఉపసర్గలతో కూడిన పదాలమాట అలా ఉండగా, ఇంగ్లీషుపదాలు తెలుగు ప్రత్యయాలతో చాలానే వస్తున్నాయి. బ్లాగాడడం, లుక్కేయడం, అదుర్సులాటి పదాలు ఫేస్బుక్కులోనూ బ్లాగులలోనూ, కథల్లోనూ అంటే పత్రికలలోనూ బాగానే పుంజుకున్నాయి. అదేమంటే వ్యావహారికం – ఎలా మాట్లాడుతున్నామో అలా రాస్తున్నాం – అంటారు. కొందరు ఇతర భాషాపదాలు పలకలేక తమ "ముఖయంత్రానుగుణంగా" మార్చుకుంటారు అన్నారు రామచంద్రగారు(పు. 51). ఈవ్యావహారికం అన్నది ప్రాంతీయాలకి అన్వయించుకోవచ్చు కానీ మొత్తం తెలుగుభాషకే అన్వయించడం సమంజసమా అన్నది భాషావేత్తలు పరిశీలించి చెప్పాలి. ప్రత్యేకించి భాషాశాస్త్రవేత్తలు అనే ఎందుకంటున్నానంటే రామచంద్రగారే కొందరు ప్రసిద్ధ పండితులని తీసుకుని వారి ప్రయోగాలలో "తప్పులు" ఎత్తి చూపి, ఆ పండితులతోనే ఆయన వాదించినట్టు కొన్ని కథలు చెప్పేరు. "వారంతా సంస్కృతం, పాలీ, తెలుగు బాగా చదువుకున్నవారే కానీ ప్రవాహిని ప్రభావం అలాంటిది" అన్నారు. ఈవాక్యం గమనార్హం. భాషాశాస్త్రవేత్తలు విశిష్టపండితులు కనక ఆ పదాలు వాడుతున్నారు. నాలాటి సామాన్యులు అవి చదివిఉంటే వారిని అనుసరిస్తాం కదా సహజంగానే. అంతే కాదు. రామచంద్రగారు కొన్ని పదాలు ఉదహరించేరు. కానీ ఇలా అర్థాలు మారిపోయిన పదాలు కొన్ని వేలో లక్షలో ఉండవచ్చు. ఈరోజుల్లో పత్రికలు, అంతర్జాల మాధ్యమాలు మీరూ రచయితలే అని అక్షరజ్ఞానం ఉన్నవారినందరినీ ప్రోత్సహిస్తున్నారు. చాలామంది రచయితలు సహజంగానే తమకి

తెలిసినపదాలు తెలిసినట్టు ఉపయోగిస్తూ రాస్తున్నారు. వీరందరూ రాయకూడదు అని నేను అనడం లేదు. ఎవరైనా తమ భావాలు, ఆలోచనలు పంచుకోవడం ఆనందించదగ్గ విషయమే. ఎటొచ్చీ ఏ పదాలు ఆమోదయోగ్యం, ఏవి కాదు అని నిర్ణయించేది ఎవరు? మీరిలాగే రాయాలి అని చెప్తే ఎంతమంది వింటారు? పనిలో పనిగా ఈ రాయు, వ్రాయు పదం కూడా అలాటిదే అని చెప్పక తప్పదు.

మనం గుర్తించవలసిన మరొక అంశం సాంకేతికం. ఒకొకరు వాడే ఖతిలో కొన్ని అక్షరాలు లేకపోవడం, కొందరికి అవి ఎక్కడున్నాయో తెలియకపోవడంతో పాటు auto-correct లీలలు కూడా గణనలోకి తీసుకోవాలి. యూనివర్సిటీలలో తెలుగు బోధిస్తున్న ప్రొఫెసర్లు సైతం జ్ఞానం అన్నపదం జ్నానం అని రాస్తున్నారంటే, తెలీక కాదు కదా. వీటిగురించి నేను అట్టే పొడిగించక్కర్లేదు. కంప్యూటరు వాడుతున్న వారందరికీ విదితమే. నిజానికి **పలుకుబడి** పుస్తకంలో నిష్ట్రయోజనాలు(పు.19) అని కనిపించింది ఒకచోట. ద్విత్వంలో ప కి బదులు ట పడింది. ఇది డిటిపీ పొరపాటు అనే అనుకుంటున్నాను. అది చూసి రామచంద్రగారు ఏమనుకున్నారో తెలీదు.

నాకు కుతూహలం కలిగించిన మరో అంశం ఈ వ్యాసాలలో ఇంగ్లీషు హిందీ పదాలు దొర్లడం. "బడా బడా" రచయితలు (పు. 41) అన్నప్పుడు వ్యంగ్యం అనుకోవచ్చు. కానీ "దునియా" (పు. 53) "ప్లీజ్" (పు. 45) వాడవలసిన అవుసరం కనిపించదు. ఫరవాలేదు ఇంగ్లీషు పదాలకి వ్యాకరణసూత్రాలు వర్తించవు అని అనుకుంటే తప్పు.

ఈ వ్యాసాలు తెలుగుభాషయందు అభిమానం గలవారికి మంచి పాఠాలు. భాష నిలబడాలంటే ఇలాటి వివరణలఅవుసరం ఉంది నిస్సందేహంగా. స్కూళ్లలో ఈనాటి సిలబస్ నాకు తెలీదు కానీ ఛందస్సు బోధిస్తున్నారని యూట్యూబులో కనిపించింది. ఇలా భాషకి సంబంధించిన గుణింతాలు, నిర్దుష్టమైన అర్థాలూ, అవి తెలుసుకునే విధానాలు బోధిస్తే బాగుంటుంది.

పత్రికలలో భాషాపరమైన వ్యాసాలు బాగానే వస్తున్నాయి. ఆవరసలోనే పత్రికలు ప్రతి సంచికలోనూ ఇలాటి వివరణలకి స్థలం కేటాయించి వ్యాకరణశాస్త్రం తెలిసిన రచయితలచేత ఇలా కొన్ని పదాల అర్థాలు, ప్రయోగాలు వరసగా ప్రచురిస్తే సాహిత్యసేవ చేసినవారవుతారు. ఆ పదాలు ఆ పత్రికలలో వాడబడినవే అయితే మరింత సౌకర్యం.

తెలుగుభాష నీరసించిపోతోంది అని విచారిస్తున్నవారూ, భాషాదినాలు జరిపే భాషాభిమానులూ గమనించవలసిన కోణం ఇది నాదృష్టిలో.

(జులై 3, 2023).

# ఏభాషలో ఆలోచిస్తున్నారు?

ఇంతవరకూ మీమాతృభాష ఏది అని అడిగేవాళ్లం. ఇప్పుడు మీరు ఏభాషలో ఆలోచిస్తున్నారు? అని అడగాలి. ఎందుకో చెప్తాను. నేను భాషాశాస్త్రాలు చదివినదాన్ని కాను. నాకొచ్చిన పిసరంత తెలుగూ 40, 50 దశకాల్లో భాషయందు మంచి పట్టుగల విద్వద్వరేణ్యులు రాసిన కథలు చదవడంవల్ల వచ్చింది మాత్రమే. ఈరోజుల్లో వస్తున్న తెలుగు చూసేక, నాకు కలిగిన అభిప్రాయాలు పంచుకుంటున్నానిక్కడ.

నేను అమెరికా వచ్చిన కొత్తలో ఎవరితోనైనా మాటాడుతున్నప్పుడు ఎదటివారి మాటలు తెలుగులోకి మార్చుకుని, తెలుగులో జవాబు ఆలోచించి ఇంగ్లీషులో జవాబు చెప్పేదాన్ని. కొంతకాలానికి ఇంగ్లీషు అలవాటయేక, ఇంగ్లీషులో ఆలోచించడం మొదలుపెట్టేను నాకు తెలీకుండానే. నాపరిసరాల్లో నాచుట్టూ ఉన్నవారంతా ఇంగ్లీషు మాటాడేవారు కావడంచేత, తెలుగు ఎక్కడా వినిపించకపోవడంచేత అలా జరిగిందని తెలుసుకోడానికి కూడా చాలాకాలం పట్టింది.

గత 10-15ఏళ్ళలో అయిఉంటుంది నాకు నేనే ఇది అర్థం చేసుకుని, మళ్ళీ తెలుగులో ఆలోచించే ప్రయత్నం మొదలుపెట్టేను. ఆ తరవాత ఫేస్బుక్ చూసి, ఖాతా తెరిచి, తెలుగులో రాయగలిగినవారిని మాత్రమే చేర్చుకుంటూ వచ్చేను. నా ఫేస్బుక్ పేజీ తెలుగునుడికారం చూసుకోడానికే తప్ప నాకు ఏ ఇతర స్నేహాలు పెంచుకునే ఆసక్తి లేదు.

నాపేజీలో తెలుగులో రాయగలిగినవారినే చేర్చుకుంటానని ప్రకటించేక, నేను గమనించిన మరో వింత – తెలుగులో రాయాలి అంటే తెలుగుమాటలు, తెలుగులిపి అని ప్రత్యేకించి చెప్పుకోవలసివస్తుందని గ్రహించకపోవడం. నారోజుల్లో తెలుగొచ్చా అంటే తెలుగులో రాయడం, తెలుగుఅక్షరాలే రాయడం, తెలుగులో మాటాడడం అంటే తెలుగుపదాలే వాడడం అని ప్రత్యేకంగా వేరే వివరించి చెప్పవలసిన అవుసరం ఉండేది కాదు. ఏభాషలో మనం ఆలోచిస్తున్నాం అని ఆలోచించుకునే సమయం వచ్చింది ఇప్పుడు అని అందుకే అంటున్నాను. తెలుగు వస్తే చాలదు. వాడుకలో కనిపించాలి.

ప్రస్తుతం ఇలా ఉంటున్నాయి -

సరే కి బదులు okay.

అవును, అంతేమరి, నిజంలాటి పదాలకి బదులు yes

వాన కి బదులు rain

అన్నం, భోజనం, ఫలహారంకి బదులు food. (ఇక్కడ మరోబాధ పు ఫు కి తేడా తెరమీద కనిపించదు)

అన్నానికి rice అంటున్నారు. నిజానికి మనకి వండితే అన్నం, వండకపోతే బియ్యం. ఈతేడా ఇంగ్లీషు పదానికి లేదు.

అలాగే salt, water, milk లెక్కకుమించి ఉన్నాయి మీకూ తెలుసు.

అన్నిపదాలకీ అచ్చమైన తెలుగుపదాలు ఉండవు. అలాటివి Of course, correct, exactly. ఇలాటివి కాదు నేను అంటున్నది అని మరోమారు మనవి చేసుకుంటున్నాను.

దీనికి కారణం కొంతవరకూ మన సమాజం, సంస్కృతి అని చెప్పుకోవచ్చు. మనజనాభా కారణంగా మనకి ఎదుటా, చుట్టూ ఉండే మనుషులు ఎక్కువ. మాటలతో కాక, ముఖకవళికలలోనూ, హస్తవిన్యాసంతోనూ అనేక భావాలు అతి తేలిగ్గా ప్రకటించే సంస్కృతి మనది. నడవలో  పట్టెమంచమ్మీదో కూర్చుని సంసారచక్రం తిప్పేసే నాయనమ్మల సంస్కృతి మనది.

ఇవి ఇలా ఉండగా, ప్రస్తుతం తెలుగుభాషలో చోటు చేసుకుంటున్న మరో విపరీతం – దీన్ని నేను విపరీతమనే అంటాను – ఇంగ్లీషు పదాలతో తెలుగు ప్రయోగాలు. నిజానికి ఇవి తెలుగూ కాదు ఇంగ్లీషూ కాదు. రెండుభాషలకీ చెడిన రేవడులు అనాలి.

మానాన్న fire అయిపోయేడు

నేను fix అయిపోయేను

light తీసుకోండి.

— ఇక్కడ కొంత వివరణ అవుసరం. lightగా తీసుకోండి అని గా ప్రత్యయంతో వాడితే కొంత నయం కానీ light తీసుకోండి అంటే అర్థం లేదు. ఇంగ్లీషులో Take it lightly అని వ్యాకరణసమ్మతమైన ప్రయోగం.  Urban Dictionary అని ఒకటుంది ఒకరకంగా మాండలీకంలాటిది. అందులో light కి అర్థం Means shut up or chill depending on the situations.

మరో వింత ప్రయోగం అండీ. ఇది నిజానికి విడిగా ఒక పదం కాదు. విడిగా వాడేది ఒక లోహపాత్ర అయితేనే. లేకపోతే అది ఒక ప్రత్యయం. సంతోషమండి, వచ్చేరండి అంటూ మరో పదానికి జోడించాలి. మొదట్లో నాకు నచ్చలేదు కానీ క్రమంగా నేనూ వాడేస్థితికి వచ్చేను, ప్రతిచోటా కాకపోయినా.

అలాగే "hand ఇవ్వడం". నాలుగేళ్ళక్రితం ఎవరో వివరించి చెప్పేవరకూ నాకు అర్థం కాలేదు అదేమిటో. నాకు తెలిసిన ఇంగ్లీషు వాడకంప్రకారం hand ఇవ్వడం అంటే చెయ్యి అందివ్వడం, సాయం చేయడం అని.

మనకున్న తెలుగుపదాలు కూర, పచ్చడిలాటివి వాడడం మానేసి కర్రీ, చెట్నీ వాడడాలు ఎలా వచ్చాయో తెలుసా? కరీ, చెట్నీ తమిళపదాలు. పాశ్చాత్యులకి ఈవస్తువులు లేవు కనక వారు తమిళపదాలు తీసుకున్నారు. ఏభాషలో అయినా మరోభాషకి సంబంధించిన పదాలు ఇలాగే చేరడం జరుగుతుంది. వాళ్ళకి లేవు కనక వాళ్ళు తీసుకున్నారు. మనం చుట్టుతిరిగి మన పొరుగువారిపదాలు ఇంగ్లీషు వర్ణక్రమంతో స్వీకరించాం. అంటే కరీ అనే ఉచ్చారణ అయినా curryలో రెండు Rలు తీసుకుని కర్రీ చేసుకున్నాం. అంతే కానీ మనకున్న తెలుగుపదాలు మాత్రం మనకి పనికిరాలేదు.

Bath take చేసేరా, throw చేయకండి లాటివి, అదర్సు, హాపీసు లాటి పదాలగురించి నేనింక చెప్పలేను. నాకయితే ఒంటిమీద జెర్రులు పాకినట్టుంటుంది అవి వింటున్నప్పుడు.

ఒకభాష పదాలు మరొకభాషలో చేరడం సాధారణంగా జరిగేదే. అందులో ఆశ్చర్యం లేదు. నిజానికి 19వ శతాబ్దపు పాశ్చాత్యనవలలో భారతీయపదాలు మీరూ గమనించే ఉంటారు. నాకు తెలిసి మామూల్, బక్షీస్, వెరండా లాటి పదాలు ఇలా చేరినవే. ఇప్పుడు అమెరికాలో యోగా, కర్మా, నిర్వానా లాటివాడుక అందరికీ తెలిసినదే. వారి సంస్కృతిలో వాటికి సరి తూగగల పదాలు ఉన్నప్పుడు కూడా ధ్వనిలో లేదనిపిస్తే మరోభాష పదాలు తీసుకుంటారు. అలాగే వస్తువులు ఏదేశంనుంచి వచ్చేయే వారిపదాలే వాడకలో స్థిరం చేసుకుంటారు.

వ్యాకరణసిద్ధాంతాలు ఎలా పుట్టేయంటే ప్రజలు వాడుతున్న మాటలు సమీకరించి, సూత్రాలు తయారు చేసినవే కదా. అలాగే ఇప్పుడు కొత్తగా వస్తున్న వ్యావహారికపదాలు కాలక్రమంలో స్థిరపడతాయేమో. అన్నీ కాకపోయినా కొన్ని స్థిరపడొచ్చు. నాకు తెలీదు. కానీ ప్రస్తుతానికి నాకు అంతగా రుచించడంలేదని మాత్రం చెప్పగలను. నేను ప్రామాణికం కాదులెండి. నాకేమీ భాషాశాస్త్ర డిగ్రీలు లేవు.

ఒక్కమాటలో పై ప్రయోగాలు చూసినప్పుడు మాత్రం తెలుగు నా తల్లిభాష అని చెప్పుకోడం అర్థరహితం అనుకునే స్థితికి వచ్చేసిందనే అంటాను. మనకి తల్లిభాష అంటూ ఏమీ మిగలలేదు ప్రయోగపరంగా ఒక కంగాళీభాష తప్ప, అంతే..

**ఇది సారంగ, సెప్టెంబరు 15, 2020లో ప్రచురించిన వ్యాసం. కొన్ని మార్పులతో మళ్లీ ఇక్కడ పంచుకుంటున్నాను.**

(సెప్టెంబరు 15, 2020)

# రచనలలో అసంగతాలు

అసంగతాలు పదం factual errors అన్న అర్థంలో వాడుతున్నాను. వ్యాసాలలో, ఉపన్యాసాలలో అప్పుడప్పుడు చూస్తుంటాం అసంగతాలు. పొరపాట్లు, తప్పులు అని కూడా అనొచ్చు. ఈ వ్యాసం అచ్చుతప్పులగురించి కాదు. అది వేరే విషయం. ఈవ్యాసంలో నేను ప్రస్తావిస్తున్నది - విషయచర్చలో రూఢి కాని, కావని రచయిత గమనించని అంశాలగురించి.

ఈనాడు అంతర్జాలంలో అనేకరూపాలలో రచనలు వస్తున్నాయి కని విని ఎరుగనంత విరివిగా. చాలామటుకు ఎవరికి తోచినవి వారు రాస్తుంటారు. అట్టే పరిశోధన ఉండదు. ఎవరో అన్నమాట, ఎక్కడో విన్న కబురు, ఎక్కడో లీలగా చూసిన జ్ఞాపకం, ఆ క్షణానికి తోచినమాట – ఇవన్నీ అంతర్జాలంలోనూ అచ్చుపత్రికలలోనూ కుప్పలుతిప్పలుగా వచ్చి పడిపోతున్నాయి ప్రతిరోజూ. వీటికి ఋజువులూ సాక్ష్యాలూ ఉండవు. ఎవరూ పట్టించుకోరు కూడాను. ఏ మిత్రమండలిలోనో కొందరు వాదించుకోడం కనిపిస్తుంది కదాచితుగా.

కొందరు కొంత శ్రమ తీసుకుని, శాస్త్రీయంగా విషయసేకరణ ప్రారంభించి, ఆ యా రంగాల్లో ప్రసిద్ధులని కలుసుకుని, అడిగి తెలుసుకొని, పుస్తకాలు సంప్రదించి, ఆ విషయాలని అన్నిటినీ చేతనయినంతవరకూ సమగ్రంగా పరిశీలించి ఒక నిశ్చితాభిప్రాయానికొచ్చి గ్రంథస్థం చేస్తారు. వాటిలో పొరపాట్లు ఉంటే అవి నిర్లక్ష్యంవల్లనో అలసతతోనో చేసినవి కావు. వారు మరొక వనరుమీద ఆధారపడడంవల్ల జరిగినవి అయి ఉంటాయి చాలామటుకు.

నావ్యాసాలలో కూడా ఇలాటి పొరపాట్లు జరిగేయి. మరొకరు నిశ్చయంగా తెలిసినవారు, అలాటి అసంగతాలు ఎత్తి చూపినప్పుడు వెంటనే దిద్దుకుంటూ వచ్చేను. ఇప్పుడు కూడా నారచనలలో అలాటి పొరపాట్లు ఖచ్చితంగా తెలిసినవి చెప్తే. తప్పకుండా సరి దిద్దుతాను.

ఎటొచ్చీ ఈ దిద్దుకోడంలోనే బాధలు. ఈనాడు అంతర్జాలంలో విస్తృతంగా ప్రచురణలు జరుగుతున్నాయి. జాలపత్రికలలో గానీ, స్వంత బ్లాగులలో గానీ. స్వంత బ్లాగులయితే దిద్దుకోడం తేలికే. అంతర్జాలపత్రికలలో మార్చే అవకాశం లేదు.

నేను సంపాదకులని తప్పు పట్టడం లేదు. ఆ పత్రికలసంపాదకులు అనేక బాధ్యతలూ వ్యాపకాలమధ్య ఈ సంపాదకత్వం చేపట్టి పత్రిక నడుపుతున్నారు కనక ఈ తప్పులు దిద్దడానికి వ్యవధి ఉండదు. పాఠకులు ఆ పొరపాటు ఎత్తి చూపినప్పుడు, రచయిత అంగీకరిస్తూ మరొక వ్యాఖ్య పెట్టవచ్చు. తనకి ఏ వనరు ఆధారమయిందో కూడా చెప్పవచ్చు. కానీ ఆ దిద్దుబాటు వ్యాఖ్య అందరూ చదవకపోవచ్చు.

మరొకరకం ఒకరో ఇద్దరో సంపాదకులు కాక సమష్టిగా నడిపే వికిపిడీయాలాటి సైటులు ఉన్నాయి. వాటిలో ఎవరైనా మార్చవచ్చు. అంటే పూర్తిగా దిక్కులేని సైటులు అని కాదు నాఅభిప్రాయం. వాటికి administrators ఉంటారు. వీలయినంతవరకూ ఆ దిద్దుబాట్లమీద ఓ కన్నేసి ఉంచుతారు.

ఒకొకప్పుడు ఈ అసంగతాలు దిద్దడం కూడా చిన్నరకం యుద్ధమే అవుతుంది. వికిపిడియాలో సరయు రావుగురించి ఒకరు వ్యాసం చేర్చేరు. ఆ తరవాత కొంతకాలానికి మరెవరో సరయు రావు కన్నడ నటి అని, ఇంజినీరింగ్ చదివిందనీ, అంటూ ఇంకా ఆ కన్నడనటికి సంబంధించిన వివరాలు చేర్చేరు. సరయు రావుని అన్న కన్నడనటి ఉంది కానీ వికిపిడియాలో వ్యాసం ఆ సరయు రావుగురించి కాదు అని నాకు స్పష్టంగా తెలుసు కనక నేను ఆ వివరాలు తొలగించేను. నాలుగు రోజులు పోయేక చూస్తే, మళ్లీ ఆ వివరాలు చేర్చినట్టు కనిపించింది. ఇలా రెండు చుట్లు అయేక, నేను మళ్ళీ ఆ వివరాలు తొలగించి, అధికంగా ఆ వ్యాసందగ్గర "చర్చ" విభాగంలో ఆ గందరగోళం స్పష్టం చేసేను, "ఆ వ్యాసంలో ప్రస్తావించిన అమెరికన్ నటి సరయుని నాకు తెలుసు. నేను ఈ సరయు తల్లిని. ఈ సరయు రావు ఇంజినీరింగు చదవలేదు. అలాగే మిగతా వివరాలు సరి కావు. దయచేసి మార్చకండి," అని. చెప్పొచ్చేదేమిటంటే ఒకొకప్పుడు ఇంత తతంగం కావలసి వస్తుంది ఆ అసంగతాలు సరి చేయడానికి కూడా.

ఇక్కడ ముఖ్యంగా గమనించవలసింది పొరపాట్లు ఎత్తి చూపడంలో తప్పు లేదు. నిజానికి అలా ఎత్తి చూపడం మంచిదే. అది కూడా సాహిత్యసేవే. ఎటొచ్చీ, తమకి తెలిసింది కనక యథార్థం అని కాక, తరిచి చూసుకుని, నిర్ధారణగా తెలిసినప్పుడే చెప్పాలి. లేకపోతే పైన చెప్పిన అవకతవకలే స్థిరమై రచనని మరింత అధ్వాన్నం చేస్తాయి. ఆపైన దాన్ని నమ్ముకుని మరికొందరు ఆ తప్పునే ప్రచారం చేస్తారు, తెలియకుండానే.

ఇంక అచ్చు పత్రికలయితే చెప్పనే అఖ్ఖర్లేదు. అచ్చయిపోయేక అవి అక్షరాలా శిలాక్షరాలే. రచయిత చేయగలిగిందల్లా ఆ పుస్తకం మరో ప్రచురణకి నోచుకుంటే, ఆ అసంగతాలు సరి చేసుకుని, ఆ విషయం ముందుమాటలో విశదం చేసి ప్రచురించవచ్చు. అలా చేసినా అప్పటికే లైబ్రరీలలోనూ, స్వంత లైబ్రరీలలోనూ ఉన్న పుస్తకాలమీద ఆధారపడి ఇంకా కొందరు వ్యాసాలలోనూ ఉపన్యాసాలలోనూ ఆ పొరపాటునే ప్రచారం చేసేయవచ్చు కూడా.

**కథానిలయం** సైటులో నా జన్మస్థలం అదిలాబాదు అని ఉంది. నాగురించి ఎవరైనా ఒక వ్యాసం రాస్తే ఆ సైటు ఆధారంగా నాజన్మస్థలం అదిలాబాదు అనీ, నేను తెలంగాణా రచయిత్రిని అనీ రాస్తారు. కథానిలయంవారిని తప్పు పట్టడం నాఉద్దేశం కాదు. వారికి ఆ ఉప్పు అందడానికి

కారణం మరో వనరు కావచ్చు. రచనలలో పొరపాట్లు ఎలా జరుగుతాయో చూపడం మాత్రమే నా ఉద్దేశం.

ఒకొకప్పుడు కొందరు మీరచనలో అసంగతాలు ఉన్నాయండి అంటారు కానీ అవేమిటో చెప్పరు. స్పష్టంగా ఇదీ తప్పు అని చెప్తే దిద్దుకోడానికి అవకాశం ఉంటుంది, కానీ తప్పులున్నాయి అంటే ఏం చేస్తాం? తప్పని తెలీకే కదా అలా రాయడం జరిగింది. తెవికీలో పి, శ్రీదేవిగారి మరణించిన తేదీ తప్పు అని వారి అమ్మాయి నాకు మెయిలిచ్చేక, నేను మార్చేను.

ఇంతకీ నామనవి ఏమిటంటే, మీరు వ్యాసం రాసినా ఉపన్యాసం ఇచ్చినా, ఏదో ఒక వనరుమీదే ఆధారపడకుండా, మరిన్ని వనరులు సంప్రదించమని. అప్పుడయినా ఇలాటి పొరపాట్లు పూర్తిగా రాకుండా పోతాయనను కానీ కనీసం తగ్గే అవకాశం ఉంటుంది. జీవించి ఉన్న రచయితలయితే, వారినే నేరుగా సంప్రదించడం ఉత్తమం.

ఇన్ని చేసినా పొరపాట్లు రావచ్చు. కనీసం మనప్రయత్నం మనం చేసేం అన్న సంతృప్తి, అంతే. ముఖ్యంగా మీరు చదివినదంతా నూటికి నూరుపాళ్ళూ యథార్థం అన్న నిర్ణయానికి వెంటనే వచ్చేయకండి. పొరపాట్లు ఉండొచ్చు అనుకుంటూ చదవడమే క్షేమం.

(ఆగస్టు 7, 2020)

# సంకలనాలగురించి

సంకలనాలు కూర్చడంలో వివిధ అంశాలను నేను రెండు పోస్టులలోనూ, కల్పనా రెంటాలతో 2012లో ఇంటర్వ్యూలోనూ ప్రస్తావించేను. అలా వేరువేరు పోస్టులలో ఉన్న అభిప్రాయాలు ఇక్కడ పెడుతున్నాను. నాబ్లాగులో వ్యాసాలకి చివరలో లింక్స్ ఇచ్చేను.

ooo

కల్పనా రెంటాలతో నా ఇంటర్వ్యూ. జులై 2012లో. అందులో సంకలనాలకి సంబంధించిన భాగం మాత్రమే ఇక్కడ పంచుకుంటున్నాను. పూర్తిపాఠానికి లింకు చివర్లో యిచ్చేను.

## ఇంటర్వ్యూ

కల్పన - – ఈనాటి సంకలనాలు ఎలా ఉంటున్నాయి?

మాలతి - సంకలనాలు విస్తారంగా వస్తూనే ఉన్నాయి. ఇవి రెండు వర్గాలు. ఒక వర్గం కేవలం ఒకే రచయిత రచనలు, స్వయంగా ప్రచురించినవి కానీ ఒక సంస్థ ప్రచురించినవి కానీ. ఏదైనా, వాటిలో ఎంపికప్రశ్న లేదు. రెండోవర్గం ఒక సంస్థ కానీ ప్రచురణకర్తలు కానీ ప్రచురించే సంకలనాలు. వీటిలో ఆ సంస్థ లేదా ప్రచురణకర్తల ధ్యేయాలప్రకారం ఉంటాయి ఎంపికలు. ఈ రెండో వర్గంలో మళ్లీ చారిత్ర్యకం లేదా ఒక వాదం కేంద్రసూత్రం అయిఉంటుంది. బహుశా 90లలో మొదలయిందేమో సాహిత్యప్రయోజనం మాత్రమే ఏకైక సూత్రంగా ఎంపికలు జరగడం. ఏ సంకలనం తీసుకున్నా ఆ రచయితలే, ఆ కథలే కనిపిస్తున్నాయి తెలుగుదేశంలో మరి కథకులు లేరేమో అన్నట్టు.

విశాలాంధ్రవారు ప్రచురించిన బృహద్గ్రంథం “తెలుగు కథ, 1910-2000” తీసుకోండి. ఈ సంకలనం పేరు చూసినప్పుడు ఆ తొంభై ఏళ్ళలో తెలుగుకథ తీరుతెన్నులు ఎలా ఉండేవో తెలుస్తాయనే అనుకుంటాం సహజంగా. నేను అలాగే అనుకున్నాను. అంటే తెలుగులో వస్తున్న వివిధ కోణాలూ, వివిధ దృక్పథాలూ, వివిధ శైలులూ, వివిధ భాషావిన్యాసాలు చూస్తాం కాబోలు అని. కానీ ఈ కథలన్నీ ఒకే ఒక కోణం – సామాజిక ప్రయోజనం – సమాజకేంద్ర దృష్టిని ప్రధానంగా పెట్టుకుని ఎంచుకోడం జరిగిందన్నారు సంపాదకులు. అంచేత వైయక్తికమైన మానసికచిత్రణ, తదితర కోణాలు ఈ సంకలనంలో చోటు చేసుకోలేదు. ఉదాహరణకి, బుచ్చిబాబు **నాగురించి కథ రాయవూ**, లేదా శ్రీరమణగారి **మిథునం** లాటి కథలకి ఇక్కడ స్థానం లేదు.

నిజానికి, మిథునం కథలో సమాజకేంద్ర దృష్టి ఉంది- ఒక తరం ముందు దంపతులమధ్య సంబంధాన్ని, ఆత్మీయస్పర్శలనూ చిత్రించేరు ఆకథలో రచయిత. అది హింసాత్మకం కాదు, సాత్వికం.

అంచేత అది సమాజకేంద్ర దృష్టి కాకుండా పోయింది అనుకోవాలి. అంటే మానవసంబంధాలకి సంబంధించిన కథలు అన్నీ ఎంచుకోలేదు అనే అంటాను.

**సంకలనాలకి ఒక లక్ష్యం ఉండడం అవుసరమే. అయితే ఒకకాలంలో వచ్చే సంకలనాలన్నీ అన్నీ ఒకే మూసలో ఉంటే సాహిత్యచరిత్ర సమగ్రం కాదు. ప్రస్తుతం నేను చూసినంతవరకూ సంకలనాలన్నీ స్త్రీవాదకథలు, దళితకథలు, రాజకీయకథలు అంటూ ఏదో ఒక అంశం మాత్రమే తీసుకోడం జరుగుతోంది. అలాటికథలకే ఆదరణ పత్రికలలో కూడా.**

**కల్పన** – ఒక కోణం మాత్రమే ప్రాతిపదికగా సంకలనాలు సమకూర్చకూడదా?

మాలతి - సాహిత్యం మహా సాగరం, నిరంతరప్రవాహం. సంపూర్ణంగా సాహిత్యచరిత్ర రాయడం ఎప్పుడూ సాధ్యం కాదు. అంచేతే తెలంగాణా సాహిత్యచరిత్ర, రాయలసీమ సాహిత్యచరిత్ర, స్త్రీల సాహిత్యచరిత్ర, కృష్ణాజిల్లా సాహిత్యచరిత్ర, స్త్రీవాదం, దళితవాదం … ఇలా ఒక్కొక్క విభాగం తీసుకుని సంకలనాలు వస్తున్నాయి. అది మంచిదే. కానీ ప్రస్తుతం ఇందులో కూడా రెండు లోపాలు కనిపిస్తున్నాయి. ఒకటి, ఎవరు చేసిన సేవ ఏమిటి, ఎవరికథలు ఎంచుకోవాలి అన్న విషయంలో వ్యక్తిగతమైన అభిమానాలు ఆధారంగా సంకలనాలు తయారు చేయడం ఎక్కువగా కనిపిస్తోంది. "ఇరవయ్యశతాబ్దపు రచయిత్రులు" అని పేరు పెట్టిన కథలసంకనలంలో నాకు తెలిసిన కొందరు ప్రముఖ రచయిత్రులకథలు లేవు. కొన్ని కథలు సంకలనకర్తల వ్యక్తిగత ఇష్టాయిష్టాలు ఆధారంగా తీసుకున్నట్టు కనిపిస్తోంది. ఇది సాహిత్య ఎకాడమీ ప్రచురణ. ఇది సాహిత్యచరిత్ర దృష్ట్యా న్యాయం కాదు అంటున్నాను. సాహిత్య ఎకాడమీవంటి ప్రతిష్ఠాత్మక సంస్థలు మరింత బాధ్యాతయుతమైన సంకలనం తేవాలి భావి పాఠకులకు 20వ శతాబ్దపు రచయితలు ఎవరు, వారు ఏవిషయాలు ఆవిష్కరించేరు అన్నవి తెలియాలి కదా. అసమగ్రమైన భావజాలంతో కూడిన సంకలనాలమూలంగా సమాజాన్నిగురించిన అవగాహనలో లోపం జరగదా అని నాప్రశ్న.

కల్పన – అంటే సంకలనాలన్నీ తప్పనిసరిగా వైవిధ్యం కలిగి ఉండాలా?

మాలతి - ఒక రచయితో ఒక సాహిత్యాభిమానో తనకి నచ్చిన కథలు మాత్రమే ఎంచుకుని సంకలనం వేసుకోడం తప్పనడంలేదు నేను. నిస్సందేహంగా వారికి ఆ హక్కుంది. కానీ "ఈవారం నన్ను దర్శించుకున్న రచయితలకథలే నాసంకలనంలో చేర్చుకుంటాన"నో, "నల్లచీరె కట్టుకున్నవారి కథలకి మాత్రమే నాసంకలనంలో స్థానం" అనో నియమం పెట్టుకుని, ప్రచురించేసంకలనాలవల్ల బహుశా ఏదో ఒక కోణం ఆవిష్కరింపబడుతుంది అని ఒప్పుకుంటాను. కానీ వాటిప్రయోజనం పరిమితం కావచ్చు. నేను ఖచ్చితంగా చెప్పలేను.

మరి నాదృష్టిలో సమగ్రమైన సాహిత్యచరిత్ర సృష్టించడానికి ఎవరు పూనుకోవాలంటే ఎకాడమీలు, విశ్వవిద్యాలయాలు. వారు విస్తృతపరిధిలో సమాజం ప్రాతిపదికగా బాధ్యతాయుతంగా ప్రచురించాలనుకుంటాను. బహుముఖాలుగా విస్తరించుకుంటున్న మన సాహిత్యాన్ని తమ ఎంపిక ప్రతిబింబిస్తోందా లేదా అన్నది పరిశీలించి చూసుకోవాలి. వారు సంకలనం సమకూర్చే పని ఎవరికి

అప్పచెప్తున్నారో, వారి సామర్థ్యాలు, అర్హతలూ, ఏమిటో జాగ్రత్తగా పరిశీలించి చూసి, సంకలనంయొక్క ధ్యేయం ఆ సంపాదకులకి చక్కగా వివరించి చెప్తే, ఆ సంపాదకులు ఆ విషయం మనసులో పెట్టుకుని ఎంపిక చేస్తేనే మనకి మంచి సంకలనాలు వచ్చే అవకాశం ఉంటుంది.

కల్పన – రచయితలు ఎవరికి వారు ప్రచురించుకుంటున్న సంకనాలమాట ఏమిటి మరి?

మాలతి - ఈసంకలనాల్లో రచయితలు తీసుకున్న వస్తువులో, కథ నడిపిన తీరులో వైవిధ్యం ఉండొచ్చు కానీ మళ్లీ మార్కెటింగుమాట వచ్చేసరికి, ముందు చెప్పిన బాధే. "సాంఘికప్రయోజనం ఉన్న కథలయితేనే పాఠకులు కొంటారు" అంటారు ప్రచురణకర్తలు. అంతే కాక, ఈ కథలన్నీ పత్రికలశంఖంలో పోసి, తీర్థం అనిపించుకున్న తరవాతే కదా సంకలనాలుగా వెలువడడం. అంచేత ఆ కళలే ఇక్కడ కూడా కనిపిస్తాయి.

కల్పన - – పత్రికలు, ఎడిటర్లు, పత్రికాధిపతులు – వీరి బాధ్యలు ఏమిటి?

ముఖ్యంగా సామాజికస్పృహ అన్నది పరీక్షించి చూస్తే, ఈనాటి పండితులు చాలామంది లెక్కలోకి తీసుకోని కథలు చాలా కనిపిస్తాయి. వారిమూసలో పట్టని కథలని నిర్లక్ష్యం చేయడంవల్ల జరిగే ఒక నష్టం ఏమిటంటే, రానున్నతరాలకి ఈనాటిసమాజంగురించిన అవగాహన సమగ్రంగా ఉండదు. సంపాదకులు, పత్రికాధిపతులు ఈ కోణం గమనించడంలేదనే నేననుకుంటున్నాను.

(ఇంటర్వ్యూలో సంకలనాలకి సంబంధించిన భాగం ఇంతే. కల్పనా రెంటాలతో నా ఇంటర్వ్యూ కి లింకు ఇక్కడ )

000

పుష్కరానికోమారు కొందరు సాహిత్యాభిమానులు శ్రద్ధ తీసుకుని కొన్ని ఉత్తమకథలు తవ్వి తీసి సంకలనంగా ప్రచురిస్తారు. నాకు తెలిసిన అలాటి ప్రచురణ 1995లో గుంటూరు జిల్లా రచయితలసంఘంవారు ప్రచురించిన **విస్మృతకథ**. ఈసంకలనంలోనే చూసేను పి. సరళాదేవిగారి కథ **ఎదురు చూసిన ముహూర్తం.** తరవాత అనువాదం చేసి తూలిక.నెట్ సైటులో ప్రచురించేను కూడా. అలాగే ఈమధ్యనే శీలా సుభద్రాదేవి **కథారామంలో పూలతావులు** అన్న సంకలనం ఒకటి తీసుకొచ్చేరు. ఈ పుస్తకానికి నాసమీక్ష ఈ వ్యాసంచివరలో ఉంది.

అందుచేత నేను కోరేది విజ్ఞులైన పాఠకులు, రచయితలు ఈవిషయంలో కొంచెం శ్రద్ధ చూపండి అని.

(మార్చి 2, 2019)

## సంకలించడం శ్రమ

సంకలనం సమకూర్చడం శ్రమతో కూడిన పని. అందుకు సందేహం లేదు. మామూలుగా, సంకలనకర్తలు తాము సంకలనం వేస్తున్నట్టు ఓ ప్రకటన ఇస్తారు. వారిదృష్టిలో పేరున్నరచయిత అనుకుంటే వారికి విడిగా మరో ఉత్తరం కూడా పంపుతారు. లేదా తెలిసినవారిద్వారా సందేశం అందజేస్తారు. అప్పటికీ రచయిత కథ పంపకపోతే ఏమి చేయాలి? నేనయితే, ఆరచయితకి సమ్మతం కాదు అని ఊరుకుంటాను.

కానీ ఇప్పుడు అలా కాదు. "మేం అడిగేం. రచయిత ఇవ్వనని చెప్పలేదు కనక ఇష్టమే అనుకుని, వేసుకున్నాం," అంటున్నారు కొందరు సంకలనకర్తలు. నిజానికి ఇది సమ్మతం కాదు. ఏ జవాబూ లేకపోతే, ఇష్టంలేదనే అర్థం.

మరో పద్ధతి రచయిత ఎక్కడున్నారో తెలీలేదు, అంచేత వేసుకున్నాం అని చెప్పడం. ఇది ఎప్పుడు సమర్థనీయమో చెప్తాను. కాపీరైటు నిబంధనలప్రకారం, రచయిత గతించేక మరో 50 ఏళ్ల తరవాత, కాపీరైటు హక్కుదారులెవరూ లేరని దృఢపరుచుకున్న తరవాత మాత్రమే, ప్రచురించుకోవచ్చు. ఈ నియమాలు దేశదేశాలకీ మారుతాయి కనక అది మీదేశంలో కాపీరైటు నియమాలు మీరే చూచుకోవాలి. మరో సందర్భం రచయిత కానీ కాపీరైటుహక్కుదారు కానీ దొరక్కపోతే, Fair use అన్న నియమాన్ని అనుసరించి, వ్యాపారసంబంధం కాకపోతే మాత్రమే అనువాదం చేయడం కానీ, సంకలనంలో చేర్చడం కానీ చేయవచ్చు. నేను అనువాదాలు చేసినప్పడు ఇలా జరిగింది కొందరు రచయిత్రులవిషయంలో. కానీ తేలికగా దొరకగల రచయితల విషయంలో ఇలా అనడం న్యాయం కాదు.

**స్త్రీవాదకథలు** సంకలనంలో నాకథ నన్నడక్కుండా వేసుకున్నారని నేను Facebookలో ప్రస్తావించినప్పుడు ఆ సంకలనకర్త పైన చెప్పినకారణమే చెప్పేరు. కానీ కె. రామలక్ష్మిగారు కూడా తనకథ కూడా ఆవిడని అడక్కుండానే వేసుకున్నారని నాతో అన్నారు. నేనూ, రామలక్ష్మిగారూ అంత అజ్ఞాతవాసంలో లేము కదా. అది కేవలమూ నిర్లక్ష్యంతో తమకి తాము చేసుకున్న నిర్ణయమే.

**దీపతోరణాలు** వంద కథల సంకలనంలో నాకథ కూడా నన్నడిగి వేసుకున్నది కాదు. ఆ సంకలనకర్తలకి నాతో బాగానే పరిచయం ఉంది. మూడుసార్లు నాపేరుమీద సభలు ఏర్పాటు చేసేరు. అలాటిది నన్ను అడక్కుండా, "రాద్ధాంతం లాటి కథలు ఎన్నో రాసేరు" అని రచయిత్రుల పరిచయంలో రాసేరు. **రాద్ధాంతం** అసలు కథ కాదు. తెలుగుస్వతంత్రలో చిన్న గల్పిక. ఈనాటి కార్డుకథలాటిది. నాకథలకి అది ఉదాహరణగా ఇవ్వడం ఎవరైనా చూస్తే నవ్వుతారు. ఇది కూడా నన్ను సంప్రదించకపోవడంవల్ల కలిగిన అనర్థమే.

పోతే, తప్పులమాట. తప్పులు సర్వసాధారణమే. ఈరోజుల్లో చాలా పుస్తకాల్లో అక్షరదోషాలు ఉంటూనే ఉన్నాయి. సమీక్షకులు అక్షరదోషాలు చూసుకుంటే బాగుండు అని ఓముక్క రాయడం కూడా సాధారణం అయిపోయింది. నేను ఎంత చూసుకున్నా తప్పులు వస్తూనే ఉన్నాయి కనక మరొకరిని నేను తప్పు పట్టను. అయినా చెప్పక తప్పదు. కథపేరూ, నాపేరూ కూడా తప్పులే అయితే నాకు కష్టంగానే ఉంటుంది. వంగూరి వారి సంపుటాలలో "**డాలరుకో గుప్పెడు రూకలు**" పేరు **డాలరుకో గుప్పెడు నూకలు** అని మార్చేసేరు. ఆకథలో నూకల ప్రసక్తి లేదు. ఆ మార్పుకి అర్థం లేదు. పొరపాటు జరిగిందంతే. మరో సంపుటంలో నాకథ శీర్షికకింద నాపేరు నిడదవోలు మాధవి అని ఉంది! సంకలనం వేసేయాలన్న తహతహే తప్ప శ్రద్ధ లేదనే అనుకోవాలి ఇలాటివి చూసినప్పుడు.

జాలపత్రికలలో పొరపాటు దిద్దడానికి ఆస్కారం ఉంది కానీ అచ్చయిన పుస్తకాలకి ఆ వసతిలేదు. అంచేత అచ్చుపుస్తకాలలో ఇలాటివి మరింత శ్రద్ధగా చూసుకోవాలి కదా. అలాగే నాకథలసంకలనంలో ఒకకథ సగమే అచ్చవడం కూడాను. ఇలాటివాటివల్ల రచయితకి నష్టమే కదా. ఎందుకీ సంకలనాలకి ఇవ్వడం అనవసరం అనిపించదా ఎవరికైనా? ఏమో మరి. కొందరికి ఫరవాలేదేమో. నాకు మాత్రం ఇష్టం లేదు.

ఆఖరిమాటగా, నేను అమెరికాకథలసంకలనానికి ఎందుకు ఇవ్వదలుచుకోలేదో చెప్తాను. ఈఅంశం మాత్రం నాకు మాత్రమే పరిమితం. మిగతారచయితలు పట్టించుకోనవసరం లేదు. నాకథ లేనంత మాత్రాన ఆసంకలనానికి ఏమీ తక్కువ కాదనే నేను దృఢంగా నమ్ముతున్నాను. ఇలా ఎందుకనుకుంటున్నానంటే, ఈసాహిత్యవేత్తలు, సాహిత్యాభిమానులు, సాహిత్యసేవా దురంధరులు నాకథలగురించి తమ సభల్లోనూ, ఉపన్యాసాల్లోనూ, వ్యాసాల్లోనూ ప్రస్తావించిన జాడల్లేవు ఎక్కడా. ఒకరిద్దరికి సంకలనాలు వేసినప్పుడు మాత్రం నేను గుర్తొస్తాను. ఒక్కమాటలో చెప్పాలంటే చెప్పుకోదగ్గ కథలయితే అలాటి చర్చలో ప్రస్తావనలో తప్పక జరిగిఉండేవి. నాకథలకి అంత ప్రాశస్త్యం లేనప్పుడు ఓ సంకలనంలో చేరిస్తే ఎంత, చేర్చకపోతే ఎంత అని నేను అనుకుంటున్నాను. అసలు ఈసంకలనకర్తలు నాకథలు చదివేరని కూడా అనుకోను.

ఒక్కమాటలో సంకలనకర్తల ఇలాటి ఆచారాలను నిరసనగా నేను సంకలనాలకు నాకథలు ఇవ్వడం మానుకున్నాను. ఈమధ్య ఒక సంకలనానికి మాత్రం అనుమతి ఇచ్చేను, కొన్ని తప్పనిసరి పరిస్థితులు కారణంగా. పోతే, నాతో చెప్పకుండా ఎవరైనా నాకథలు వాళ్లసంకలనాలలో చేరిస్తే ఆ దోషం వారిదే.

(డిసెంబరు 22, 2018)

# కథకులూ పాఠకులూ - ఎవరు ఎవరికి స్ఫూర్తి?

1950, 60 దశకాలలో నేను చూసిన పాఠకుల అభిప్రాయాలను ఇప్పటి పాఠకుల అభిప్రాయాలతో పోల్చి చూసినప్పుడు నాకు కలిగిన అభిప్రాయాలే ఈవ్యాసంలో సారాంశం.

సామాన్యపాఠకులు కథ చదివినప్పుడు తమఅనుభవాలు ఆధారంగా స్పందించి వెలిబుచ్చే అభిప్రాయాలు ఈనాటికథని ఎలా తీర్చిదిద్దుతాయి అన్నది నన్ను వేధిస్తున్నసమస్య. ఆదృష్టితో నేను గమనించిన కొన్ని విషయాలు ఇక్కడ మీముందుంచుతున్నాను.

స్వాతంత్ర్యానంతరం, పత్రికలసంఖ్యతోపాటు పాఠకులసంఖ్య కనివిని ఎరగనంత విస్తృతంగా పెరిగింది. పాఠకుల విద్యాస్థాయి పెరిగింది. కథలో, కథనంలోలాగానే పాఠకులలో, వారి దృక్పథాలలో, వారు స్పందించే విధానంలో అనేక మార్పులు వచ్చేయి. భిన్నకోణాలూ, భిన్నరీతులూ వ్యక్తమయినట్టే, పాఠకులదృష్టిలో కూడా పరిణామాత్మకమయిన మార్పులు కనిపిస్తున్నాయి. పాఠకులు కథని ఎలా విశ్లేషిస్తున్నారు, ఎలా అన్వయించుకుంటున్నారు, రచయితనుండీ, రచననుండీ ఏమిటి ఆశిస్తున్నారు అన్న అంశాలను పరిశీలించి క్రోడీకరించగా తేలినఅంశాలు ఇవి.

తమ అభిప్రాయాలను వెలిబుచ్చే పాఠకులని స్థూలంగా మూడువర్గాలుగా విభజించవచ్చు.

1. ఒకథ చదివి తమఅనుభవాలపరిమితిలో తత్‌క్షణమే స్పందించేవారు.

2. కథలో లీనమైపోయి, కథలోని ఒకపాత్రనో, ఒక సన్నివేశాన్నో, సంఘర్షణనో తమకి అన్వయించుకుని, తదనుగుణంగా స్పందించేవారు.

3. వర్ణన, వాస్తవికత, భాష వంటి వివిధ అంశాలను పరిశీలించేవారు.

వీరిలో మొదటివర్గం పాఠకులు స్థాలీపులాకన్యాయంగా కథ అక్కడక్కడా చదివేసి, కథలో ముఖ్యమయిన అంశాన్ని సూచనప్రాయంగా గ్రహించేస్తారు. అలా కప్పదాటుగా చదవడంలో కొన్ని విషయాలు తెలిసో తెలియకో గమనించరు కూడా. వారు వెలిబుచ్చే అభిప్రాయాల్లో అది బాగానే తెలుస్తుంది. వారికి తమఅభిప్రాయం వెలిబుచ్చాలన్న కోరిక కలిగించడమే ఆకథ సాధించిన విజయంగా భావించుకోవచ్చు కథకుడు.

ఇలాటి అభిప్రాయాలలో ఒకొకప్పుడు దూషణ, భూషణ, తిరస్కారాలు మితిమీరినా ఆశ్చర్యంలేదు. ఇక్కడే మనం మరోమాట కూడా చెప్పుకోవాలి. వ్యక్తిగత విమర్శ మనకి కొత్త కాదు. వెనక అల్లసాని పెద్దన "అమవసినిశి" అని వాడినందుకు, తెనాలి రామకృష్ణుడు

ఎమి దిని సెపితివి కపితము
బెమ పడి వెరి పుచ్చకయ దిని సెపితివొ
ఉమెతః దిని సెపితివొ
అమవసనిశి యనుచు అలసని పెదన

అంటూ, ఒత్తులూ, దీర్ఘాలూ తీసేసి హేళన చేస్తాడు.  ఈమధ్యనే నాయని కృష్ణకుమారిగారి వ్యాసం ఒకటి కనిపించింది. వీరేశలింగంగారూ, కొక్కొండ వెంకటరత్నంపంతులుగారూ ఒకరినొకరు తమతమ పత్రికలలో హేళన చేసుకోడంగురించి కృష్ణకుమారిగారు "వారిలాటి మహానుభావులకే చెల్లింది" అంటారు అన్యాపదేశంగా అది అభిలషణీయం కాదని తెలియజేస్తూ **(యుగపురుషుడు వీరేశలింగం** ప్రత్యేకసంచిక.)

మనకి హాస్యంపాలు ఎక్కువ. మన వ్యవస్థలో బావామరుదులూ, వదినామరదళ్లే కాక భార్యాభర్తలు కూడా వేళాకోళాలాడుకుంటారు. పాశ్చాత్యదేశాలలో అభ్యంతరకరమయిన హాస్యాలు మనకి నిత్యోత్సవాలు. ఈనాడు ఎన్నారైలలో కూడా అలాటి చనువు ఏర్పడింది. ప్రస్తుతం బ్లాగులకీ ఇతర మాధ్యమాలకీ కూడా సోకింది. ఇది కొత్తగా ఏర్పడిన కుటుంబవ్యవస్థ అనుకోవచ్చు. వీరు కథనీ, కథకుడినీ వదిలేసి, వ్యక్తిగతస్థాయిలో వేళాకోళాలకీ, వెక్కిరింతలకీ దిగిపోతారు. అది అవతలి వ్యక్తికి సమ్మతమవులో కాదో కూడా గమనించరు.

రెండోరకం పాఠకులు, కథలో లీనమయిపోయి, కథలో తామొక పాత్ర అయినట్టు వ్యాఖ్యానాలు చేస్తారు. ఫలానా పాత్ర అలా అనకూడదు, ఇలా అనాలి, అలా చెయ్యకుండా ఉండవలసింది, ఇలా జరిగి ఉంటే బాగుండును వంటి అభిప్రాయాలు ప్రకటించడంలో ఆంతర్యం ఇదే - కథలో లీనమయిపోయి, అది కథ అని మరిచిపోవడం. ఆ పాఠకుడు తనవైన అనుభవాలు ఆధారంగా చేసే వ్యాఖ్యలు అవి.

కథ ప్రచురణ నీటిలో రాయి విసరడంలాటిది. ఆరాయి తాకిడికి లేచే చిరుతరగలవంటివే పాఠకుడిలో కలిగే స్పందనలు. అంటే, పాఠకుడిలో కలిగే స్పందనలకి రచయిత జవాబుదారీ కాడు. ఎలాటి స్పందనలు రాగలవో రచయిత ఊహించలేడు. ఆ పాఠకుడు తనఅనుభవాలూ, పరిస్థితులపరిధిలో తన అభిప్రాయాలు వెలిబుచ్చినప్పుడు, అవి రచయిత ఆశయానికి భిన్నంగా ఉంటే, ఆపాఠకుడు రచయితఅభిప్రాయాన్ని అర్థం చేసుకోలేదు అనుకోడం కన్నా మరొకకథకి నాంది పలుకుతున్నాడు అనుకోడం మేలు. పాఠకుడు ఎప్పుడయితే, "ఇలా కాదు, అలా జరిగిఉండాలి" అంటాడో, అప్పుడే మరోకథ మొదలవుతుంది. మొదటికథకి సంబంధించినంత వరకూ, ఆకథ సాధించింది అదే. పాఠకుడిలో అలాటి ఆలోచనలు రేకెత్తించడం. ఏడు చేపలకథలో "చేపా, చేపా, ఎందుకు ఎండలేదు?" అని అడిగితేనే కదా కథ ముందుకు సాగేది. చేపని అడిగేదేమిటి, తీసి ఎండ ఉన్నచోట పడేస్తే సరిపోతుంది అనుకుంటే, మరింక కథ లేదు!

మూడోరకం పాఠకులు ఇంకొంచెం ముందుకి వెళ్లి, కథని నిశితంగా పరీక్షిస్తూ చదువుతారు. కథలో భాష, శైలీ, పాత్రచిత్రణా, వాస్తవికత వంటి అంశాలను విశ్లేషిస్తారు. ఒకొకప్పుడు తాము చదివిన పాశ్చాత్యరచయితలతో పోల్చుకునో, వారివిమర్శలని ఆధారం చేసుకునో వ్యాఖ్యానాలు కూడా చేస్తారు.

ప్రతిపాఠకుడూ తప్పనిసరిగా ఈమూడు వర్గాల్లో ఏదో ఒకకోవకి చెందివుంటాడని నేను అనడంలేదు. సుమారుగా ఇలాటివిభజనకి ఆస్కారం ఉంది అని చెప్పడమే నా ఉద్దేశ్యం. పాఠకులందరూ పత్రికాముఖంగా తమఅభిప్రాయాలు వెలిబుచ్చరు కదా. అంచేత, పాఠకులందరి అభిప్రాయాలూ మనకి తెలిసే అవకాశంలేదు.

నాచిన్నప్పుడు, అంటే 50, 60 దశకాల్లో కథలు చాలామటుకు కాలక్షేపమే అయినా, కథలో ఒక పాత్రతోనో సంఘటనతోనో తమ అనుభవాలు పోల్చుకుని, ఆకథని "తమకథ"గా మలుచుకోడం, ఆకథలో సంఘర్షణలకి తమ బాధలని అన్వయించుకుని, పరిష్కారాలు వెతుక్కోడం జరిగింది.

కె. వసుంధరాదేవి **తెలుగుకథ తీరుతెన్నులు** అన్నవ్యాసంలో ఒకసంఘటనగురించి ఇలా రాసేరు -

ఆవిడ ఒక కథలో క్షయరోగి ప్రధానపాత్రగా రాస్తూ, ఆరోగి మరణంతో ముగించేరుట. ఆ కథ చదివిన ఒక పాఠకుడు ఆమెని కలుసుకుని, తాను క్షయరోగి ప్రధానపాత్రగా మూడు కథలు చదివేననీ, మూడు కథల్లోనూ ప్రధానపాత్ర చనిపోతాడు అని చెప్పి, తనసందేహం వెలిబుచ్చుతాడు. అతనికి క్షయ ఉంది. అతను రచయిత్రిని అడిగినప్రశ్న -క్షయరోగులందరూ చనిపోతారా, వారికి బతికే అవకాశం లేదా? అని. వసుంధరాదేవి రచయితలందరితరుఫునా అతనికి క్షమాపణలు చెప్పుకున్నాననీ, మళ్లీ జన్మలో చావుని పరిష్కారంగా రాయకూడదని నిశ్చయించుకున్నాననీ, అయినా ఆపాఠకుడిప్రశ్న తనని వేధిస్తూనే ఉందనీ రాశారు.

ఈకథ ఇక్కడ ఉదహరించడానికి కారణం ఆనాడు పాఠకులకి కథలంటేనూ, రచయిత అంటేనూ ఉన్న నమ్మకం ఎత్తిచూపడానికే. అనూచానంగా మనం జ్ఞానానికి ఇస్తున్న గౌరవం అదీ. రచయితకి ఏదో తెలుసని నమ్మి, ఆయన రాసినకథలో తాను కొత్తగా తెలుకోగలిగినది ఏదో ఉందన్నఆశతో కథ చదివేడు పాఠకుడు. అది గురుశిష్యసంబంధం. ఈనాడు ఈ సంబంధంలో మార్పు వచ్చింది. ఆనాడు ఎదటివారిమాట స్వీకరించడం నీతి అయితే, ఈనాడు ప్రశ్నించడం నీతి. ఈమార్పే ఈనాటి పాఠకులలో చూస్తున్నాం. దురదృష్టవశాత్తు ఏది ప్రశ్నించడం అన్న విషయంలో మాత్రం సమగ్రమైన అవగాహన కనిపించడంలేదు. పండితులయినవారి విషయంలో కూడా కొన్ని ప్రశ్నలు అసంబద్ధంగా ఉండడం ఇటీవలే గమనించేను.

ఈనాడు పాఠకులఅభిప్రాయాలు చూస్తే, వారిని విశేషంగా ఆకర్షిస్తున్నవి వస్తువు, సంఘర్షణ, పరిష్కారం. భాష, శైలిగురించిన ఆలోచనలు లేవనే చెప్పాలి.

కథకి ముఖ్యమయిన ప్రయోజనం ఒక దృక్కోణాన్ని జనబాహుళ్యానికి అందించడం మాత్రమే. లేదా ఎవరూ గమనించని, గమనించినా పట్టించుకోని కోణం కావచ్చు. సామాజికప్రయోజనం అంచే సమాజంలో లోపాలు గర్హించేదీ, పరిష్కారాలను సూచించేదీ అన్నభావం స్థిరపడిపోయింది. నిజానికి ఈ వివరణే ప్రమాణం అయిపోయింది అనొచ్చు కూడా ఇప్పుడు ప్రాచుర్యం పొందుతున్న, బహుమతులు పొందుతున్న, విమర్శకులమన్ననలు పొందుతున్న కథలు చూస్తుంటే. ఇది కూడా విమర్శకుల, పాఠకులదృష్టిలో వచ్చిన మార్పుకి చిహ్నమే.

వస్తువుకి ఈనాటి పాఠకులు ఇస్తున్న ప్రాధాన్యతకి మంచి ఉదాహరణ ఈమధ్య ఆంధ్రజ్యోతిలో (ఆంధ్రజ్యోతి ఆదివారం జనవరి 16, 2005) వచ్చిన “కడలూరు వెళ్లాలి ఒకనీలిమకోసం” అన్న కథ. సునామీ భీభత్సానికి సమస్త ప్రపంచం స్పందించింది నీ, నా అన్న భేదం లేకుండా. ఆకథలో విశేషం వస్తువు. రచయిత దాన్ని మానవసంబంధిగా మలచడం. చాలామంది పాఠకులు ఆ భాగానికే ఎక్కువగా స్పందించారు. అయితే, కథలో ఒక సన్నివేశం - ప్రాధానపాత్ర ఫోన్ చెయ్యాలనుకున్న సందర్భం స్పష్టంగా లేదు. ఎవరికి, ఏమని ఫోన్ చెయ్యాలనుకున్నాడు, చేశాడా, లేదా అన్న వివరాలు లేవు. ఇది పాఠకులెవరినీ బాధించినట్టు కూడా లేదు ప్రచురించబడిన అభిప్రాయాలు చూసినప్పుడు.

కథావస్తువు, సంఘర్షణ 1970 దశకంలో తెలుగుకథలో సాంఘికప్రయోజనం ప్రధానాంశంగా విశేషాదరణ పొందిది. నాచర్చకి నేను 1950దశకానికి పూర్వపుకథలు మూడు తీసుకుంటున్నాను. కారణం ఆనాటి పాఠకులు అడగనిప్రశ్నలు విశదం చెయ్యడంలో సౌలభ్యం.

ఏది వాస్తవికత, ఏది వాస్తవికత కాదు అన్నప్రశ్నకి ఉదాహరణగా ఈకథ చూద్దాం.

ఒకాయన సానివాడల తిరుగుతుంటాడు. ఆయనని దారిలో పెట్టాలనుకుంటుంది భార్య. ఒకరోజు ఆయన అలవాటుప్రకారం చాంద్రాయణం ముగించుకుని ఇంటికి వస్తాడు. అమ్మగారేరీ అని పనివాడిని అడుగుతాడు. అతను అమ్మగారు పుట్టింటికి వెళ్లిపోయారని చెబుతాడు. దాంతో ఆయన కంగారు పడిపోయి, బుద్ధి తెచ్చేసుకుంటాడు. పాఠకులు గ్రహించే ఉంటారు. ఇది గురజాడ అప్పారావుగారి **దిద్దుబాటు** కథ. ఇది తెలుగులో తొలికథగా, అంటే మంచికథకి ఉండవలసిన లక్షణాలు ఉన్నకథగా గుర్తింపబడింది. కాని ఇదే కథని ఈరోజుల్లో నాలాటి రచయిత రాస్తే, ఈనాటి పాఠకులు సంఘర్షణకి తగినబలం ముగింపులో లేదు అంటారు. దానిమీద అనేకప్రశ్నలు లేవదీయొచ్చు. భార్య పుట్టింటికి పోతే స్త్రీలోలుడయిన మగవాడికి అంత త్వరగా బుద్ధి

వచ్చేస్తుందా? నిజానికి అతగాడికి భార్య ఎదురుగా లేకపోతే మరింత ఆటవిడుపు కదా అని అడుగుతాడు ఈనాటి పాఠకుడు.

ఆతరవాత వచ్చిన కథల్లో కుటుంబరావుగారి కథ, ఆడజన్మ చూడండి. ఇందులో లక్ష్మి ప్రధానపాత్ర. ఆమె తండ్రి చనిపోతే, ఆతని అన్నగారు లక్ష్మినీ, తల్లినీ చేరదీసి, ఆఅమ్మాయిని ఒక రెండోపెళ్లి ముసలాయనకిచ్చి చేతులు దులుపుకుంటాడు. ఆ ముసలాయనకి అనుమానం లక్ష్మి సవతికొడుకుతో సంబంధం పెట్టుకుందేమోనని. ఆ బాధలమధ్య లక్ష్మి ఒక కూతురిని కంటుంది. ఆకూతురు పెరిగి పెద్దదయిన తరవాత ఎవరితోనో లేచిపోవడం, గర్భవతి అయి తిరిగిరావడం - ఇంతే కథ. ముప్పై ఏళ్లు నిండని లక్ష్మికి మూడుతరాల బాధలు అనుభవమయేయి. ఆపైన ఇంకా ఏం జరగనున్నదో అనుకుంటుంది ఏడుస్తూ.

ఈకథలో పరిష్కారం లేదు. ఆరోజుల్లో ఒక దిక్కుమాలిన ఆడదాని సాంఘికదుస్థితిని చిత్రించడం మాత్రమే జరిగింది. నిజానికి ఈకథ చదువుతున్నప్పుడు నాకు అదొక కథలా అనిపించలేదు. మాటవరసకి పాత్రలకి పేర్లు పెట్టి ఒక సాంఘికసమస్యని వివరిస్తున్నట్టు అనిపిస్తుంది. ఇందులో ఇద్దరు స్త్రీలు ఎట్టి సాహసానికీ పాల్పడరు. సాహసించి పారిపోయిన చిన్నది మోసపోయి మళ్లీ ఇల్లు చేరుతుంది. ఈకథే ఈనాడు పత్రికలో కనిపిస్తే, ఈనాటిపాఠకులు వేసే ప్రశ్నలు సుళువుగానే ఊహించుకోవచ్చు, లక్ష్మి ఎందుకు తిరగబడలేదూ? తనకి సవతికొడుకుతో సంబంధం లేదని ఎందుకు ఋజువు చెయ్యలేదూ? కనీసం అలా చేయడానికి ఎందుకు ప్రయత్నించలేదూ? సాహసించి పారిపోయిన చిన్నది అయినా సుఖపడినట్టు రచయిత ఎందుకు చిత్రించలేదూ? అంటే ఇది పాఠకులలో సామాజికస్పృహ కలిగించడానికి మాత్రమే అని జవాబు చెప్పుకోవాలిసివస్తుంది. అంటే సంఘంలో జరుగుతున్న అత్యాచారాలు చూసీ చూడనట్టు దాటుకు పోయేవారికి హెచ్చరికగా మరొకసారి ఎత్తి చూపడానికీ, జనసామాన్యంలో ఆలోచనలు రేకెత్తించడానికీ మాత్రమే అని. అంతే కాక దారిద్ర్యానికీ నైతికవిలువలకీ మధ్య గల అనుబంధం కూడా తెలియచేస్తుంది ఈకథ.

కనుపర్తి వరలక్ష్మమ్మగారి కుటీరలక్ష్మి ఇంచుమించు అదే పరిస్థితిలో ఉన్న మరొక స్త్రీ ప్రవృత్తినీ, మరొక దృక్కోణాన్ని ఆవిష్కరిస్తుంది. ఆకథలో ప్రధానపాత్ర రామలక్ష్మి కలిమిలేములు అనుభవించి, భర్త పోయినతరవాత, కేవలం మనోబలంతో జీవితంతో పోరాడుతూ, పిల్లలని సాకుతూ ఉంటుంది. అయితే ఇందులో కూడా ఆమె సాధించిన ఘనవిజయమేమీ లేదు. పాఠకుడు కథ అయిపోయిన తరవాత హమ్మయ్య సుఖపడింది అనుకుని ఆనందించే అవకాశంలేదు. చివరిదాకా ఆమెకి దినదినగండమే. కాని ఇందులో నమ్మదగ్గ పరిష్కారం ఉంది.

వాస్తవికత ఉంది. గుండెబలం గల ఆడది నాఖర్మ అంటూ చేతులు ముడుచుకు కూచోదు. కడవరకూ పోరు సలుపుతూనే ఉంటుంది.

వరలక్ష్మమ్మ ఈకథలో వెల్లడి చేసిన మరొకవిషయం ఆరోజుల్లో తెలుగుదేశంలో కనీసం ఒక నియమితపరిధిలో స్త్రీలకి గల సామాజికస్ఫూర్తి. ఆరోజుల్లో ఐరోపా మహాసంగ్రామంమూలంగా సామాన్యులమనుగడ, కుటీరపరిశ్రమలమీద ఆధారపడినవారి జీవితాలు ఎంతగా అల్లకల్లోలం అయిపోయేయో వివరిస్తుంది ఈకథ. ఆనాటి తెలుగురచయిత్రులకి సాంఘికసరిస్థితులపట్ల గల అవగాహన, అది కథగా మలచగల నైపుణ్యం చూస్తాం ఈకథలో. అయితే ఇందులో రచయిత్రి చాదస్తంగా ఉపన్యాసాలు జొప్పించరు. బహుశా ఆకారణంగానే దానిని మంచికథగా గుర్తించారు ఆనాటి విమర్శకులు. అదే ఇప్పుడయితే, స్త్రీవాదరచనగానో, దళితవాద రచనగానో ముద్రపడి, అనేకచర్చలకి దారి తీసేది. అటువంటి విస్తృతమయిన చర్చ లేకపోతే, రచయిత్రికి సాంఘికపరమయిన అవగాహన లేదని కథని పక్కన పెట్టేస్తారు కూడా.

ఉదాహరణకి, రచయిత చెప్పకుండా వదిలేసిన అంశాలు - ప్రధానపాత్ర రామలక్ష్మి కొడుకులు పెరిగి పెద్దవారయారా, చదువుకున్నారా, లేదా, ఆతరవాత తల్లిని ఆదుకున్నారా లేదా వంటివి అడగవచ్చు. లక్ష్మి సుఖపడేరోజు వచ్చిందా లేదా? రాకపోతే, ఈకథ విషాదాంతం అనుకోవాలా? విషాదాంతం అయితే, ఎందుకు ఇలాటికథలు రాయడం అన్నప్రశ్నలు కూడా అడుగుతారు. కానీ, ఆనాడు (ఇంకా కొందరు నాలాటి రచయితలు యీనాటికీను) కథ ఎంతవరకూ చెప్పాలన్న నిర్ణయం రచయితదిగానే భావించారు. ఇతివృత్తానికీ, కథ నడవడానికీ పనికొచ్చే సన్నివేశాలు, పాత్రలు ఎంచుకోడం మాత్రమే జరుగుతుంది. అంతకంటె ఎక్కువ వివరాలు ఎందుకు ఇవ్వలేదు అన్నప్రశ్న లేదు అప్పట్లో.

సూక్ష్మాతిసూక్ష్మ వివరణలు, స్పష్టత, poetic license. వివరాలు, స్పష్టత విషయాలలో ఈనాడు పాఠకులు చూపుతున్నశ్రద్ధ అపూర్వం. నాకు వస్తున్న ప్రశ్నలలో పదే పదే కనిపించేవి స్థల, కాలనిర్ణయాలూ, కదాచితుగా పాత్రల ప్రవర్తనలమీదాను.

మొదట రచయితగా నాఅభిప్రాయం చెప్తాను. రచయితలూ, పాఠకులూ కూడా తమ అనుభవాలు, అవగాహన (perception) పరిధిలోనే రాయడం చదవడం, విశ్లేషించడం జరుగుతుందని మనందరికీ తెలుసు. బడిపంతులు కథలు పంతుళ్ల పిల్లలదృష్టిని ఆకట్టుకుంటే, సాఫ్టువేర్ ఇంజినీర్లకథలు సాఫ్టువేర్ ఇంజినీర్లకి బావుంటాయి స్థూలంగా.

పోతే, రచయితకి సంబంధించినంతవరకూ ఏకథలోనైనా ప్రధానాంశం సాధారణంగా తాను గమనించిన ఒక సాంఘిక లేక మానసిక ప్రవృత్తి అయివుంటుంది. ఆ అంశానికి అనుగుణంగా పాత్రలూ, స్థల, కాలాలూ ఎంచుకుంటాడతను, అంటే తాను గమనించిన విషయాన్ని తనస్ఫూర్తికి

ఆనినంతవరకూ తాను చెప్పదలుచుకున్న విషయానికి ఎంత అవసరమో అంతే ఎంచుకోడం జరుగుతుంది. స్థూలంగా, ఒక మానసికప్రవృత్తిని ఆవిష్కరించ దలుచుకున్నప్పుడు, ఏ ఊళ్లో అన్న ప్రస్తావన అనవసరంగా తోచవచ్చు. ఒక సామూహికప్రవృత్తిని ఆవిష్కరిస్తున్నప్పుడు, సోమవారమా, శుక్రవారమా అన్నది అస్పష్టంగా వదిలేయవచ్చు. లేదా, పొరపాటునే, సోమవారం తరవాతిరోజు శుక్రవారం అని రాయొచ్చు. ఇది ఒకరకంగా సినిమాల్లో మొదటిసీనులో పసిబాలుడు మూడోసీనులో నవయువకుడిగా సాక్షాత్కరించడంలాటిదే. సినిమాలోలాగే కథ కూడా స్థల, కాలాల్లో చిన్న చిన్న కప్పదాట్లు వేయొచ్చు. ఇటువంటి లోపాలను పూర్వం పాఠకులు పట్టించుకోలేదు. ఆనాటికథల్లో నేను ఇలాటి పొరపాట్లు చాలానే చూసేను. కానీ ఇప్పుడు పాఠకులు, సోమవారానికీ శుక్రవారానికీ మధ్య మూడురోజులున్నాయి కదండీ అని ఎత్తి చూపుతున్నారు. అది తప్పని అనడంలేదు నేను. పాఠకులు ఎంత సూక్ష్మంగా పరిశీలిస్తున్నారో అని అనిపించినా, నిజానికి ఆ పాఠకుడు ప్రధానాంశాన్ని గుర్తించలేదనే అనుకోవాలి. బహుశా సూక్ష్మపరిశీలనమూలంగా రచయితలు వాస్తవికతవిషయంలో మరింత శ్రద్ధ చూపవలసిన అగత్యం ఏర్పడింది అనుకోవాలేమో. ఇది ఒక కోణం.

స్థల, కాలవిషయాలలోలాగే వస్తువువిషయంలో వివరణలు కోరడం కూడా. కథని కథగా కాక, అందులో స్థలంగురించో, ఇతరవివరాలు తెలుసుకోడానికో చదువుతున్నట్టు కనిపిస్తుంది కొన్ని అభిప్రాయాలు చదువుతుంటే. కొందరు రచయితలు ఆ పాఠకులస్థాయికి ఎదిగి, సుదీర్ఘంగా విషయచర్చ చెయ్యడం కూడా కథల్లో కనిపిస్తోంది. ఒకకథలో ఒక జబ్బు ప్రసక్తి వస్తే, ఆ జబ్బు లక్షణాలూ, వాటికి వాడే మందులూ, మోతాదులూ, సత్ లేక దుష్ఫలితాలూ వంటివి రెండుపేజీల పొడవున చర్చించడం కొందరికి నచ్చుతుందేమో కానీ, నేను మటుకు చిన్నకథకి ఉండవలసిన క్లుప్తత దెబ్బతింటుందనే అనుకుంటాను. ఆకథలో అదే ప్రధానాంశం అయితే తప్ప. అలాగే డయాస్పోరా కథల్లో, అమెరికాకథల్లో, అమెరికాలో జీవనసరళిమీద విస్తృతంగా రాయడం. కథ అంటే కథే. అమెరికాకథలు చదివితే అమెరికాలో జీవనవిధానం కొంత తెలియొచ్చు కానీ అది జాగ్రఫీపాఠమో, సాంఘికచరిత్ర పాఠమో కాదు. కేవలం విషయసంగ్రహణకోసం ఎవరూ కూడా కథలమీద ఆధారపడకూడదు. కథలో వివరణ మోతాదు మించితే అది కథ అనిపించుకోదు.

కథారచయితకి స్వేచ్ఛ అవుసరం. అంటే అక్షరాలా ఉన్నదున్నట్టు, చూసింది చూసినట్టు కాక, కథ చిక్కగా నడపడానికి అనువుగా కల్పన చేయాలి. కథకి కేంద్రం కథాంశమే. ఇతరవివరాలు ప్రధానాంశాన్ని తినేయకూడదు. చిన్నకథకి ముఖ్యలక్షణాల్లో ఒకటి క్లుప్తత. ఇటు రచయితకి స్వేచ్ఛ, అటు పాఠకుడిని ఆకట్టుకోడానికి తగినట్టు స్పష్టత, వాస్తవికత - వీటిమధ్య

పోత్తు కూర్చగల మధ్యేమార్గం కావాలి. అభిప్రాయాలు వెలిబుచ్చే పాఠకులూ, ఆ అభిప్రాయాలని గౌరవించే రచయితలూ కూడా గమనించవలసినవిషయం ఇది.

అసలు పాఠకులదృష్టిలో ఈమార్పు - ప్రతిచిన్నవిషయం రచయిత వాచ్యం చెయ్యాలి అని కోరుకోడం అభిలషణీయమేనా? మరీ అంత చాదస్తంగా ప్రతి చిన్న విషయం అరటిపండు వొలిచి చేతిలో పెట్టినట్టు వివరించుకుంటూ పోతే నిజంగా పాఠకుడికి తృప్తి కలుగుతుందా? అన్నది ఆలోచించవలసిన విషయం.

ప్రసిద్ధవిమర్శకుడు వల్లంపాటి వెంకటసుబ్బయ్య అభిప్రాయం చూడండి. రచయిత పాఠకులవూహకి ఏమీ వదిలిపెట్టకుండా, ప్రతి చిన్న విషయం వివరించుకుంటూ పోతే, అది పాఠకుడి మేధస్సుని అవమానించినట్టే అంటారాయన. ("కథ చదవడం ఎలా?" తెలుగువెలుగు. టి.ఎ.జి.సి. వార్షికసంచిక, 2004). కానీ ఈనాడు వస్తున్న వ్యాఖ్యలు చూస్తే, కనీసం కొందరు వల్లంపాటివారి అభిప్రాయంతో ఏకీభవించినట్టు కనిపించదు.

నేను మాత్రం ఇది కథకీ వ్యాసానికీ మధ్యగల ఒక ముఖ్యమయిన వ్యత్యాసంగా గుర్తిస్తాను. పాఠకుడిలో ఆలోచనలూ, ఉత్కంఠ రేకెత్తించేగుణం కథకి అవుసరం. ఋజువులూ, సాక్ష్యాలతో పాఠకుడిని నమ్మించవలసిన అవుసరం వ్యాసానికి ఉంది కానీ కథకి కాదు.

వర్ణనలవిషయంలో కూడా ఇటువంటి సందర్భమే తటస్థపడుతోంది ఈనాడు. కథకి తగిన వాతావరణానికీ, పాత్రచిత్రణకీ పాఠకుడిమనసులో రూపు కట్టడానికి కావలసిన వివరాలు లేక వర్ణనలు కథలో చొప్పించడం సహజం. మన ముందుతరాలవారి కథల్లో, ఉదాహరణకి మధురాంతకం రాజారాం, కాళీపట్నం రామారావుకథల్లో, ఇలా వాతావరణం కళ్లకి కట్టినట్టు వర్ణించడం చూస్తాం. కానీ, రాను రాను కథలో కేవలం వస్తువు లేక సందేశానికే ప్రాముఖ్యత పెరిగిపోవడంవల్లా, ఒకొకప్పుడు నిడివిమీద పత్రికల ఆంక్షలవల్లా ఈవివరాలు తగ్గిపోతున్నాయి. ఇక్కడే మరొక contradiction. పెద్దకథలు చదవడానికి పాఠకులకి తీరికలేదు. చాలామంది గబగబా ముగిసిపోయే కథలమీదే ఆసక్తి చూపుతున్నారు. మరి వివరాలు కావాలంటే కథ పెంచకతప్పదు. అలా పెంచడంమూలంగా కొందరికి సంతృప్తి కలగొచ్చు మరికొందరికి విసుగ్గా కనిపించవచ్చు. ఎలా చూసినా ఎంత వివరంగా రాయాలి అన్నది కత్తిమీద సామే.

కథల్లో ఇలాటి లోపాలకి కారణం కొంతవరకూ మన మౌఖికసాహిత్య లక్షణాలు. మనం వాటికి అలవాటు పడిపోయేం. 60వ దశకం పాఠకుల, రచయితలమధ్య సంబంధం ఈ అలవాటుకి సంబంధించినదిగా కనిపిస్తుంది కథనరీతుల్లో. కథ ఎదురుగా ఉన్నవారికి చెప్పేటప్పుడు వారి ముఖకవళికలను బట్టి మార్పులూ, చేర్పులూ చేస్తూ వారి అవగాహనకి తోడ్పడతాడు. కానీ కాగితంమీద రాస్తున్నప్పుడు ఆ వెసులుబాటు లేదు. రచయితకి

తనపాఠకులు ఎదురుగా లేరన్న స్పృహ లేకపోవడం జరగొచ్చు. అసలు సాధ్యం కూడా కాదు. ఈనాడు పాఠకులు ప్రపంచవ్యాప్తం. వారి అభిరుచులూ, అవగాహనస్థాయీ అనంతం. ఇది వ్యాఖ్యలు చూస్తే తెలుస్తుంది. ఒకరు చాలాబాగుందన్న కథనే మరొకరు గందరగోళంగా ఉంది అనడం చూస్తూనే ఉన్నాం కదా.

ఇన్ని పరిమితులమధ్య ఈనాటి రచయిత తనకు తానే కొన్ని పరిధులు నిర్మించుకుని, తనకి అర్థమయినరీతిలో పాఠకులఅభిరుచులని ఊహించుకుని రాస్తున్నాడు. అతని వర్ణనలూ, వివరణలూ ఆ పరిధిలోనే ఉంటాయి. కానీ ఇందులో ప్రమాదం ఏమిటంటే ఎప్పుడు ఆ పరిధులు మితి మీరుతాయో, ఎప్పుడు కథ నోదిగా మారిపోతుందో అన్నబాధ.

సాధారణంగా ఎప్పుడయితే పాఠకుడు "అలాటి సంఘటన జరిగివుండదు, అలాటి పాత్ర ఉండదు," అంటాడో, అప్పుడే ఆ పాఠకుడు తనకి సుపరిచితమయిన ప్రపంచాన్ని దాటి, బయటికి చూడడం లేదు అన్నమాట. అంతే కానీ, రచయిత అలాటి సంఘటనో, పాత్రో చూడడంచేతే రాసేడు అని ఆ పాఠకుడు అంగీకరించడంలేదు.

1960లో వచ్చిన **మారినవిలువలు** (ద్వివేదుల విశాలాక్షి) నవలలో చివర జానకి తల్లి, అన్నగారు, తదితరులజీవితాలు ఏమయిపోయేయో చెప్పలేదు కనక నవల అసంపూర్ణంగా ఉంది" అని ఒక పాఠకుడు రచయిత్రికి ఉత్తరం రాసేడుట. దానికి సమాధానంగా, విశాలాక్షిగారు "ఈనవల ఒక వ్యక్తికథ కాదు. ఇది ఒక కుటుంబచరిత్ర. ఎంతరాసినా అసమగ్రమే" అని జవాబిచ్చారు **(మారినవిలువలు. ముందుమాట.)**

నిజానికి ఈవివరణ అన్ని కథలకీ, నవలలకీ వర్తిస్తుంది. రచయిత తాను ఆవిష్కరించిన సందేశానికి తగినంతవరకే పాత్రలూ, సన్నివేశాలూ సమకూర్చుకోడం జరుగుతుంది. అంతకంటే ఎక్కువ చెప్తే, కథ పక్కదారి పట్టి, అసలు విషయం నీరసించిపోయే అవకాశం ఉంది. అలాగే అసాధారణసంఘటనలూ, సన్నివేశాలూ సృష్టించడం కూడా. ఒక మనిషి కోపంతో "తాడెత్తున లేచాడ"నో "తాట వొలిచేశాడ"నో అంటే నిజంగా అలా చేశాడని కాదు కదా. ఆ వాక్యాల్లో వాస్తవికతలాటిదే కథల్లో వాస్తవికత కూడా.

మరొక ఉదాహరణ చూద్దాం. నానవల **చాతకపక్షులు** లో న్యూయార్క్ ఎయిర్పోర్టులో తొలిసారిగా దిగిన కొత్తపెళ్లికూతురు కన్వేయర్ బెల్టుమీద సాగిపోతున్న సూట్కేసుని అందుకోబోతుంది ఆతురతగా. పక్కనున్న అమెరికన్ దాన్ని అందుకుని, తీసి ఆమెకి ఇస్తాడు. దీనిమీద ఒక పాఠకుడి వ్యాఖ్య "కొత్తవ్యక్తి అమెరికన్ చేతిలోనుండి ఆమె పెట్టె ఎలా అందుకుంది?" అని. అంటే ఆ అమెరికన్ పరపురుషుడనా? నాకు అర్థం కాలేదు. ఇదేదో నేను కనివిని ఎరగని psuedo culture concept అనిపించింది. ఇదే సన్నివేశంమీద మరొక పాఠకుడు

వెలిబుచ్చిన అభిప్రాయంలో అతడు కథలో ప్రధానాంశంమీద దృష్టి పెట్టినట్టు కనిపిస్తుంది. అతని వ్యాఖ్య "న్యూయార్క్ ఎయిర్పోర్ట్ చాలా హడావుడిగా ఉంటుంది. మనవారందరికీ వాళ్ల, వాళ్ల పిల్లా, మేకా చూసుకోడంతోనే సరిపోతుంది. రెండోఅంశం, మనదేశంలో అమెరినులగురించి ఉన్న అభిప్రాయం - వాళ్లు సొంతలాభం లేనిదే పొరుగువారికి సాయపడరన్నమాట - నూటికి నూరుపాళ్లూ నిజం కాదని చెప్పడానికీ, ఆ తరవాత వచ్చే సంఘటనలకి సూచనప్రాయంగానూ కనిపిస్తోంది అని. నేను ఈ సన్నివేశం సృష్టించినప్పుడు నాఆలోచన కూడా ఈ రెండోపాఠకుడు చెప్పిందే. మొదటిఅభిప్రాయంలో పాఠకుడు తన వ్యక్తిగత, తెలుగు సాంప్రదాయకవిలువలని కథలో పాత్రలకి ఆపాదించేడు.

పాఠకుడు తనకి తాను ఆలోచించుకోడం మానేసి, వివరణలకోసం పూర్తిగా రచయితమీదే ఆధారపడితే ఆకథ కథగా రక్తి కట్టదనే నేను నమ్ముతాను. నేను ఆలోచించుకోడానికి అవకాశం కల్పించే కథలే నాకు నచ్చుతాయి. కథ పాఠకుడిలో వాస్తవికతకి సంబంధించిన అల్పవిషయాలు కాక మౌలికంగా రచయిత ఆవిష్కరించిన అంశానికి సంబంధించిన ఆలోచనలు పాఠకుడిలో రేకెత్తించగలిగినప్పుడే అది మంచికథ అవుతుంది.

భాషవిషయం. కథనంలోనూ, విమర్శల్లోనూ కూడా కనివిని ఎరగని మార్పులొచ్చేయి. గత ఇరవై ఏళ్లలోనూ ఇంగ్లీషు తెలుగుని విపరీతంగా ఆక్రమించేసింది. డయాస్పోరాకథల్లోనూ, తెలుగుదేశంలో బస్తీలూ, ఆఫీసులూ నేపథ్యంగా గల కథల్లోనూ అయితే మూడొంతులు ఇంగ్లీషు పదాలే. వాటికి  అనువాదాలంటే, డు, ము, వు, లు లాటి ప్రత్యయాలు తీసేసి, ఇంగ్లీషులిపిలో రాసేయడమే.

మనకి వివిధ ప్రాంతాల, కులాల, వృత్తులకి సంబంధించిన పదసముదాయం, ఒకొక పదానికి అనేక రూపాలు ఉన్నాయి. 80వ దశకంలో వచ్చిన మాండలీకం కథలు, పాటకజనం మాటాడుకునే భాషలలో వస్తున్నకథలమూలంగా కేవలం స్థానికులకి మాత్రమే తెలిసిన వాడుకపదాలు వేలకొద్దీ కథల్లో చోటు చేసుకుంటున్నాయి. పాఠకులకి భాషని గురించిన ఆలోచన ఉండడం ఎంతైనా హర్షించదగ్గ విషయం. కానీ వారు ఈ భేదాలని కూడా గమనించాలి.

నిజానికి నేను తెలుగులో రాస్తున్నప్పుడు కొంత శ్రమ పడవలసి వస్తోంది అమెరికాలో నేనున్నచోట తెలుగు వాడే అవకాశం లేనందున, భాష మర్చిపోతున్నాను. అలాగే ఏదో ఒక మాండలీకంలో రాసినకథ అర్థం చేసుకోడానికి కూడా అవస్థ పడాల్సివస్తోంది. నాతెలుగుని నిలబెట్టుకోవాలంటేనూ, విస్తృతపరుచుకోవాలంటేనూ అదొక్కటే మార్గం నాకు. మరి ఈనాటి పాఠకులకి ఆ ఓపిక లేదా? లేక, అసలాదృష్టి లేదా?

చివరిమాటగా, ఫెమినిజంగురించి ఒకమాట చెప్పి ముగిస్తాను. ఈమధ్య ఏకథలో ఒక స్త్రీపాత్ర ఏ అభిప్రాయం వెలిబుచ్చినా, అదుగో ఫెమినిజం, అనీ ఆరచయితని ఫెమినిస్ట్ అనీ ముద్ర వేసేయడం పరిపాటి అయిపోయింది. ఉదాహరణకి, ఒక కథలో భర్త "నాభార్య గిన్నెలు తీసి పెడుతుందిలెండి" అంటాడు. ఆమాటగురించి ఆ భార్య "నేను చేస్తాను" అనడానికీ "మాఆవిడ చేస్తుందనడానికీ" మధ్యగల తేడాగురించిన విచారణలో పడుతుంది. మరి ఈవాక్యంమూలంగా మొత్తం కథ అంతా ఫెమినిస్ట్ కథ అయిపోతుందా? అదే ఆ భార్యే, "మాఆయన చేస్తాడులెండి" అంటే బాగుండునా? ఇది ఒక సందేహం. ఇప్పుడు మరోకథ, **గుడ్డిగవ్వ** (వార్త. జనవరి 9, 2005) చూడండి. అమెరికాలో ఉన్న అన్నగారు గొంతు పూడుకుపోయిన తమ్ముడిని ఆపరేషను చేయించడానికి అమెరికా తీసుకువస్తాడు. వాళ్లింటికి, స్నేహితులు వచ్చినప్పుడు, కారులోంచి సూట్కేసులు తీసుకురావాలి. "నేను తెస్తాలెండి" అంటాడు అన్నగారు, ఉన్నచోటునించి కదలకుండా. తమ్ముడికి "తీసుకురా" అని చెప్పడు. తమ్ముడే వెళ్లి అందుకుంటాడు. ఈరెండు సన్నివేశాల్లోనూ రచయితగా నా అభిప్రాయం ఒకటే - ఒక మనిషి మరొకమనిషిచేత మరొకరిసేవకి ఉదారంగా చేయించడం. అంతే. ఇందులో లింగభేదం కన్నా ఎక్కువగా కనిపించేది ఎవరు ఎవరిని వాడుకోగలిగితే, ఎలా వాడుకోగలిగితే అలా వాడుకోడం. అదీ నేను చెప్పదలుచుకున్నది. ముఖ్యంగా ఈ ఆచారం మనఇళ్లలోనే కానీ అమెరికన్ సాంప్రదాయంలో లేదు. ఇక్కడ ఎన్నారై మనస్తత్త్వాలూ, మారుతున్న కుటుంబవిలువలవిషయంలో అయోమయం కనిపిస్తుంది.

మరొక విశేషం. వార్త తరవాత మరొక పత్రిక ఇది ప్రచురించుకున్నారు. వారు "నేను తెస్తాను" అన్న వాక్యాన్ని "ముత్యం (తమ్ముడు) తెస్తాడులెండి" అని మార్చేశారు, నన్ను అడక్కుండానే! అలా మార్చడంతో నేను ఎత్తి చూపదలుచుకున్న కోణం ఎగిరిపోయింది. నా అభిప్రాయం మనఇళ్లల్లో అదొక కిటుకు అనొచ్చేమో. దానికి ప్రత్యేకమైన పేరు లేదు కానీ జరిగేదేమిటంటే, నేను చూస్తానులెండి అన్నప్పుడు తానే చేస్తానని కాదు. నా కథలో ప్రత్యేకించి నేను చెప్పదలుచుకున్నది - ముత్యానికి అన్నగారి అభిప్రాయం తెలుసు. అంచేత అన్నగారు తనకి నేరుగా మాటల్లో చెప్పకపోయినా, సూట్ కేసులు తెస్తాడు. ఆ ఎడిటరుగారికి ఇది అర్థం కాలేదు కనక నేను తప్పు రాసేను అనుకుని, నాతో చెప్పనైనా చెప్పకుండా మార్చేసేరు. ఒకరు మరొకరిని ఎంత నాజూగ్గా మరొకరిని సేవలోకి తోస్తారో చూపించదలుచుకున్న నాధ్యేయం మట్టి గొట్టుకుపోయింది.

నాసందేహాలు - ఈ ఇజాలముద్ర వేయడంలో పాఠకులు తొందరపాటు చూపుతున్నారా? లేక, రచయితలే తాము ఆవిష్కరించదలుచుకున్నవిషయాన్ని స్పష్టం చేయలేకపోతున్నారా?

అది అలా ఉంచి, అసలు ఈవాదాలకి అతీతంగా "కథకోసం కథ" (art for art's sake) చదువుకోడం సాధ్యం కాదా? పోతన గానీ వేమన గానీ ఎవరిమెప్పుకోసమో, ఏ సాంఘికప్రయోజనం ఆశించో రాయలేదు కదా. కథారచయితలు, కనీసం కొందరు, కూడా అంతే అనుకోడానికి అవకాశం ఉందా? లేదా?

(ఫిబ్రవరి, 11, 2022)

# కవులలో వైషమ్యాలు

యాచకో యాచకః శత్రుః అంటారు. కవులలో మత్సరం కూడా అలాటిదే. యాచకులు కాసుకోసం పేచీ పడితే, కవులు తమ ప్రజ్ఞాపాటవాలు చాటుకోడానికి వాదోపవాదాలలోకి దిగుతారు.

వెనకటికవులు పెద్దన, రామకృష్ణుడివంటివారు సభలలో ఒకరిరచనలలో మరొకరు తప్పులు పట్టుకుని హేళన చేసుకుంటే, అచ్చుపత్రికలు వచ్చేక, నీది తప్పు అంటే నీదే తప్పు అని ముఖాముఖీ కాక వ్యాసాలకి వ్యాసాలే రాసి పత్రికలలో ప్రచురించుకున్నారు. వీరేశలింగంగారూ కొనకళ్ళ వెంకటరత్నంగారూ తమ తమ పత్రికలలో ప్రచురించుకుంటే, తరవాతి తరాలలో, ప్రాచుర్యంలో ఉన్న పత్రికలలో ఈ వాగ్యుద్ధాలు సాగేయి.

తిరుపతి వెంకటకవులు, నిజానికి చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు మాత్రమే,  ఈ వాదోపవాదాలలో పాల్గొన్నట్టుంది తమకాలపు కవులతో. తిరుపతిశాస్త్రిగారు వాటిజోలికి పోలేదుట. ఆవాదనలు సూక్ష్మీకరించడం కష్టం. వెంకటశాస్త్రిగారు తన కథలు గాథలు గ్రంథంలో అనేక వ్యాసాలు పొందుపరిచేరు ఈవిషయమై, ఇంకా ఇతర అంశాలనుగురించి రాసిన వ్యాసాలు చాలా ఉన్నాయి ఆ గ్రంథంలో. 900 పుటలకి మించి ఉంది. ఆ బృహద్గ్రంథానికి లింకు చివరలో ఇచ్చేను.

ఇది ఎందుకు మొదలు పెట్టేనంటే, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి **అనుభవాలు జ్ఞాపకాలు** మళ్ళీ చదువుతుంటే నాకు కలిగిన ఒక ఆలోచన మీతో పంచుకోడానికి.

సుబ్రహ్మణ్యశాస్త్రిగారు కవిత్వరచనగురించిన విద్య నేర్చుకోడానికి యోగ్యులయిన గురువుగారికోసం వెతుకుతున్నసందర్భంలో వారికి ఇద్దరు జంటకవులు స్ఫురణకి వచ్చేరు. వారు రామకృష్ణకవులు, తిరుపతి వెంకటకవులు. వీరిలో ఎవరు తమకి తగుదురు అన్నవిషయంలో కలిగిన సందిగ్ధావస్థ వివరించడం ఒక ఎత్తయితే, ఆ ఇద్దరు జంటకవులమధ్య జరిగిన వాదోపవాదాలు వర్ణించడం మరొక ఎత్తు. అవి ఎలా ఉంటాయో చెప్పడానికి ఒక చిన్న ఉదాహరణ ఇదుగో.

నామట్టుకి నేను, వివాదరూపంగా వుండిన ఆ వుభయుల రచనలూ కొన్ని కొన్ని చదివి, భాషకూ, సాహిత్యానికీ, కవిత్వానికీ సంబంధించిన అనేక విషయాలు తెలుసుకుని వున్నా నప్పటికే, సుళువుగా.

"అందాక, ఇందాక, ఎందాక" ఈ శబ్దాలు నిర్భందుకంగా వాడారు, తిరుపతివేంకటకవు లంతటా.

"ఈ దాకలో అరసున్న వేయింపు"డని రామకృష్ణ కవుల విమర్శ.

"బ్రతిమాలు" అని తిరుపతివేంకట కవుల వాడకం.

"బ్రేవాంగు లన్న ట్టుండీ మాట" అని రామకృష్ణ కవుల విమర్శ.

'అందాఁక, ఇందాఁక, ఎందాఁక' అని పఠిందుకంగా వాడాలనీ 'బతిమాలు' అనాలనీ నాకింతవరకూ తెలియనే తెలియ"దన్నా డొక కవి, ఇది చదివి.

"ఇది హేళనే, సందేహంలేదు; కాని యిందులో చమత్కారం వుంది. అంచేత నన్ను బాగా ఆకర్షించింది. ఈ జన్మలో నేనీ శబ్దాలు తప్పుగా వాడనిక" అనిన్నీ అన్నా డతను.

ఇలాంటి ప్రయోజనాలు పొందినవారప్పుడెందరో వున్నా రావాఙ్మయం చదివి.

ఈ మహాయుద్ధం మూలంగా వేంకటశాస్త్రిగారి శిష్యులకున్నూ కొందరికీ మంచి పేరూ ప్రఖ్యాతీ వచ్చాయి.

ముట్నూరి కృష్ణారావుగారు ఆ శిష్యుల్లోనో శాస్త్రిగారి అంతరంగికుల్లోనో ముఖ్యులు.

చివర్లో ఆ వాదోపవాదాల ప్రయోజనాలగురించి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి విచారణ చూడండి. అనేక సందర్భాలలో ఆర్షప్రయోగం, కవిసమయం అంటూ సుప్రసిద్ధకవుల ప్రయోగాలని ఆదరించడం జరుగుతుంది. మరొకప్పుడు ఇదుగో ఇలా వివరణలతో కూడిన వాదాలవల్ల పాఠకులకి కొన్ని వాడుకలు స్పష్టం అవుతాయి.

అయితే ఒక విషయం మాత్రం గమనించాలి. ఆ స్థాయి తప్పులెంచడానికి అంతటి వైదుష్యం కూడా ఉండాలి. లేకపోతే తప్పులెంచినవారే అపహాస్యంపాలవడం తథ్యం. తెనాలి రామకృష్ణులవారు ప్రెగడ నరసరాజుగారిని నిరసించినట్టు "తెలియనివన్ని తప్పులని … పలుకగరాదు"వతు అవుతుంది.

000

పైన ఉటంకించిన పుస్తకాలకి లింకులు —

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారు. కథలు గాథలు. https://archive.org/details/in.ernet.dli.2015.489063

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు. అనుభవాలు జ్ఞాపకాలు. https://archive.org/details/in.ernet.dli.2015.497720

(ఆగస్టు 3, 2020)

# భాష

( సిరికోన సాహితీ ఎకాడమీ సభలో నాప్రసంగసారాంశం)

(సెప్టెంబరు 10, 2022, జరిగిన సిరికోన, కోడూరు పార్వతి స్మారక పురస్కారం సందర్భంలో ప్రసంగం కొన్ని అంశాలు మరింత స్పష్టం చేసాను ఇక్కడ.)

భాషకీ సంస్కృతికీ అవినాభావసంబంధం ఉంది. అసలుసంస్కృతికి భాష ప్రాతిపదిక కూడా. సంస్కృతిని నిర్వచించేది భాషే. మనిషిని మనిషితో జత కూర్చేది భాష. అదే సాహిత్యంగానో వాఙ్మయంగానో పదిలపరుచుకుంటున్నాం. స్థూలంగా చూస్తే సాహిత్యం  రెండు పాయలుగా ప్రవహిస్తోంది అని నాకు అనిపిస్తుంది.

పండితులు సృష్టించినది, పామరులు సృష్టించినది. ఇక్కడ పండితులంటే యూనివర్సిటీ డిగ్రీలున్నవారనే కాదు. పామరులంటే అక్షరమ్ముక్క రానివారు అనీ కాదు. పామరులు అంటే అజ్ఞులు, మూర్ఖులు అని ఆంధ్రభారతి నిర్వచనం. నేను ఆ అర్థంలో వాడడం లేదు. కాగితంమీద వ్రాయనివారు అని మాత్రమే నా ఉద్దేశం.

ఈ రెండు పాయలను ఖచ్చితంగా నిర్వచించలేను కానీ ఈప్రసంగం పూర్తయేవేళకి నాఆలోచన మీకు కొంతైనా తెలుస్తుందని ఆశిస్తున్నాను.

1. పండితుల రచనలు మేధకి సంబంధించినవి. వారు వ్యాకరణం, ఛందస్సు, అలంకారశాస్త్రం క్షుణ్ణంగా చదువుకుని, ఆ నియమాలపరిధిలో ప్రౌఢరచనలు చేస్తారు. ఆరచనల్లో చమత్కారం, భాష ప్రౌఢత, అన్నీ కవుల, పండితులభావాలనే కాక, మేధోసంపత్తిని కూడా వెల్లడి చేస్తాయి. ఈవిషయానికి మళ్లీ వస్తాను.

2. పామరులరచనల్లో ఈ వ్యాకరణం, ఛందస్సువంటి అంశాలఆలోచన ఉండదు. చమత్కారం  ఉంటుంది. శాస్త్రాల్లో చెప్పినట్టు అనరు. వాటిని విశ్లేషించే పండితులు ఆ పాటల్లో లయ ఉంటుంది, ఊపు ఉంటుంది అంటారు. ఆ పాటల్లో కథల్లో అనేక జాతీయాలు, సామెతలూ ఉంటాయి. ఆ సాహిత్యం ప్రధానంగా నిత్యజీవితంలో తమఅనుభవాలనూ, ఆశలనూ, ఈతిబాధలనూ ప్రకటించేదిగా ఉంటుంది. పండితులలా వారు యతిప్రాసలూ, గణాలూ లెక్కలు చూసుకోరు. ఆశువుగా తోచినది చెప్పుకుంటూపోతారు.

ఈ రెండు సాహిత్యాలమధ్య తేడాకి ఒక చిన్న ఉదాహరణ ఒక కూనలమ్మపదం.

కుక్కలే శునకాలు

కుండలే భాండమ్ములు

ఆడువారే స్త్రీలు ఓ కూనలమ్మా.

కుక్కలు, కుండలూ, ఆడువారు అన్నపదాలు అంటే పామరులభాష. శునకాలు, భాండాలు, స్త్రీలు అంటే పండితులు రచనలు. ఇది స్త్రీలని హేళన చేయడమేనని ఆచార్య కోలవెన్ను మలయవాసినిగారు అన్నారు విశాఖ సాహితీ సభలో. నేను మాత్రం ఇక్కడ ఉదహరించింది ఇక్కడ పండితులు, పామరులు ఎవరు ఏ భాష వాడుతారు అన్న చర్చకోసం ఉదహరించేను.

(తా.క. ఇది నాకు మరింత స్పష్టంగా తెలిసింది ఆమధ్య నేను పతంజలి యోగసూత్రాలకి నా తెలుగు అనువాదం ఒక పండితులగ్రూపులో పోస్ట్ చేసినప్పుడు. ఆపోస్టులో నాధ్యేయం స్పష్టంగానే చెప్పేను. ఆ సంస్కృతం అర్థం చేసుకోవడం నాకు కష్టమయింది, నాకోసం, నాలాటివారికోసం మాత్రమే ఆ యోగసూత్రాలను నాకు తెలిసినవాక్యాలలో పెట్టేనని చెప్పేను. నామాట పట్టించుకోకుండా, అక్కడ పండితులు “అలా చేస్తే భావసాంద్రత తగ్గిపోతుంద”ని చెప్పి ఆంగ్లపదాలు ఉపయోగిస్తూ ఎలా రాయాలో నాకు విదితం చేసేరు. అంటే ఇంగ్లీషుపదాలు వాడితే భావసాంద్రత ఉంటుంది కానీ మనం సాధారణతెలుగులో అయితే పనికిరాదని నాకు ఇంతవరకూ తెలీదు. ఇంకా అలా భావసాంద్రతగల ఇతర పండితులఅనువాదాలు కూడా ఉదహరించేరు. 9.18.2023)

పండితులు, పామరులు ఎవరిభాష ఎక్కువ అని కాదు ఇక్కడ చర్చ. భాషకి సంబంధించిన మౌలికమైన ఒక వ్యత్యాసాన్ని ఎత్తి చూపుతున్నాను. మనసుకి బుద్ధికీ మధ్యగల వ్యత్యాసం అనవచ్చు. కేవలం రెండు వర్గాల జనాలలో సృజనాత్మకతలో తేడా చూపుతున్నాను. ఈ తేడా ఇప్పటికీ కొనసాగుతోందని నాఅభిప్రాయం.

స్వాతంత్ర్యపోరాటం నేపథ్యంలో స్త్రీలను విద్యావంతులుగా చేసే ప్రయత్నంలో పత్రికలు వచ్చేయి. **గృహలక్ష్మి, హిందూసుందరి**లాటి స్త్రీలపత్రికలు స్త్రీలరచనలని ప్రోత్సహించడం వచ్చేక, అక్షరాలు రానివారు కూడా అక్షరాలు నేర్చుకుని ఈపత్రికలకి వ్రాస్తూ వచ్చేరు అని లక్ష్మణరెడ్డిగారు **తెలుగు జర్నలిజం** సిద్ధాంతగ్రంథంలో వ్రాసేరు. ఆ స్త్రీలరచనలలో మూలతత్వం ఆ పామర రచయితలవంటిదే అంటాను నేను. వీరు కూడా లక్షణగ్రంథాలూ, కథనవిధానం సూత్రాలూ ఏవి పట్టించుకోకుండా కేవలం తాము చూసినవీ, అనుభవించినవీ రాసేరు కనక.

భాష సజీవం కనక మార్పు సహజం. కొత్తపదాలు వచ్చి చేరుతాయి. కొన్ని పదాలు వాడుకలో లేకుండా పోతున్నాయి. భాష మారుతుందన్న విషయంలో ఎలాటి వివాదం లేదు.

అయితే, ఈ మార్పు ఎప్పుడు ఎలా ఎందుకు వస్తుంది, తెలుగులో ఎలా వచ్చింది అని ఆలోచిస్తే నాకు తోచిన  అభిప్రాయాలు ఇవి.

నాకు కనిపించినంతవరకూ భాషలో మార్పుకి భావాలలో మార్పుకి సంబంధం ఉంది. ఈనాడు సాంఘికప్రయోజనం, సామాజికస్పృహ. అభ్యుదయభావాలు కథలలో ఉండాలని సాహితీవేత్తలు అంటున్నారు. ఆ ప్రాతిపదికమీదే కథలు వ్రాయడం, సంపాదకులూ విమర్శకులూ కథలని ఆమోదించడం లేదా నిరసించడం జరుగుతోంది. బహుమతులు ఇవ్వడానికి కథల విలువ కట్టడం కూడా ఇదే పద్ధతిలో ఉంది.

నిజానికి ప్రాచీనసాహిత్యంలో ఈవిలువలు లేవా అంటే ఉన్నాయి. సంఘంలో ధర్మం పునఃప్రతిష్ఠించడానికే నన్నయ భారతం రాసేడు అంటారు కదా. అయితే భారతాన్ని అదే దృష్టితో ఇప్పుడు చదవడం లేదు. అల్లసానివాని అల్లిక జిగిబిగి అంటారు. మరో కవి కవిత్వం ద్రాక్షాపాకం, నారికేళపాకం అంటారు. అంటే అది సాంఘికప్రయోజనం మాట కాదు కదా. కవిత్వాన్ని ఒక సాహిత్యప్రక్రియగా ఆదరించి, చేసినవ్యాఖ్యానాలు అవి. సందేశం లేక ఇతివృత్తాన్ని మించి ఆ కవిత్వంలో ఇతర అంశాలనుగురించి చేసిన విమర్శలవి.

ఇప్పుడు కథల విమర్శలలో ఇలాటి వివిధ కోణాలపరిశీలన కనిపించదు. స్త్రీవాదం అనో మరోటో పేరు పెట్టి ఆ రచన సంఘాన్ని ఉద్ధరించడానికి ఏమాత్రం ఉపయోగపడుతోంది అన్న దృష్టితో మాత్రమే విమర్శించడం, విలువ కట్టడం జరుగుతోంది. అంటే కథని సాహిత్యప్రక్రియగా కాక" రోగాలు కుదిర్చే మందు"గా వాడుతున్నారు. కాల్పనికరచనకీ వాస్తవమైన వార్తాకథనానికి తేడా గుర్తించడం లేదు.

కథలో ఉండే ఇతరఅంశాలు – భాష, శైలి, పాత్రచిత్రణ, జాతీయాలు, సంస్కృతిపరమైన అంశాలు, శీర్షిక కథకి నప్పిందా లేదా- ఇలాటివేవి పట్టించుకోనివారు మాత్రమే అలా అనగలరు. కథని సాహిత్యప్రక్రియగా కాక రాజకీయనినాదంగా పరిగణిస్తున్నారు.

భాషలో వస్తున్న పరిణామం గమనిస్తే కనిపించేవి -

1. ఒక కొత్తపదం చేరడానికో, ఉన్నపదం వాడుకలోంచి తప్పుకోడానికో సుమారు రెండు దశాబ్దాలు పట్టినట్టు కనిపిస్తోంది ప్రాచీనగ్రంథాలు చూస్తే. ఇప్పుడు అలా మారడానికి పట్టే సమయం 2, 3 తరాలకి తగ్గిపోయింది. మనకి తొందర ఎక్కువయిపోతోంది.

2. అలాగే పదాలు మాయమవడం కూడా. తరతరానికీ తగ్గిపోతున్నాయి వాడుకలో మామూలుగా ఉండే పదాలు. నాకాలంలో నిత్యజీవితంలో ఉన్నపదాలకి ఇప్పుడు "అంటే ఏమిటి" అని అడుగుతున్నారు.

మనభాషలో కొత్తపదాలు చేరడానికి కొంతవరకూ కారణం ఇంగ్లీషుపాలన అని అనడం న్యాయం కాదు. ఇంగ్లీషువాళ్లు దేశాన్ని వదిలిపోయేముందు, మీరు మాభాషని నెత్తికెత్తుకోవాలి అని నియమాలు పెట్టలేదు. పాలనావిధానం తెలియడానికి ఇంగ్లీషు నేర్చుకోండి అన్నారు. అది IAS చదువులతో మొదలయింది.

గెలటీ A dictionary of the current Telugu తయారు చేసేక, వారికుమారుడు ఆర్. గెలటీ ఆ నిఘంటువు తయారు చేయడానికి కారణం ఇంగ్లీషువారు వెళ్లిపోయేక మనం మనదేశాన్ని పాలించుకోడానికి మనభాషలో ఆ పదాలు అవుసరం అనిట. అది మనవాళ్ల తలకెక్కలేదు. వారికి వార్రై మీరు మాభాషే వాడాలి అని చెప్పకపోయినా, మనవాళ్లు ఆ భాషా, భావాలూ కూడా వదిలిపెట్టలేదు. అందుకే మన స్వేచ్ఛ, భాషాభిమానం వాగాడంబరంగానే మిగిలిపోయింది.

గిడుగు వెంకట సీతాపతి  A History of Telugu Literature అన్న పుస్తకంలో ఇతర భాషాపదాలు మనభాషలో కలవడానికి కారణం ఆవస్తువులో భావాలో మనభాషలో లేకపోవడమే అన్నారు. నేనూ అదే అంటాను.

ముస్లిములు పరిపాలనకాలంలో అనేక అరబ్బీ, పెర్షియన్, హిందుస్థానీ పదాలు తెలుగులో చేరడం మొదలయింది. పోర్చుగీస్ వారి రాకతో ఇతర భాషాపదాలు మరింత విస్తరించేయి, ప్రధానంగా అధికారపత్రాలలో. కృష్ణదేవరాయలు, పెద్దనవంటి కవుల ప్రబంధాలలో పార్శీపదాలు ఉన్నాయిట.

పరిశీలించి చూస్తే, అవన్నీ ఆనాటి పరిపాలనకి సంబంధించినవీ, నిత్యజీవితంలో మనసంస్కృతిలో లేనివీ అన్నది స్పష్టం అవుతుంది. ఉదా. జిల్లా, తాలూకా, జిలేబీ, టాంగా.

వీటిలో కొన్ని పదాలు తెలుగులో ఎంతగా కలిసిపోయేయంటే కొందరు తెలుగువారికి అవి తెలుగు పదాలు కావు అని తెలీదు కూడా అన్నారు సీతాపతిగారు. నిజమే. కిటికీ, దుప్పటీ లాటి పదాలు తెలుగుపదాలు కావు అని నాకు తెలీదు ఈపుస్తకం చదివేవరకూ.

మరి, ఏ పదాలు ఆమోదిస్తున్నాం, ఏకారణంగా ఆమోదిస్తున్నాం, ఎందుకు అన్ని పదాలూ ఎందుకు ఆమోదయోగ్యం కాదు అని ఆలోచిస్తే నాకు తోచినవిషయాలు.

బహుశా 1930, 40 దశకాల్లో మొదలయిందేమో తెలుగంటే మనకి నిరసనభావం.

భమిడిపాటి కామేశ్వరరావు రెండు పుస్తకాలు – **మన తెలుగు.** 1938లో, **తెలుగు రెండోభాష** 1941లో- ప్రచురించేరు.

కామేశ్వరరావుగారి మాటల్లో –

అది తెలుగుదేశంలో ఒక బడి. తెలుగువారు ప్రారంభించిన బడి.

తెలుగువారు ప్రారంభించిన ఇంగ్లీషుమీడియం బడి.

తెలుగుదేశంలో తెలుగువారు ప్రారంభించిన ఇంగ్లీషుమీడియం బడి.

ఆ బడిలో తెలుగు రెండోభాష.

**తెలుగుదేశంలో తెలుగువారు ప్రారంభించిన ఇంగ్లీషుమీడియం బడిలో తెలుగు రెండోభాషగా బోధించే తెలుగుపండితుడు ఆయన.**

ఆ తెలుగుపండితుడి నుభవాలు ఎంత హాస్యాస్పదమో అంత విషాదం కూడా అని తెలుస్తుంది ఆ చివరివాక్యం చదివితే. అంత అంత బలంగా తెలుగుభాషస్థానాన్ని గురించిన కటికవాస్తవాన్ని ఆవిష్కరించేరు కామేశ్వరరావుగారు.

తెలుగులో ఇతర భాషాపదాలు చేరడానికి కారణాలు –

1. కొన్ని యథాతథంగా తెచ్చుకున్నవి – మనసంప్రదాయంలో లేని పదాలు.

సీతాపతిగారే చెప్పినట్టు, విదేశీ సంప్రదాయాలు, విదేశీ వస్తువులూ మనవి చేసుకున్నప్పుడు ఆభాషలో పదాలు మనవి చేసుకోడం న్యాయం. కంప్యూటరు, కెమెరా, లాటి వస్తువులకి తెలుగు పదాలు సృష్టించక్కర్లేదు. సృష్టించినా కాలానికి నిలబడవు. దీనికి దృష్టాంతంగా పొగబండి, ధూమశకటం చెప్పుకోవచ్చు.

2. శంఖంలో పోసి తీర్థంగా స్వీకరించిన పదాలు.

మన సంప్రదాయంలో ఉన్నపదాలను పాశ్చాత్యులు, ముఖ్యంగా అమెరికనులు, చిన్నమార్పులతో తీసుకుని వాడుకుంటుంటే, మనం కూడా ఆ వాడుకనే అంగీకరించడం. ఉదాహరణకి యోగా అన్నపదం చూడండి. యోగవిద్య, యోగాసనాలు, రాజయోగం అని తెలుగువాళ్ళ వాడుక. వీటిలో ప్రధానంగా ధార్మికపరమైన కోణం ఉంది. అమెరికనులకి అది వ్యాయామం మాత్రమే. మనవాళ్లు యోగాభ్యాసం చేస్తున్నప్పటి మనస్తత్వం వేరు. కానీ ప్రస్తుతం విపరీతంగా వాడుకలో ఉన్న పదం మాత్రం అమెరికనులు ప్రసాదించిన యోగా మాత్రమే.

3. అలవాటయిపోయిందంటూ తెచ్చుకున్నవి. ఇక్కడ తెచ్చుకున్నతరవాత అలవాటయిందా, అలవాటయేక తెచ్చుకున్నామా అన్నది భేతాళప్రశ్న.

ఉదా. try చేస్తాను. దానికి బదులు ప్రయత్నిస్తాను అనొచ్చు కానీ అది కూడా పండితులవ్యావహారికమే. నిజానికి ఆ సందర్భంలో వెనకటిరోజుల్లో "అలాగేలే", "చేసి చూస్తాను" అనేవాళ్లం, నాతో సహా. అంటే అచ్చంగా అనువాదం కాదు. మనసంస్కృతిలో చెప్పే విధానం వేరు.

అలాగే "1 నించి 4 వరకూ పప్పు నానబెట్టాలి" అని మరో ప్రయోగం. ఇది తెలుగు ప్రయోగం కాదు. మనవాళ్లు మామూలుగా "3,4 గంటలసేపు నానబెట్టాలి" అంటాం.

మరో ఉదాహరణ. కంచుతో చేసిన విగ్రహాలు. మీ అమ్మమ్మని అడిగి చూడండి. ఆవిడ కంచుతో చేసినవిగ్రహాలు అంటారు. కంచుతో "చేయబడిన" అనరు. ఈ "బడు" ప్రత్యయంగురించి నాకు చాలా అనుమానాలున్నాయి కానీ తరవాత ఎప్పుడైనా ప్రస్తావిస్తాను.

4, ఇంగ్లీషులో ఆలోచించి, తెలుగులో వాటిని తర్జుమా చేసుకుని, ఓ కృత్రిమతెలుగు సృష్టించడం జరుగుతోంది ఇప్పుడు (ఈసంకలనంలోనే **మీరు ఏభాషలో ఆలోచిస్తున్నారు** అని మరొకవ్యాసం రాసేను చూడండి). ఇదే ఎక్కువ ప్రమాదం. ఉదా. "నిన్ను విన్నాను" అన్నది I hear you కి అనువాదం. తెలుగులో "నీమాట నాకర్థం అయింది" అంటాం. అలాగే "ఆయన్ని చదివేను" అన్నవాక్యం కూడా ఇంగ్లీషువాక్యానికి అనువాదమే. I read himకి సాధారణంగా ఆయనతీరే అంత అన్నది తెలుగుప్రయోగం. ఆయన్ని పుస్తకంలా చదివేస్తాను అన్నది కూడా ఇంగ్లీషువాక్యాన్ని తెనుగీకరించడమే కానీ ఇది ఉపమాలంకారంగా తీసుకోవచ్చు, పుస్తకంలా అన్న పదం చేరిస్తే.

ఇక bath take చేసేరా, fruit throw చెయ్యకండి లాటివాక్యాలనిగురించి ఏమనలో నాకు తెలీదు. ఇవి భాషాభివృద్ధికి దోహదం చేస్తున్నాయా? స్నానం చేసేరా, పళ్లు పారేయకండి అంటే ఏమి తక్కువయింది?

సూక్ష్మంగా పరిశీలించి చూస్తే తెలిసేది ఆనాటి పండితులలో శాస్త్రనియమాలూ, చర్చలూ ఈనాడు స్త్రీవాదంలాటి వాదాల్లోనూ, సాంఘికప్రయోజనం, సామాజికస్పృహ రచనలుగా పరిణమించేయి. ఈ వివాదాలు పండితులమధ్యే ఉంటున్నాయి. సామాన్యప్రజలకి అందుతున్నాయా, వారు చూస్తున్నారా, వారికి వీటివల్ల ఏమైనా లాభం కలిగిందా అంటే నాకు అనుమానమే. ప్రధానంగా ఇవి ఉన్నత, మధ్యతరగతి పరిధిలోనే ఉన్నట్టు కూడా కనిపిస్తోంది.

పండితులలో కూడా తాము చూసినలోకం, తమఅనుభవాలు కథలు రాస్తున్నవారు ఉన్నారు. నేను దీన్ని పారమరచనతాలూకు గుణం అంటున్నాను. ఈరచనలు ఎక్కువగా బ్లాగుల్లోను, ఫేస్బుక్ టపాలలోనూ కనిపిస్తున్నాయి. సాహిత్య పత్రిక అని పేరు పెట్టుకున్న జాలపత్రికలలో కూడా కనిపిస్తున్నాయి.

ఈ రచనల్లో రాజకీయనినాదాలను ప్రచారంచేసే ధోరణి ఉండదు. పేరుప్రఖ్యాతులకోసం వెంపర్లాట ఉండదు. తనలో తాను మాట్లాడుకుంటున్నట్టుంది కానీ మరొకరికోసం రాస్తున్నట్టు ఉండదు.

అన్నిరచనల్లోనూ ఇంగ్లీషుపదాల వాడుక చాలా ఎక్కువయింది. ఒకొకప్పుడు మొత్తం వాక్యం ఇంగ్లీషులోనే ఉండి చివర మాత్రం అండి అనో కదా అనో చేర్చడం జరుగుతోంది. ఇది వ్యావహారికభాషావాదానికి దీటుగా ఉందని కొందరివాదన. ఇలా మాట్లాడుతున్నాం కనక ఇలా రాస్తున్నాం, ఇలాగే రాయాలి అంటారు వారు.

నేను కూడా ఇంగ్లీషు చదువుకున్నాను. కానీ నాకు తెలుగు ఇప్పుడు రాస్తున్నవారికంటె బాగానే పట్టు పడిందని చెప్పగలను. నాకు ఈమాత్రం తెలుగుభాష పట్టుబడడానికి కారణం ఆరోజుల్లో అంటే 1940, 50, 60 దశకాల్లో భారతి, ఆంధ్రపత్రిక, సాహితి వంటి పత్రికలలో నోరి నరసింహశాస్త్రి, వేలూరి శివరామశాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రివంటి పండితులు వ్రాసిన కథలే కాక, వ్యాసాలు కూడా చదవడం. ఈనాడు పత్రికలలో వస్తున్నకథలు చదివి “నాతెలుగు మెరుగు పడింది” అని ఎవరైనా చెప్పుకోగలరా?

నేను ఫేస్బుక్కులో చేరడం నేనున్నచోట తెలుగు వినిపించకపోవడం, తెలుగుపదాలకోసం ఆరాటంమూలంగానే. ప్రత్యేకించి తెలుగుపదాలకోసమే పెట్టుకున్న పేజీ కనక తెలుగులో అంటే - తెలుగుపదాలు తెలుగులిపిలో వ్రాయగలవారిని - మాత్రమే నామిత్రమండలిలో చేర్చుకుంటానని చెప్పేను. అది కొందరికి కష్టంగా ఉందని తెలుసు కానీ నాకు కావలసింది తెలుగే మరి. క్రమంగా నా తెలుగుమూలంగానే నాపేజీకి వస్తున్నారని తెలిసింది. అసలు కొందరయితే కేవలం నామిత్రమండలిలో చేరడంకోసమే తెలుగుఫాంట్స్ తీసుకుని కంప్యూటరులో తెలుగు వ్రాయడం నేర్చుకున్నాం అని అన్నారు.

సమాజంలో, మనజీవనవిధానంలో, మనం ఉన్న వాతావరణంలో వస్తున్న మార్పులవల్ల మనం మాట్లాడేభాష మారుతుంది. నిజమే. ఇద్దరు ఇంజినీర్లు వాళ్ల వృత్తివిశేషాలు మాట్లాడుకున్నప్పుడు ఇంజినీరింగుమాటలు రావడం సహజమే కదా.

అలాగే వంటల్లోనూ. గ్రైండరులో గ్రైండ్ చేయడంలో ఆశ్చర్యంలేదు. గ్రైండ్ చేయడానికీ రుబ్బడానికీ తేడా పెద్దదే నిస్సందేహంగా.

కాని నీళ్లకీ, ఉప్పుకీ, సాయంత్రానికీ, కిందటేడుకీ water, salt, evening, last year అనవలసిన అవుసరం ఏమిటి? దీనివల్ల భాషాభివృద్ధి జరుగుతోందా? నష్టం జరుగుతోందా?

నేను రచయితలని కోరుతున్నది ఇదే. దేశాభిమానంలాటిదే భాషాభిమానం కూడా. ప్రస్తుతం మాటల్లో ఎలాగా లేదు, కనీసం రాతల్లోనైనా తెలుగు నిలబెట్టండి. మనతరవాతి తరాలు తెలుగు

అంటే ఇదీ అని తెలుసుకోగలిగేది కథల్లోనే.. సామాజికస్పృహలాగే, నిజానికి ఇంకా ఎక్కువగా, భాష స్పృహ కూడా ఉండాలి. ఇది ప్రస్తుతం రచయితలబాధ్యత.

(సెప్టెంబరు 11, 2022)

# చిలిపి భాషలు

మహారచయితల చమత్కారాలు అపురూపం. ఒకొకప్పుడు అవేమంత గొప్ప చతురభాషణలు కాకపోయినా మళ్ళీ మళ్ళీ చెప్పుకుంటారు. కానీ పేరు ప్రతిష్ఠలు లేని అనామకులు ఆడే హాస్యాలూ, చతురబాషణలూ ఎవరూ మాట్లాడుకోరు. వినేసి, ఆ క్షణానికి నవ్వేసి ముందుకి సాగిపోతారు. అలా తిరిగి చెప్పుకోని కథలివి. ఈ వినోదం కూడా చెప్పుకు ఆనందంచవలసిందే అని నా అభిప్రాయం. ఇది ఆ అనామకులకు నివాళి.

నాసంచారంలో ఒకాయన నాకు రోజూ కనిపిస్తుంటారు. రెండవప్రపంచ మహాసంగ్రామంలో పాల్గొన్న మాజీ యుద్ధవీరుడుట. ఆంధ్రభారతిలో ఇలాటివారిని vetaran అంటే "బహుదినాల ముసలిబంటు" అని ఇచ్చేరు కానీ అది సరి కాదు. యుద్ధరంగంలో కానీ మరోరంగంలో కానీ ఆరితేరినవారిని veteran అంటారు. వయసుతో నిమిత్తం లేదు. ఇంతకీ చెప్పబోయే కథ 93ఏళ్ళ మాజీ వీరునిగురించి. ప్రతిరోజూ నన్ను హెచ్చరిస్తూ ఉంటారు జాగ్రత్తమ్మా, ఇక్కడ డ్రైవర్లు మనని గుర్తించరు అంటూ. ఆయన ఏమి పని చేసేరో నాకు తెలుసు, ఆయనవయసు తెలుసు. నావయసు ఆయనకి తెలుసు. అంచేత పేరు కూడా తెలుసుకోడం న్యాయమే అని తోచింది నాకు.

పేరేమిటని అడిగేను ఒకరోజు.

ఆయన చెప్పిరు కానీ నాకు అర్థం కాలేదు.

మళ్ళీ అడిగేను.

మళ్లీ అర్థం కాలేదు.

నేను అయోమయంగా చూస్తుంటే, ఆయన, “నేనిలాగే అందరికీ చెప్తాను. అప్పుడు ఆ ముఖం చూడాలి,” అని రెండు క్షణాలాగి, “తిరగేసి చెప్తున్నాను,” అన్నాడు.

ఏం చెప్పను?

అతనే మళ్ళీ చెప్పేడు, ఈమారు నేరుగా చెప్పేడు, “Lawrence Superdahl, like Superman.”

Superdahl అని వదిలేస్తే సరే, Supermanలాగ అంటే నాకు  మళ్ళీ సందేహం ఆ Superdahl  నిజమేనా, అందులో కూడా మళ్లీ ఏదైనా తికమక ఉందా అని. Superdahl అయితే నిజమే కావచ్చు. Super Doll అయితే అనుమానమే కదా. అదే అడిగేను.

“Superdahl like superman,” అనేసి తనదారిని నడక సాగించేడు. ఇంక అడగడం అనవసరం అనుకుని శలవు తీసుకుని నాదారిన నేను పోయేను.

లారెన్స్ సూపర్డాల్ అన్న పేరులో చాలా అక్షరాలే ఉన్నాయి. దాన్ని ఆయన తిరగేసి చూసుకోడానికి ఎంత సేపు పట్టిందో కానీ ఒకసారి చూసుకున్నాక మరింక కష్టం లేదు. ఎన్నిమార్లు చెప్పినా అది మారదు కదా.

ఇది పదే పదే తలుచుకుని నవ్వుకున్నాను. ఆ హుషారులోనే నాపేరు తిరగేసి చూసుకున్నాను. నాపేరు మూడక్షరాలే కనక తేలికే. తెలుగులో అయితే తిలమా. ఇంగ్లీషయితే ఇహ్తాలామ్ ఇంటిపేరు కూడా కలిపితే తిలమాలువోదడని. కొంచెం కష్టమే. ఇంగ్లీషులో ఉతోవోడడన్ ఇహ్తాలామ్. ఇది మరింత గాభరా. మన తెలుగుపేర్లు అసలు ఎలా చెప్పినా, హా? అంటూ తెల్లవాడిముఖము మరింత తెల్లబడిపోవడం ఖాయం. దిగ్గంతుల ప్రజ్ఞావర్ధనత్ర్యంబకేశ్వరమూర్తి అని చెప్పి చూడండి. సరే ఇలాటి పేర్లు అరుదు. అట్టే కష్టం అనిపించని అగ్గం విఘ్నపతి అన్నా చాలు వాళ్ళని తికమక పెట్టడానికి.

000

నాచిన్నప్పుడు క భాష అని ఒకటుండేది. ప్రతి అక్షరానికి ముందు క చేర్చి మాటాడ్డం. కమాకలకతికని కచూకసేకవా? అంటే ఏమిటో నేను చెప్పక్కర్లేదు కదా.

మరో పద్ధతి అచ్చులు అలాగే ఉంచి హల్లులు గల్లంతు చేసేయడం. కీము సెతులా అంటే మీకు తెలుసా అని.

మరి ఇవన్నీ నాకు నచ్చితే తెంగ్లీషు ఎందుకు నచ్చదు అంటే పై భాషలన్నిటిలోనూ ఒక పద్ధతి ఉంది. తెంగ్లీషు ఎవరికి తోచినట్టు వారు రాస్తున్నారు. ఎక్కడ అన్న పదం ikkada, ekkada ekada, — ఇలా. ఎలా చదవాలో సందర్భం తెలిస్తేనే సరిగా చెప్పుకోగలం. Transliteration అని ఒక పద్ధతి ఉంది కానీ అది పాటించేవారు నాకు తెలిసి నలుగురు కూడా లేరు.

(జులై 12, 2017)

# అంతర్జాలంలో స్పందనలు

రామక్కా అంటే తామరాకా అన్నట్టు ఉంటున్నాయి ఈమధ్య. నాటపాలదగ్గరే కాదు ఇతరటపాలదగ్గర కూడా చూసేను. జాలగుంపులవచోవిలాసం అని కూడా అనొచ్చు. ఇంతకుముందు రామక్కా అంటే తామరాకా అని సామెత ఆధారంగా ఒక టపా రాసేను. (చూ. **ఎన్నెమ్మకతలు** మొదటి సంపుటం). ఇప్పుడు మళ్లీ అదే విషయంమీద మళ్లీ ఈమధ్యకాలంలో కొత్తగా వచ్చిన జ్ఞానంతో మరో టపా రాద్దాం అనిపించింది. అదే ఈ పోస్టు.

జాలగుంపులు అన్నాను కానీ నాతో కొందరి సంభాషణలు కూడా ఇలాగే ఉంటున్నాయి. అది నాముఖవిశేషమో, నాజాతకమే అంతేనో తెలీదు. లేదా నేను మారిపోయి ఉండాలి. అదీ కాకపోతే లోకం మారిపోయి ఉండాలి. మరో ఆలోచన – చదువుకున్నవారి సంఖ్యా చదువుతున్నవారిసంఖ్యా ఇతోధికంగా పెరిగిపోయేక, విధులు మారిపోయేయోమో. తమకి తెలిసిందేదో చెప్పేయాలని ఉంటుందో, ఏదో ఒకటి "చెప్పడమే" ప్రధానం అనుకుంటారో గట్టిగా చెప్పలేను. "నీమొహం నీకేం తెలుసు. నేను చెప్తాను వినుకో," అని కూడా కావచ్చు.

నేను బ్లాగుతో మొదలుపెట్టి ముఖపుస్తకంలో తేలింది తెలుగుభాషాప్రాభవంకోసమే. రెండోది నాకు తోచిన "అపరిపక్వ" ఆలోచనలు కీబోర్డుపాలు చేయాలన్న ఉత్సాహం. నిత్యజీవితంలోలాగే రాతల్లో కూడా ఎవరి పెర్రి వారికానందం. నాపెర్రి **పాఠకుడిదృష్టి వస్తువుమీద ఉండాలి కానీ రచయితమీద కాదు** అన్నది. నేనేదైనా మాటాడితే ఆవిషయంమీదే పాఠకులు అభిప్రాయాలు రాయాలనుకుంటాను. నాలా ఆలోచించేవారు అస్సలు లేరనను కానీ చాలామందికి నా అభిప్రాయంతో ఏకీభావం లేదు. ఈటపా అలా నాతో ఏకీభవంచనివారి తరహా చెప్పడానికే. మచ్చుకి కొన్ని ఇదుగో. నేను వంకాయకూరమీద ఓ టపా పెడతాను.

దానిమీద వ్యాఖ్య

– "నేను దోసావకాయ చేసేను." ఇది కొంతవరకూ నయమే. ఎందుకంటే బండి ఇంకా వంటకాలమీదే నడుస్తోంది కనక.

మరోవ్యాఖ్య – "బొమ్మలో వంకాయ వంకాయలా లేదు." సరే ఇది కూడా వస్తువుగురించే అనుకుందాం.

ఆ తరవాత –

"మొన్న బెజవాడలో కొంపలంటుకున్నాయిట."

"మా చిన్నవదినది బెజవాడే. అక్కడికి మంగళగిరి ఎంతో దూరం లేదు."

“తెల్లారే అనకాపల్లిలో బస్సెక్కితే మఝ్జానానికి అన్నవరంలో దిగిపోతాం.”

“అన్నంలో కందిపొడి కలుపుకు తింటే ఆ రుచి అడక్కు మరి.”

“Rich Little సినిమా చూసేనివాళ.”“మళయాళం రాదు నాకు.”

“మార్క్ ట్వేన్ హాస్యం అద్భుతం.”

“కార్ల్ మార్క్స్ సిద్ధాంతం ఒక్కటే మానవాళిని ఉద్ధరించేది.”

“ఎన్ని మార్కులొస్తే ఏముందిలే. ఇప్పుడంతా పలుకుబడి యవ్వారమే కదా.”

ఇటీవలే తెలిసిన మరోసంగతి - మనటపా వదిలేసి, నాటపాలో ఒక మాట తీసుకుని మరో టపా రాయడం. ఆ మీదట అందరూ ఆ రెండో టపామీద సాగిస్తారు వ్యాఖ్యానాలు. అవి కూడా పైన చెప్పినట్టే ఉండొచ్చనుకోండి. అది వేరే సంగతి.

000

ఇలా ఏదో ఒక మాట పుచ్చుకు, పొంగిన పాలు నాలుగుచెరగులా పారినట్టు చిందరవందరగా తలో వేపుకీ లాక్కుపోతారు అసలు టపాలో విషయం వదిలేసి. అటుపైన ఆ మొదటివిషయం గంగలో మునిగి కావేరిలో తేల్తుంది.

ఒక్క నాటపాకే కాదు చాలా టపాదగ్గర ఇలాగే ఉంటున్నాయి వ్యాఖ్యలు, మహాపండితుల ఘన శాస్త్రచర్చలయితే తప్ప. అలా పండితులు చర్చించుకున్నప్పుడు చాలా పైస్థాయిలో చేస్తారు కనక ఆ ముగ్గురికో నలుగురికో పరిమితమయిపోతాయి అవి.

నాకిది కొత్తే. నాకాలంలో, అంటే సుమారుగా 60ఏళ్ళక్రితంమాట, వ్యాఖ్యలు ప్రస్తావించిన విషయంమీదే ఉండేవి కానీ ఇలా ఒక మాట పుచ్చుకుని ఊరంతా తిరగడం లేదు. కానీ ఈ నూత్నపద్ధతి ఎవర్నీ బాధిస్తున్నట్టు లేదు నన్ను తప్ప. ఈ టపా కూడా ఎవరికీ పట్టదనే ధైర్యంతోనే రాస్తున్నాను.

వ్యాఖ్యలతరవాత చెప్పుకోవలసింది నాతో సంభాషణలు – ఫోనులో కానీ మాఇంటికొచ్చి ముఖాముఖీ కానీ. నా తలరాత కూడా పైవ్యాఖ్యలలాగే ఉందని చెప్పడానికి రవంత సిగ్గుగానే ఉంది. ఇది ఒక్క నాఅనుభవం మాత్రమే అన్న నమ్మకం కూడా ఉంది నాకు. ఉదాహరణకి నాకు ఏమాత్రం పరిచయం లేనివారు, కేవలం నాబ్లాగు చూసో మరెక్కడో నాకథలు చదివో నన్ను వారికి తెలుసు అన్న అభిప్రాయానికి వచ్చేస్తారు. ఆ తరవాత నన్ను కలుసుకోడానికో ఇంటర్వ్యూ చేయడానికో వస్తాం అంటారు. నేను చాలా అమాయకంగా, వారు నారాతలగురించి మాటాడతారు

అనే అనుకుంటాను. మరి మాకు అంతవరకూ మరేవిధమైన contact లేదు. కనీసం నాటపా దగ్గర ఒకవ్యాఖ్య అయినా రాసి ఉండరు కొందరైతే.

ఇంతకీ అసలు ప్రహసనం ఇలా ఉంటుంది.

"మీగురించి విన్నానండి."

"ఆహ్, అలాగా."

"మీపేరు అంతర్జాలంలో చూసేను. మీకు రావలసిన గుర్తింపు రాలేదండి."

"చాలామంది చెప్పేరండి ఆమాట నాతో." (అదేం ఖర్మో, అందరూ నాతోనే చెప్తారు.)

అంతే. ఆ తరవాత మాట దారి మళ్లుతుంది మరో దిక్కుకి.

"ఫలానావాడికి మరో ఫలానావాడిమీద కోపం ఎందుకో తెలుసా?"

"నాకు అలాటివిషయాలు మాటాడ్డం ఇష్టం లేదండి."

"అది కాదు. అసలేమయిందంటే."

"నాకు చెప్పకండి అంటున్నాను కదా." నేను అలా నిరసన చూపుతూనే ఉంటాను కానీ ఆ మానవుడికి పట్టలేనంత ఉత్సాహం ఆసంగతి చెప్పేయాలని. అంచేత నాగోల వినకుండా తాను చెప్పదలుచుకున్నది చెప్పేదాకా వదలడు.

విషయం మార్చడానికి నేను అడుగుతాను, "మీకు ఏకథలు నచ్చేయి?"

"అలా అడిగితే ఏం చెప్తాను?" అని చిన్నబుచ్చుకుని, "మీకు మాత్రం అన్నీ గుర్తుంటాయేమిటి?" అంటూ నన్ను సవాలు చేస్తాడు, తన తెలివికి బ్రహ్మానందపడిపోతూ.

నిజమే. గుర్తుండవు. కానీ నేను రచయితలని కలుసుకోడానికి వెళ్లినప్పుడు ఆరచయితవి కొన్నైనా మరోమారు చూసుకుని, మాటాడ్డానికి వెళ్ళేను. ఎప్పుడూ ఎవరిదగ్గరా వారిసొంత వివరాలు అడగలేదు, నాసొంతవిషయాలు చెప్పలేదు, అలాగే మరొకరిగురించి మాటాడలేదు. అందుచేతన్నమాట ఈయనగారి వరస నాకు ఆశ్చర్యం.

నాకు ఏం మాటాడాలో తోచదు. ఇంతలో ఆయనగారు కాస్త మేలుకుని, "మీరు ఊసుపోక అని రాసేరు. అవి బాగున్నాయి," అంటాడు.

నాకు ప్రాణం లేచొస్తుంది. అది ఒక్క లిప్తపాటు మాత్రమే. ఎందుకంటే మరుక్షణంలో "తరవాత మీరు ఎన్నెమ్మకతలు అని రాసేరు. అవి బాగులేవు," అంటాడు. నాప్రాణం ఉసూరుమంటుంది. బాగులేవు అన్నాడని కాదు. ఆ రెండూ ఒకటే. ఎన్నెమ్మకతలు ఉపశీర్షిక అని ఆయనకి తెలీలేదు అని నాకు తెలిసినందుకు ఆ విచారం.

ఆ తరవాత ఆయనవ్యాపకాలూ, తన అపారమేధాసంపత్తి, ఇష్టమైన సినిమాలూ, పెళ్ళాం, పిల్లలూ, వాళ్ళవ్యాపకాలూ మున్నగునవి మరోవిడత కచేరి పెట్టి శలవు పుచ్చుకుంటాడు. మళ్ళీ

మనం కలవాలండీ అని కూడా అంటాడు.  నేను పైకి ఏమి అన్నా, మనసులో ఏమనుకుని ఉంటానో మీరు గ్రహించేఉంటారు.

కొందరు ముఖపుస్తకరచయితలు తాము ప్రముఖ రచయిత్రులనీ రచయితలనీ కలుసుకుని జరుపుకున్న విజ్ఞానదాయకమైన, వినోదాత్మకమైన, సంతృప్తికరమైన, ఆనందదాయకమైన సంభాషణలు, రంగులబొమ్మలూ ఫేస్బుక్కులోనూ జాలపత్రికలలోనూ చూస్తుంటాను. అందుచేత అన్నమాట నాకు మాత్రమే ఇలాటివారు తగులుతారా అని ఆశ్చర్యం. ఒళ్లు నన్ను చూస్తేనే తమప్రతిభో గోడో తప్ప మాటాడ్డానికి మరేం ఉండదేమీ వీరికి అని నాకు చిరాకేస్తుంది. ఆ తరవాత నేనిలా రాస్తాననుకోండి, అప్పుడు నాకు అసహనం అంటూ మళ్లీ నాకే అక్షింతలు పడతాయి!!

ఇంక నారాతలుగురించి మాటాడ్డానికేం లేదు అంటే సంతోషంగా ఒప్పుకుంటాను. నారచనల్లో ఆసక్తి లేకపోతే ఫరవాలేదు. కానీ ఆ వంక పెట్టుకుని నన్ను కలుసుకోవాలంటూ ఫోను చేయడం కానీ మాయింటికి రావడం కానీ మోసమే నాదృష్టిలో. అది రామక్కా అంటే తామరాకా లాటి దోరణే.

000

ఇప్పుడు ప్రమాణపూర్తిగా ఉన్నమాట చెప్తాను. దీనినే ఉపసంహారము లేక స్వీకృతి అనుకోవచ్చు. నారచనలకి ఒకప్పుడు, అంటే నా వెబ్ సైటు తూలిక.నెట్ ఆ తరవాత బ్లాగు తెలుగు తూలిక మొదలు పెట్టేక కొంతకాలం చాలా మంచి స్పందన వచ్చేది. పాఠకులు వస్తువుమీదే వ్యాఖ్యానించేవారు. ప్రసిద్ధులైన పండితులు కూడా ఎంతో అర్థవంతమైన వ్యాఖ్యలు చేసి నా సైటునీ, బ్లాగునీ పరిపుష్టం చేసేరు. క్రమంగా చూపులు తగ్గేయి. వ్యాఖ్యలు బాగా తగ్గేయి. ఒకవేళ వస్తే, పైన చెప్పినట్టు, సందర్భశుద్ధి లేని సలహాలే నామంచి కోరుతూ. ఒకొకప్పుడు అక్కర్లేని, అడగని సలహాలు ప్రోత్సహించడమా, బ్లాగు మూసేయడమా అన్న ఆలోచన వస్తుంది.

తీరిగ్గా ఆలోచిస్తే అర్థమయినవిషయం పూర్వం ఇరుగూ పొరుగూలాగే, ఇప్పుడు ఈ ఫేస్బుక్, ట్విటర్, వాట్సాప్ - అంతర్జాలంలో జాలకుటుంబాలు ఏర్పాడ్డాయి. ఒకపేరు పదిసార్లు తెరమీద కనిపిస్తే, వాళ్లు మిత్రులు. పది వ్యాఖ్యలు కనిపిస్తే, కుటుంబం అయిపోతారు. దాంతో పక్కింటివాళ్లలాగే బాగున్నారా, ఏం చేస్తున్నారు, జాగ్రత్తండీ, ఇలా చెయ్యండి, అలా చేయకండి అంటూ ఇంట్లో వాళ్లలాగే ఆత్మీయత చూపుతారు.

బాధ ఎక్కడంటే నేను ఆ తరహామనిషిని కాను. నాకు కావలసింది నేను రాసింది చదివి, అందులో ముఖ్యమైన అంశంమీద మీ అభిప్రాయం మాత్రమే. నేను పొగడ్తలకోసం చూడడంలేదు, నాకు కావలసింది నారచనలమీద అభిప్రాయాలే అని చెప్పినా వినిపించుకోనివారు సాహిత్య సమూహాలలో కూడా అలాగే ఉండడం ఆశ్చర్యం. ఇలా ఆలోచిస్తూ, నేను ప్రవేశించిన

గ్రూపులలోంచి తొలగిపోయేను. ఇంక మిగిలింది నాబ్లాగూ, నా సైటూను. వ్యాఖ్యలు రాయకపోయినా, చూపులు, దింపుకోళ్లు కనిపిస్తున్నాయంటే కొందరు పాఠకులు నాటపాలకోసం ఎదురుచూస్తున్నారనే అనుకుంటాను. వారికి ధన్యవాదాలు.

హెచ్చరిక: అందరూ, అన్ని సమూహాలూ ఇంతే, ఇదే నూటికి నూరుపాళ్లూ నిజం అనడం లేదు నేను. నేను చూసినంతలో ఫేస్బుక్కులో సాహిత్యం పూర్తిగా వస్తువుమీదే నడుస్తున్న సమూహం. అలాగే ఇంకా కొన్ని ఉంటాయనుకుంటాను.

(జూన్ 10, 2017)

.

# జాలలోకంలో ఋణాలు

(హృదయపూర్వక ధన్యవాదములు! శీర్షికతో బ్లాగులో ప్రచురితం.)

ముందు ఒక మనవి చెప్పుకు ప్రారంభిస్తాను. పాఠకులు, మిత్రులు కదాచితుగా నాకథలను తమబ్లాగులోనో ముఖపుస్తకంలోనో ప్రస్తావిస్తారు. అలాటప్పుడు నాకు కలిగే ఆనందం తప్పకుండా బాహాటంగా చెప్పుకుంటాను. వారికి మనఃపూర్వక ధన్యవాదాలు చెప్పుకుంటాను. ఆ తరవాత కూడా తగు సందర్భాలలో మళ్లీ చెప్పుకుంటాను. అయితే ఈ కృతజ్ఞత ఎంతవరకూ అన్న ప్రశ్న కలిగింది నాకు ఈమధ్య కలిగిన ఒక అనుభవంతో. ఆ సందేహం ఆధారంగా రాసిన స్కెచ్ ఇది.

అచ్చంగా ఇలాగే జరగలేదు. చదవడానికి ఇంపుగా ఉండడంకోసం ఇందులో మూడొంతులు కల్పనలు, అతిశయోక్తులు చాలా ఉన్నాయి. అంచేత ఎవరూ నన్నేనా అంటూ భుజాలు తడుముకోనక్కర్లేదు. ఈమాట గుర్తు పెట్టుకుని స్కెచ్చిని స్కెచ్చిగానూ, అందులో సందేశాన్ని సందేశంగానూ గుర్తించి ఆనందించండి.

ఒక వ్యక్తి మనకి ఒక మంచి చేసినప్పుడు, ఆ కారణంగా ఆ వ్యక్తి అంటే మనకి గౌరవం కలుగుతుంది. గౌరవస్తాం. ఆ తరవాత అదే వ్యక్తిలో మరి కొన్ని గుణాలు, ఇంతకుముందు తెలీనివి, కనిపిస్తాయి. అప్పుడు కొంత అయోమయం కలుగుతుంది. కొంచెం కలవరపడతామేమో కూడా. అందుమూలంగా ముందున్న గౌరవం తగ్గుతుంది. అయ్యో అనుకుంటాం. మనకి ఆవ్యక్తిపట్ల గౌరవం తొలగిపోవచ్చు కూడా. ఇవన్నీ సహజమేనని నాఅభిప్రాయం.

000

మెయిలు తెరిచి, అందులో కనిపించిన ఒక మందపత్రం చూసి ఆశ్చర్యపోయేను. నాకెందుకు వచ్చిందా అని. సాధారణంగా నాకు ఈ మందపత్రాలు నచ్చవు. ఏదో ఒక ప్రకటన అయితే అదొక వరస. కానీ బాగున్నారా, అంటూ యోగక్షేమాలు ఒక గుంపుకి పంపితే మాత్రం నాకు అందులో మానవస్పర్శ, ఆత్మీయత కాకపోతే స్నేహం కనిపించదు. మనవాళ్లలో "మన" లోపించినట్టు ఉంటుంది.

అలాటి మందపత్రం అన్నమాట వచ్చింది. వెంటనే, నా అలవాటుప్రకారం తిరిగి మెయిలిచ్చేను, “నా ఐడి మీ మందజాబితానుండి తొలగించవలసిందిగా కోరుతున్నాను.”

“అదేమిటండీ! చేర్చుకోమని కోరినవారే కానీ వద్దన్నవారు లేరు ఇంతవరకూ. నేను ఇతిహాసపు అట్టడుగున పడిఉన్న రెండు కథలు మీవి తవ్వి తీసి నాబ్లాగులో ప్రచురించినప్పుడు మీరేమీ వ్యతిరేకత గానీ అయిష్టత గానీ చూపలేదు మరి.”

"చిన్నారి పొన్నారి చిరుతకూకటినాడు రాసిన రెండు కార్డుకథలు మీరు వెలికి తీసి ప్రచురించినందుకు అప్పట్లో యథాశక్తి ధన్యవాదాలు చెప్పుకున్నాను. ఆ తరవాత సందర్భం వచ్చినప్పుడు కూడా చెప్పినట్టే గుర్తు. లేదంటే ఇప్పుడు మరోసారి ఇదుగో స్వీకరించండి హృదయపూర్వక శతకోటి వందనాలు.

పోతే ఆ తరవాత మీరు నా పోస్టులదగ్గర పెడుతున్న వ్యాఖ్యలు హాస్యం, వ్యంగ్యం, వేళాకోళాలతో కూడుకొని ఉంటుంటే, అలా కాదండీ, నాటపాకి సంబంధించినఅంశంమీద మీఅభిప్రాయం రాయండి అని మర్యాదాపూర్వకంగానే విన్నవించుకున్నాను. మీరు మాత్రం మీపద్ధతిలోనే కొనసాగించేరు. ఆ తరవాత ఇతరుల పోస్టులదగ్గర మీవ్యాఖ్యలు అర్థవంతంగా ఉండడం, నాపోస్టులకి మాత్రమే మీఎకసక్కేలు అని గమనించేక, మీకు నాటపాలయందు ఏమంత మంచి అభిప్రాయం లేదని అనిపించింది.

పోతే, ఈ మందపత్రాలవిషయంలో అందరికీ చెప్తున్నదే మీకూ చెప్పేను. వీటివల్ల నాకు ఏమాత్రమూ ఆసక్తిలేని అనేక పత్రాలు వస్తాయి గుంపులో గోవిందా అంటూ. వాటిలో నిజంగా స్నేహం లేదు, అదొక వ్యాపారసరళి అని నా అభిప్రాయం. పైగా మీరు bbc అని గుర్తు పెట్టకపోతే, మిగతావారికి నా ఐడి దొరుకుతుంది. దాంతో మరిన్ని మందపత్రాలు వస్తాయి. నాకు అది ఇష్టం లేదు."

"అసలు మీబాధ ఏమిటో నాకు అర్థం కావడంలేదు. నాకు మీరంటేనూ మీరచనలంటేనూ ఇష్టం కనకనే నాలిస్టులో చేర్చుకున్నాను. అయినా చెప్పకతప్పదు. మీరు ఇలా మరిచిపోగలరని నేను అనుకోలేదు."

"అంటే మీరు నారెండు కథలు తవ్వి తీసినందుకు నేను మీకు ఆజన్మాంతం కృతజ్ఞురాలినై ఉండాలని మీఅభిప్రాయం అంటారా? కథలకి సంబంధించినంతవరకూ నేను కృతజ్ఞురాలినే అని ఏదైనా ప్రముఖపత్రికలో ప్రకటన తీసుకుని ప్రకటించమంటే అలాగే చేయగలను. దానికి అయే ఖర్చులు దయచేసి పంపగలరు."

"ఇప్పుడు మీవ్యంగ్యం వెటకారం చక్కగా తెలుస్తున్నాయి. కనీసం ఏదో వ్యాసం రాయవచ్చు కదా. మీకూ తెలుసు ఈనాడు ప్రపంచం అంతా పరస్పర సహకారాలమీదే నడుస్తోందని."

"మందలిస్టులోంచి నా ఐడీ తొలగించవలసిందిగా కోరుతున్నాను."

000

"ఏటంత రాద్ధాంతం. చెత్తబుట్టలోకి ఇసిరేస్తే పోయేదానికి."

"అది కాదు సంద్రాలూ, దాంతో ఆ జాబితాలో ఉన్నవాళ్ళంతా వాళ్ళకి ఇష్టం వచ్చినట్టు మరిన్ని చెత్తపత్రాలు మనమీదకి విసుర్తారు. టీబీ లక్షణాలూ, కీళ్లవాతానికి చేయవలసిన వ్యాయామాలూ, ఎక్కడో ఏడు సముద్రాల అవతల జరిగిన అపచారం, అలాటివి మనకి

తగలకుండా మనం పడవలసిన జాగ్రత్తలూ, తీసుకోవలసిన చర్యలు, మన బాధ్యతలూ, అంటూ. అదేంటో bcc అని పెడతారు కానీ నాకు వస్తూనే ఉంటాయి. కొన్ని మహా చిరాగ్గా ఉంటాయి. అందుకు చెప్పేను. అసలు ఈయన నాఐడీ తొలగించేస్తే సరిపోతుంది కదా.

అయినా నాకు తెలీకడుగుతాను. నాకథలు వెలుగులోకి తెచ్చినమాట నిజమే. అంతమాత్రంచేత ఆయన నన్ను కొనేసినట్టేనా? దరిమిలా ఆయనపద్ధతి నాకు నచ్చక, వదిలేసుకుంటే నేరం ఎలా అవుతుంది?"

"అదే మరి. అదేదో అంటరు గద నెట్వొర్కు (network) అని. ఆరు నిన్ను మెచ్చితె నీవు ఆరిని మెచ్చాల. అదీ ఈకాలం దరమం."

"Network కి ఓ పద్ధతి ఉంది. కొన్ని నియమాలున్నాయి. ఎక్కడా శాస్త్రం అని రాసిపెట్టలేదు కానీ రెండు వేపులా ఉండాలి అది. వారి అభిప్రాయాలలో సామరస్యం ఉండాలి. ఇరువురికి ఉపయోగపడేదిగా ఉండాలి. అలా అయితేనే రాణిస్తుంది. ఇద్దరూ వాళ్ళకృషికి సంబంధించిన విషయాలలో మంచిచెడ్డలు నిర్మొహమాటంగా నిక్కచ్చిగా మాటాడుకుంటే ఫలం. అంతే గానీ వట్టి మెచ్చుకోళ్లసంత అయితే నాకు గిట్టదు."

"ఏటో నీగోల. నాకదంతా తెలీదు గానీ వొక్కమాట సెప్తను ఇనుకో. వల్లో పడినాక సేప గిలగిల్లాడక తప్పదు. అదీ ఈపెపంచకం," అనేసి లేచి వెళ్ళిపోయింది సంద్రాలు.

నేను దిక్కులు చూస్తూ కూర్చుండిపోయేను, సంద్రాలు తెలిసి మాటాడిందో తెలీక మాటాడిందో తెలీక. నేనంటున్నది అది గాదు కదా.

(ఏప్రిల్ 11, 2020)

## “నన్ను నేను తెలుసుకోడానికి రాస్తున్నాను”

ఈ టపాకి నేపథ్యం – మరొక జాలసమూహంలో నేను రాసిన ఒక వాక్యం. నావాక్యం ఒక ఆంగ్లరచయిత్రి “నన్ను నేను తెలుసుకోడానికే నేను వ్రాస్తున్నాను” అని అన్నారని. దానిమీద నన్ను ఆవిషయంలో నాఅభిప్రాయం ఏమిటని అడిగేరు. వారికి సమాధానమే నా ఈ టపా.

కొంచెం ఆలోచించి చూస్తే అనేక కోణాలు ఉన్నాయనిపించింది. ఇధి నా పరిమిత అనుభవంలో నేను గ్రహించినది మాత్రమే. ఇది భారీఎత్తున పరిశోధనలు చేసి గ్రహించిన నిత్యసత్యం కాదు.

నాఅభిప్రాయాలు –

ఈ “నన్ను నేను తెలుసుకోడానికి” అన్నది ఒక పరిమిత పరిధిలో జరుగుతుందేమో కానీ పూర్తిగా నిజం అనలేం. ఇది ఆత్మజ్ఞానం – నన్ను నేను తెలుసుకోడం – అన్న అర్థంలో కాదు కదా. నా ఆలోచనలు, అభిప్రాయాలు స్పష్టం చేసుకోడానికి అనడం సబబు.

ప్రధానంగా రెండు కోణాలు ఉన్నాయి ఈ అవగాహనలో.

1. ఆ వాక్యం అభివ్యక్తీకరించడంలో రచయిత్రి లక్ష్యం ఏమిటి?

2. ఆవాక్యాన్ని పాఠకుడు ఎలా స్వీకరిస్తాడు?

మొదట ఆ మాట చెప్పిన రచయిత్రికోణం చూదాం. ఆరచయిత్రిపేరు నాకు సరిగా జ్ఞాపకం లేదు. Miles Franklin అని గుర్తు. ఆమె చేతనావస్థలో తనకోసమే వ్రాసుకోడం అన్నది బహిరంగం చేయడం ఒక ఎత్తు. తనని తాను అలా నమ్మించుకోడం ఒక ఎత్తు. ఈ రెండవదశలో అది ఆమెమనసులోనే ఉంటుంది డైరీలాగ. అది ఎవరికీ తెలీదు కనక దానిమీద మనం వ్యాఖ్యానించలేం.

అందుకు భిన్నంగా, బహిరంగంగా తాను తనకోసమే వ్రాస్తున్నట్టు ప్రకటించితే, అది చేతనావస్థలోనే జరిగినట్టు అనుకోవాలి. ఇతరులకి తెలియడంకోసమే కనీసం ఆ ప్రకటన చేసేరు. అలా అచ్చులో కానీ, ఉపన్యాసంలో కానీ ప్రకటిస్తే, ఏమి ఆశించి అలా ప్రకటించేరు అన్న ప్రశ్న వస్తుంది. ఇది మరో రెండు కోణాల్లో – వైయక్తికం, వస్తుగతంగా పరిశీలించాలి.

1. వైయక్తికం అయితే, సానుభూతికోసం రాసినరచన అవుతుంది. “నాకింత కష్టం వచ్చింద”ని తనకోణంలోనుండి మాత్రమే చెప్పడం జరుగుతుంది. తదనుగుణంగా పాఠకులస్పందనలన్నీ సానుభూతి, ఓదార్పు, పరిష్కారమార్గాలు, ఉచితసలహాలు ఇచ్చేవిగా ఉంటాయి.

ఇందులోనే మరొకకోణం – ఇది పాఠకులస్పందనలకు ప్రతిస్పందన కూడా కావచ్చు. "నేను మీకోసం రాయడంలేదు, ఇష్టమైతే చదవండి, లేకపోతే లేదు," అంటూ పాఠకలవిమర్శలకి (ముఖ్యంగా సమర్థనీయం కానీ విమర్శలకి జవాబుగా) అని ఉండవచ్చు.

2. వస్తుగతం అయితే అది వస్తువు ఆవిష్కరించేతీరులో వ్యక్తమవుతుంది. రచయిత్రి తనబాధని వివిధకోణాలలో పరిశీలించి సార్వజనీనం చేస్తుంది. తదనుగుణంగా పాఠకులు – 'అవును ఇలా జరిగి ఉంటుంది', 'జరగడం నేను చూసేను' అంటూ సాధారణీకరిస్తారు ఆ రచనని. అది సాంఘికస్పృహ గల రచన అనిపించుకుంటుంది.

పోతే, పాఠకులకోణం –

పాఠకుడు సాధారణంగా ఈ రచయిత్రి తనకోసం రాసుకుందా, నాకోసం రాసిందా అని ఆలోచిస్తూ చదవడు కానీ ఆమెఆలోచనలు ఇలా ఉంటాయి అని అనుకోవచ్చు. అది కూడా ఏదో ఒక్క రచన మాత్రమే చదివి కాదు. ఆమె రచనలు మరికొన్ని చదివేక ఇవే ఆలోచనలు మళ్లీ మళ్లీ కనిపిస్తుంటే, ఆమెమాట నిజమే కాబోలు అని అనుకోవచ్చు. ఆమేరకు "తనకోసమే" అన్నవాక్యాన్ని ఆ పరిమితిలో మాత్రమే స్వీకరించగలడు.

ఇంకొంచెం దూరం వెళ్లి, ఆమె ఆలా చెప్పడంలో ఒకరకమైన స్వోత్కర్ష ఉందని కూడా అనుకోవచ్చు. అది కృత్రిమంగా కూడా కనిపిస్తుంది.

"ఎందుకు రాస్తున్నాను" అన్నశీర్షికతో అనేక ప్రముఖ రచయితలు చెప్పే సమాధానం సంఘసంస్కరణకే అని. మంచిని పెంచాలి, చెడును గర్హించాలి అన్నది ఒక సాధారణసూత్రం. ఈనాడు ప్రముఖంగా సామాజికప్రయోజనం కథలకే పెద్దపీట వేస్తున్నారు. రచయితలు అవే రాస్తున్నారు.

దీనిమూలంగా జరుగుతున్న ఒక నష్టం ఆ సంరంభంలో పడి కథాప్రక్రియని ఒక సాహిత్యప్రక్రియ అన్నవిషయం మరిచిపోవడం. నూటికి 99పాళ్లు వ్యాఖ్యలూ విమర్శలూ కథాంశంమీదో కథలో ఒక సంఘటనమీదో సాగుతున్నాయి కానీ కథని ఒక సాహిత్యప్రక్రియగా ఎంచి ఇతర అంగాలు చర్చించడం మానేశారు.

ఆ ఊపులోనే కథలో పాత్రలని, సంఘటనలనీ విడిగా తీసి రచయిత వ్యక్తిగతజీవితంతో ముడిపెట్టిన అసంబద్ధ విమర్శలు కూడా వస్తున్నాయి. ఇలాటి వాతావరణంలో నన్ను ఎవరైనా అడిగితే కొంత చిరాకుతోనే "నేను మీకోసం రాయలేదు" అని అరవాలనే అనిపిస్తుంది నాకు.

కథని కథగా చూడాలి అన్న దృష్టి మనవిమర్శకులకీ, పండితులకూ లేనంతకాలం రచయిత మనస్ఫూర్తిగా నేను ఈకథ ఈకారణంగా రాసేను అని గట్టిగా చెప్పలేరేమో.

సూక్ష్మంగా చెప్పాలంటే, ప్రాథమికంగా మనం గుర్తుంచుకోవలసింది, లేదా గుర్తు తెచ్చుకోవలసింది మానవుడు సంఘజీవి. తనమనసులో భావాన్ని మరొకరితో పంచుకోడమే

రచన. పంచుకునే ఉద్దేశం లేకపోతే రాసి ప్రచురించడం జరగదు. అలా పంచుకోడంమూలంగా సామూహికంగా కొందరికైనా మేలు జరుగుతుందా లేదా అన్నది వేరే అంశం.

తనకి సాంత్వన చేకూరిందా అంటే చేకూరే ఉంటుందనే నానమ్మకం. ఆమేరకు తనని తాను తెలుసుకున్నట్టు అనుకోవచ్చేమో.

(10.10.2022)

## ఎందుకు రాయడం అంటే

రాయడం ఒక కళ

ఒక సుందర సురచిర స్వప్నం

సాహిత్య ప్రక్రియ

నిత్యానందం

ఆత్మానందం

దినచర్య

కాలక్షేపం లేదా ఒక పిచ్చి

ఊరికి ఉపకారం

సంఘసేవ కాకపోతే వ్యసనం

కదాచితుగా అవుసరం

ఏదైనా కావచ్చు కానీ

నిరర్థకం కాదు, నిష్ఫలం కాదు.

(ఆగస్ట్ 13, 2022)

000

## మూణ్ణాళ్ళ ముచ్చట

ఓ కవితా!

నీ ఊపిరి ఉండేదెన్నాళ్లో చెప్పనా?

**ఈమాట**లో రెణ్ణెళ్ళు

**కౌముది**లో నెల

**పత్రిక**లో వారం

**బ్లాగు**లో మూడ్రోజులు

**ఫేస్బుక్కు**లో మూణ్ణిముషాలు

కాకిలా కలకాలం కాదు

హంసలా ఆర్నెల్లు కాదు

ముచ్చటగా మూడే మూడు క్షణాలు!!

(జులై 20, 2013)

# సృజన

రాయి రాయంటూ ఎవరో పోరితే పుట్టేది కాదు.
ఎందుకు రాయవని సతాయిస్తే పలికేది కాదు నాకలం.
నిలువెత్తు ధనం పోస్తానన్నా వచ్చేది కాదు కథ.
పురస్కారాలకూ పట్టుశాలువలకు మురిసి వెలిసేది కాదు.
ఒకానొకనాడు
తూగుటుయ్యేలలు అమరిస్తేనూ,
నవమోహనాంగులు కప్పురవిడెములందిస్తేనూ
కవితామతల్లి దర్శనమిచ్చిందేమో కానీ
ఈనాడు సృజన కవిహృదయాన్ని
కదలించేసంఘటనతో పొడగట్టు అపురూపపు దివ్వె.
ఉదయకిరణస్పర్శతో విచ్చుకున్న కమలంలాటిది.
గుండె తడి అయినప్పుడో గట్టిగా గుండెకి ఏదో కొట్టుకున్నప్పుడో
జనియించు ప్రత్యేక జీవకణం.
నాహృదయం మాత్రమే నిర్దేశించగల ఆత్మప్రభ!

(సెప్టెంబరు 20, 2017)

# సాహిత్యంలో వాదాలప్రయోజనం!

**(ఎందుకొచ్చిన వాదాలు, నాదైవమా** అన్న శీర్షికతో ప్రచురితం)

నానవల **మార్పు**లో అసలు స్త్రీవాదం అన్నది ఎలా ఉద్భవించిందో సూక్ష్మంగా వివరించేను (పు. 133-137). మనదేశంలో సామాజిక, కౌటుంబికపరిస్థితులు కారణంగా, ఆవాదాన్ని యథాతథంగా దింపుకోడంవల్ల ఉపయోగం లేదని కూడా చెప్పేను. ఇది నాలభిప్రాయం.

మరోసారి సూక్ష్మంగా స్త్రీవాదం అంటే –

1. వాదాలు రాజకీయం. కథలు సాహిత్యం. రాజకీయప్రచారంకోసం రాసిన కథలు వేరే ఉంటాయి. ప్రచురణలో కనిపించిన ప్రతికథా రాజకీయం కాదు.

2. రాజకీయాలు సామాజికపరిధిలో సాగుతాయి. సాహిత్యం వైయక్తికం. ఎవరికి వారు చదివో వినో ఆస్వాదించేది.

అంటే, రాజకీయాలలో జరిగేది సామూహికంగా ఏదో ఒక చట్టంకోసం పని చేస్తాయి అనుకుందాం.  ఉదాహరణకి, బహుభార్యానిషేధం వచ్చింది ఏదో ఆందోళనమూలంగానే. కానీ అది ఎంతవరకూ ఆచరణలో కనిపిస్తోంది? ఈనాటికీ రచయితలూ, సంఘసేవకులూ, వీరనాయకులూ ఎంతమంది బహుభార్యాత్వం నెరపుతున్నారు? (ఆ చట్టంలో లోపాలు నా **విపర్యయం** కథలో చూడండి).

ఆచరణలో స్త్రీలు వివాహవ్యవస్థని ధిక్కరించడం అన్నది ఇప్పుడు కొత్తగా స్త్రీవాదంతోనే రాలేదు. నాచిన్నప్పుడే, నాలుగు తరాలకి ముందే చూసేను మనదేశంలో ఏదో ఒకకారణంగా సంసారాల్లో కల్లోలాలు వచ్చినప్పుడు స్త్రీలు పరిష్కారాలు చూసుకోడం – పుట్టింటివారు తీసుకొచ్చి ఇంట్లో పెట్టుకోడం, మరొకరితో సంబంధం పెట్టుకోడం, లేచిపోవడం, పారిపోవడం, ఏబావిలోనో దూకి ప్రాణాలు తీసుకోడం. (**మార్పు** కథలో పెద్దక్క వివరిస్తుంది.). స్త్రీవాదం వీటిని ఆమోదిస్తుంది అని నేను అనడంలేదు కానీ, స్త్రీవాదంపేరుతో ఇప్పటికీ ఇలా జరుగుతూనే ఉన్నాయి. స్త్రీలకి విద్య, ఆర్థికప్రతిపత్తి, ఓటుహక్కు వచ్చేయి కానీ వాస్తవంలో సుఖజీవనం సంప్రాప్తించింది అని చెప్పలేం.

ముఖ్యంగా కావలసింది మానసికవికాసం. అది కనిపించడంలేదు ఈ స్త్రీవాదంపేరుతో కబుర్లు చెప్పేవారిలో.  అసలు ఈవాదంపేరుతో ఒక కుహనాసంస్కృతి ఏర్పడిందని కూడా అనిపిస్తోంది. వారు మాటల్లో, ప్రవర్తనలో, రాతల్లో నిజమైన చైతన్యం, సంస్కృతి కనిపించవు. ఇది నాకు అనుభవం. నన్ను చూస్తే ఈ స్త్రీవాద రచయితలలో చాలామందికి "ఆయనే" (ఇది వారిప్రయోగమే)

గుర్తుకొస్తారు, భోజరాజు ముఖం చూస్తే, కవిత్వం పుట్టినట్టు -:). అంతే కానీ, నాసాహిత్యంగురించి మాట్లాడినవారు లేరు.

3. స్త్రీవాదం మూలతత్త్వం ఏమిటి? సమానత్వం కదా. సమానంగా చూడడం అంటే ఎదటివ్యక్తిని గౌరవించడం కావాలి. ఒకవ్యక్తిని కాదు అందరు వ్యక్తులని.

మరి ఈ స్త్రీవాదులు (అందరూను. లింగభేదం లేదు) స్త్రీలందరిని మనిషిగా గౌరవిస్తున్నారా? కథలు రాస్తారు, ఉపన్యాసాలు ఇస్తారు. కానీ నేను కనిపిస్తే, వారినోట వచ్చే మాటలన్నీ గాసిప్ మాత్రమే. రెండుతరవాలవెనకటివారు అలా మాట్లాడితే, (చూ. **శివుడాజ్ఞ** రెండవముగింపు కథమీద వచ్చిన వ్యాఖ్యలు), ఆ అత్తయ్యగారిమాటలని నిరసించేరు. అదే గాసిప్ ఈనాడు స్త్రీవాదులం అని చెప్పుకుంటున్న రచయితలు (ఆడా, మగా కూడా) మాట్లాడుతున్నారు.

4. చిత్తశుద్ధి ఒక ముఖ్యమైన విలువ. స్త్రీవాదమనే కాదు, ఏవాదంమీదా నాకు నమ్మకం లేదు. వాటిలో ఆర్భాటం ఎక్కువా, ఉపయోగం తక్కువ అనే నానమ్మకం.

నాకథలు, కవితలు స్త్రీవాదసభల్లోనూ, సంకలనాల్లోనూ, ఉపన్యాసాల్లోనూ, వ్యాసాల్లోనూ వాడుకుంటున్నారు నాతో చెప్పకుండా. అలా చేసినప్పుడు మిగతావారు నా చిత్తశుద్ధిని శంకించే అవకాశం ఉంది. నేను ఏవాదమూ ప్రచారం చేయడానికి రాయడం లేదు. నన్ను అడక్కుండా, అలా నన్నూ, నారచనలనూ చిత్రించేవారి చిత్తశుద్ధిని నేను శంకిస్తాను.

కథలో ఉండే అనేక ఆదరణీయమైన, గమనించవలసిని అంశాలను వాదాలు ఫిల్టర్ చేసి, కథని ఎముకలగూడు చేసేస్తాయి. చిత్తశుద్ధిగల స్త్రీవాదులు కూడా అది గమనించకపోవడం శోచనీయం.

నిద్రపోయినట్టు నటించేవారిని ఎవరూ లేపలేరు. నమోనమః

(ఏప్రిల్ 3, 2023)

## మునిపల్లె రాజుగారి కథాసంకలనం అనువాదంగురించి

ఈసరికి చాలామంది మరిచిపోయి ఉంటారు మునిపల్లె రాజుగారి **అస్తిత్వనదం ఆవలితీరాన** కథాసంకలనం నేను అనువదించేనని. చేసి 9 ఏళ్లు అవుతోంది.

నేను 2, 3సార్లు సాహిత్యఎకాడమీ బెంగుళూరు ఆఫీసువారిని అడిగేను ఎప్పుడు వేస్తారని. ఎప్పటికప్పుడు మరో రెండు నెలలన్నారు. అలా అని రెండేళ్లయింది.

ఇంతవరకూ ఏమి జరిగిందో అవలోకించండి.

మునిపల్లె రాజుగారి **అస్త్విత్వనదం ఆవలితీరాన**. నాఅనువాదం Beyond the Shores of the River Existentialism

2014లో సాహిత్య ఎకాడమీ రాజుగారి కథాసంకలనం అనువాదం చేయమని నన్ను అడిగేరు. నేను చేస్తానన్నతరవాత, రాజుగారు నాకు ఉత్తరం రాసేరు. తమకి 90లు దగ్గర పడుతున్నాయనీ, తాను activeగా ఉండగానే ఆపుస్తకం వస్తే బాగుంటుందనీ.



నేను రాత్రీ పగలూ పని చేసి, రెవ్యూలకి సమాధానాలు చెప్పుకుని, ఏప్రిల్ 2015నాటికి సాహిత్యఎకాడమీకి ఫైనల్ కాపీ అందజేసేను. అంటే 8 ఏళ్లయింది అది ప్రచురణకి సిద్ధమయి.

మీలో చాలమందికి తెలిసే ఉంటుంది రాజుగారికథలలో భాష. ఉదాహృత ఉపకథలూ, సంస్కృతశ్లోకాలు పుష్కలంగా ఉన్నాయి. చాలమంది స్నేహితులసహాయం తీసుకోవలసివచ్చింది. ఏల్చూరి మురళీధరరావుగారిని అడిగి కొన్ని సంస్కృతశ్లోకాలకి అర్థాలు తెలుసుకున్నాను. అలాగే

అబ్బరాజు మైథిలిగారూ, నూతక్కి రాఘవేంద్రరావుగారూ, ఇంకా అనేకమంది ముఖపుస్తక మిత్రులు సాయం చేసేరు ఈ అనువాదం పూర్తి చేయడానికి.

మునిపల్లె రాజుగారు 2018లో ఈ పుస్తకం చూడకుండానే స్వర్గస్థులయేరు.

గత నాలుగేళ్లలోనూ సాహిత్యఎకాడమీని రెండుసార్లు అడిగేను ఎప్పుడొస్తుందని. నాకు ఈ ఎకాడమీలో ఎవరు ఎవరో, ఈప్రచురణకి పైయక్తికంగా ఎవరు బాధ్యులో తెలీదు. సాహిత్యఎకాడమీ అనే ఇమెయిలు ఇస్తూ వస్తున్నాను. అడిగినప్రతిసారీ ఇదుగో రెండు నెలలలో వస్తుందన్నారు. అలా అని రెండేళ్లకి పైనే అయింది.

పదిరోజులక్రితం మెయిలిచ్చేను. "మీరు ప్రచురించేట్టు లేదు. నేనే ఇ-బుక్ చేసి ఆర్కైవ్.ఆర్గ్ లో పెడతాను. కనీసం రాజుగారి సంతతి, పాఠకులూ అయినా చూస్తారు," అని.

దానికి వెంటనే జవాబు వచ్చింది. జవాబు వచ్చింది డా. యస్. రాజ్ మోహన్ గారినుండి. వెనకటి ఆఫీసరు ఇంతవరకూ ప్రచురించలేదా అని ఆశ్చర్యం వెలిబుచ్చి, వెంటనే ప్రచురణకి కావలసిన టైపుసెటింగ్ లాటివి పూర్తి చేసి కేంద్ర సాహిత్యఎకాడమీకి వారంరోజులలో పంపేరు.

గత తొమ్మిదేళ్లు ఏ చర్యా తీసుకోకుండా నిద్రపోయిన ఉద్యోగి యస్.పి. మహాలింగేశ్వర అని నాకు అప్పుడు అర్థమయింది. It is unconscionable. Shameful.

ఇంగ్లీషు వికిపిడియాలో సాహిత్యఎకాడమీమీద వ్యాసంలో వారి కార్యక్రమాలలో అలసతలూ, అవకతవకలగురించి విపులంగానే రాసేరు. మహాలింగేశ్వరవంటివారి అలసులవల్ల సంస్థకి అప్రతిష్ఠ.

రాజ్ మోహన్ గారివంటి బాధ్యతాయుతవ్యక్తులవల్ల సంస్థకి ప్రతిష్ఠ రావాలి.

ప్రస్తుతం మునిపల్లె రాజుగారి సంకలనానికి నాఅనువాదం కేంద్రసాహిత్య ఎకాడమీవారి చేతుల్లో ఉంది. కనీసం ఈసారి వారు పూనుకుని ప్రచురిస్తారని ఆశిస్తున్నాను.

(11వతేదీన జరిగిన మొల్ల పురస్కారం సందర్భంలో అనువాదాలప్రసక్తి వచ్చినప్పుడు నావ్యాఖ్య ఇది. ఇక్కడ మామిత్రులకు విడియో చూసేతీరిక ఉండకపోవచ్చు. 2గం. అనుకున్నది 3గం. సాగింది. ఆవిడియోలో ఒకభాగం ఇది. మార్చి14, 2023)

**తా.క.: జూన్ 3, 2023 నాటికి పుస్తకం వెలుగులోకి వచ్చింది.**

శాఖాచంక్రమణం అయినా, మొల్ల సత్కారంసభ గురించి రెండు మాటలు చెప్తాను. ఆసభలో ఈ అనువాదంగురించి ప్రస్తావించేను. సభ అద్భుతంగా జరిగింది. నాకు తెలీని ఎన్నో విశేషాలు

తెలుసుకున్నాను నారచనలగురించి. రెండుగంటలసేపు అనుకున్న సభ 3గం. 4 ని. వరకూ సాగింది. వక్తలు ఇంకా చెప్పవలసినవి ఉన్నాయి కానీ కాలపరిమితిమూలంగా చెప్పలేకపోయేం అన్నారంటే మీరే ఊహించుకోవచ్చు ఎంత ఉత్సాహంగా వక్తలు పాల్గొన్నారో.

ఈ సభ ఇంతగా ఫలవంతం,కావడానికి ముఖ్యకారణం కల్పనా రెంటాల శ్రమ. సంకల్పించిన క్షణం నుండి వక్తలను ఆహ్వానించడం, సత్కారానికి చిహ్నాలుగా కుర్తా, ఫలకం, కాఫీకప్పుతో పాటు రాత్రి భోజనంవరకూ ఎంత శ్రద్ధా ప్లాను చేసిందో చూస్తే నాకు ఆశ్చర్యమూ ఆనందమూ కలిగేయి. ధన్యవాదాలు కల్పనా!

అలాగే వక్తలు నాకథలు వ్యాసాలు చదివి, సునిశితంగా పరిశీలించి, సోదాహరణంగా ప్రసంగించేరు. నిజానికి, చాలా ఆలస్యం అయిపోయిందని పబ్లిక్ ఆఫ్ చేసినతరవాత కూడా నలుగురు ఆగి మరో అరగంట చర్చించుకున్నాం. ఇంత పకడ్బందీగా నాసాహిత్యంమీద చర్చ అంటే నిజంగా సంపూర్ణంగా నారచనలమీదే చర్చ జరగడం నాజీవితంలో ఇదే మొదటిసారి. నాసాహిత్యానికి నిజమైన సత్కారం. వక్తలందరికీ ధన్యవాదాలు.

(మార్చి14, 2023)

# భయం లేదు (కథ)

విస్కాన్సిన్ లో శిశిరం నాకు చాలా ఇష్టమైన ఋతువు. మోకాళ్లలోతు మంచులో కూడా నేను నా నిత్యసంచారం మానలేదు.

ఒకరోజు అలా నడిచి వెళ్తుంటే, హాయ్ అని వినిపించి, అటు తిరిగి చూసేను. ఒక అమ్మాయి వీధి అటువేపునించి నావేపు వస్తోంది. దట్టమైన చలికోటూ, బూటుతో చిన్న ఎలుగుబంటిలా ఉంది. ఏడెనిమిదేళ్లుంటాయేమో. చేతిలో చిన్న నోట్ బుక్కూ, కలంతో నావేపు వస్తూ కనిపించింది.

నేను ఆగి చూస్తున్నాను.

ఆ అమ్మాయి బాగా దగ్గరకి వచ్చేక, నాకు ఆ చిన్నపుస్తకం అందించి, నాసంతకం అడిగింది.

నేను విస్తుపోయి, "ఎందుకు? ఏమైనా క్లాస్ ప్రోజెక్టా?" అనడిగేను. అమెరికా వచ్చేక తెలిసింది నాకు, వీళ్లు ఐదారేళ్లకే రిసెర్చి మొదలుపెడతారని.

లేదు, ఊరికే అంది, భుజాలెగరేసి!

నాకు అనేక ఆలోచనలు. తలెత్తి ఆ యింటివేపు చూసేను. ఇక్కడ రెండు ఆలోచనలు.

1. ఈదేశంలో పిల్లలకి పదే పదే చెప్తారు కొత్తవారిదగ్గరికి వెళ్ళొద్దని. ఆయింట్లోంచి ఎవరైనా ఈపిల్లమీద ఓ కన్నేసి ఉంచేరా?

2. రోజూ చూస్తుంటారు కనక, ఆ ఇంట్లో పెద్దవాళ్లకే నేనెవరన్న సందేహం కలిగి, నా అట్టుమట్టులు కనుక్కోడానికి ఈపిల్లని పంపేరా?

ఇంకో ఆలోచన – నేను యూనివర్సిటీలో తెలుగుపాఠాలు చెప్తున్నాను కనక, తను తెలుగు నేర్చుకోడానికి నేను పంతులమ్మగా పనికొస్తానా లేదా అని అంచనా కట్టడంకోసమేమోనని.

మరో ఆలోచన – నేను రచయితని కనక నాసంతకం తనదగ్గరుందని గొప్పగా చెప్పుకోడానికి పనికొస్తుంది అనేమో.

నవ్వకండి మరి. సరదాకి ఇలా అంటున్నాను కానీ ఆఅమ్మాయి జవాబే నాకు పరమానందం కలిగించింది.

"మంచు దట్టంగా ఉంది. జారిపడతావు, కార్లు కూడా చూసుకోవాలి, జాగ్రత్త," అన్నాను.

"నాకు భయం లేదు," అంది ఆ చిన్నారి, కళ్లు చిట్లించి కొంటెచూపులతో.

అదీ నాకు గొప్పగా అనిపించింది. కొత్తవారిదగ్గరికి వెళ్తున్నానన్న భయంలేదు, జారి పడతానన్న భయం లేదు. కారుకింద పడతానేమోనన్న భయం లేదు.

నాకు కనిపించలేదు కానీ ఆయింట్లో పెద్దలెవరో గమనిస్తూనే ఉండిఉంటారనుకున్నాను.

ఆ బాలామణికి భయం కాదు, జాగ్రత్త పడడం నేర్పేరు!!

ఈనాటి పిల్లలందరికీ జేజేలు.

(ఉపసంహారం – ఇందులో నాసంతకం అడగడం నిజంగా జరిగింది. ఎందుకన్నది ఇప్పటికీ నాకు తెలీదు.  మిగతాదంతా కల్పన. బహుశా నేను కోరుకునేది కూడానేమో. – మాలతి.)

(నవంబరు 15, 2022)

# ఆరోజులనించీ మళ్లీ తెచ్చుకోవలసినవి

ఔనౌను. ఆరోజులు మళ్లీ రావు.

కార్లు లేని రోజులు రావు. కంప్యూటర్లు లేని రోజులు రావు.

రంగుల టీవీ లేని రోజులు కూడా మళ్ళీ రావు.

రాగలవని అనుకోను కూడా. రావాలని కోరుకోను.

వస్తే బాగుండునంటూ విచారించను కూడా.

చరిత్ర పునరావృతం కాగలదన్న జనవాక్యం అన్ని పరిస్థితులలోనూ సర్వవేళలా నిజం కాదు.

కొన్ని సందర్భాలలో మాత్రమే కాగలదు.

అవే కష్టాలు – ఆకలి, దరిద్రం, క్షుధ- నిరంతరం పునః పునః అనుభవమవుతూనే ఉంటాయి.

అస్తమించిన సూర్యుడు మళ్ళీ పొద్దున్నే ఉదయించినట్టు.

వాటిని దాటుకునే పద్ధతి మాత్రం ఎల్లవేళలా అదే కాకపోవచ్చు.

దాహం వేస్తుంది కానీ మంచినీళ్ళో మజ్జిగో తాగరిప్పుడు. సోడాలు, కలర్ డ్రింకులూ కావాలి.

నేనింకా మంచినీళ్ళే తాగుతున్నాను కానీ ఎవరైనా ఇంటికొస్తే కాఫీనీళ్ళో టీనీళ్ళో ఇస్తాను.

వీధిచివర దుకాణానికి కూడా ఇప్పుడు నడవడం లేదు.

ఆ దూరాన్ని జయించడానికి ఓ బైకు, కారు ఏదో ఒక వాహనం కావాలి. ఈవిషయంలో వెనక్కి వెళ్ళడం జరగదు కాక జరగదు.

అయినా అనుకుంటాను, కొన్ని విలువలు మాత్రం సర్వకాలాలలోనూ అవే అని.

వాటిని పునరుద్ధరించుకోవచ్చు. పునరుద్ధరించుకోవాలని ఆశిస్తాను.

సాటిమనిషిని హీనంగా చూడడమే నాగరీకత అయితే ఆ నాగరీకత నాకొద్దు.

కష్టంలో ఉన్నవాడిని ఆదుకోకపోవడం నాగరీకత అయితే ఆ నాగరీకత నాకొద్దు.

నీతెలివి ప్రదర్శించుకోడానికి ఎదటివాడిని హేళన చేయడం నాగరీకత అయితే ఆ నాగరీకత నశించి, వెనకటిరోజులు రావాలనే కోరుకుంటాను.

రోజుకి 24 గంటలు గాడిద చాకిరీ చేస్తూ, జీవితంలో తేలిగ్గా సంప్రాప్తమయే ఆనందాలు అనుభవించడం అనాగరీకం అయితే ఆ అనాగరీకతనే నేను ఆహ్వానిస్తాను.

కాలరీలు కాల్చుకోడానికి పరుగులు తీస్తూ, పక్కనే ఉన్న మల్లెలనీ గులాబీలనీ చూసి ఆనందించగల వ్యవధి లేదంటే నాకు తప్పక విచారం కలుగుతుంది.

ఏళ్ళతరబడి ఒకఇంట్లో ఉంటూ పొరుగువాడి వాకిట ననలెత్తిన కొమ్మలను చూడలేదంటే నాకు విచారం కలుగుతుంది.

ఒకరినొకరు పలకరించుకునే ఇరుగూపొరుగూ, రెండు నిముషాలాగి అయాచితంగా కనిపించే చెట్టూ చేమా, ఉడుతా, పిట్టా, ఆకాశంలో మబ్బులు తీరిగ్గా చూచి ఆనందించగల సమయాలు మళ్ళీ మళ్ళీ రావాలనే కోరుకుంటాను.

వందలూ వేలూ ఖర్చు పెట్టి దేశదేశాలు తిరుగుతూ "సహజప్రకృతి"నీ బొటానికల్ గార్డెనులనీ చూసి ఆనందించి ఫొటోలు దిగేవారు ఇంటిముందు మొక్కలని కూడా గమనించే సమయం కనుక్కునే రోజు రావాలని కోరుకుంటాను.

000

హర్షానికీ ఆమోదానికి ధరలు కట్టే నాగరీకత నాశనమవడమే ఉచితం.

ఒదిగి ఒదిగి సావకాశంగా సాగిపోయే తాబేలులా కొన్నిరోజులయినా దొరకడమే సముచితం..

000

వినయం బలహీనత కాదు

మంచితనం చేతకానితనం కాదు

– అని అంగీకరించి, ఆమోదించి, ఆదరించగలరోజులు మళ్ళీ రావాలి. రావచ్చు. రావాలనే ఆశిస్తాను.

000

ఇదే విషయంమీద కథలపరంగా నా మరో టపా **నాస్టాల్జియాయే నేరమౌనా?**

ప్రేమే నేరమౌనా అని ఓపాత సినిమాపాట లేదూ, అలాగన్నమాట.

మనం వెనక్కి తిరిగి చూసుకోకూడదా? వెనక్కి చూస్తే అది తిరోగమనవాదమా?

చివరికి మిగిలేది జ్ఞాపకాలే కాదా?

ఏవి తల్లీ నిరుడు కురిసిన హిమసమూహములు?

గతమెంతొ మేలు వచ్చుకాలముకంటెన్ ...

కళ్ళెవరికీ వెనక్కి ఉండవు. ఎందుకూ అంటే మనం చూసుకోవలసింది వెనక్కి కాదు ముందుకి అని.

అలనాటి నన్నయ దగ్గరినుండీ కవులూ, రచయితలూ అందరూ సాహిత్యంలో నవ్యత ప్రవేశపెట్టడానికే ప్రయత్నిస్తున్నారు అంటారు నోరి నరసింహశాస్త్రిగారు. అంటే ఏమిటీ, వెనక్కి కాదు, ముందుకి చూడమనే కదా.

నామటుకు నేను కూడా యథాశక్తి ఓ పరక ఆ అగ్నిలో వేసినట్టే ఉంది నిన్నటి కవిత చూస్తే. హుంమ్. నిజంగా నేను అలా అనుకుంటూ మొదలెట్టలేదండీ. అదే అలా తయారయింది, అయ్యవారిని చేయబోతే, కోతి కాదనుకోండి, మరేదో తయారయింది..

మ్.మ్. నిజానికి మావాకిట్లో వేపచెట్టూ లేదు, కర్రియావూ, లేగదూడా అసలే లేవు. హీహీ. అన్నీ కల్పనలే. .. స్వకపోలే... కూడా కాదు, ఖర్మ... పాతకథల్లో ఎక్కడో ఎప్పుడో చదివిన రెండు ముక్కలూ పైకొచ్చేయి, అంతే.

అన్నట్టు కథలంటే జ్ఞాపకం వస్తోంది. ఈమధ్య కథల్లో ఈ నాస్టాల్జియా ఎక్కువయిపోయి, ఆరోజులు రావంటూ విడిచిన నిట్టూర్పులు ఆవిరై, మొత్తం ఎట్మోస్ఫియరంతా పొల్యూటయిపోయి, అవే టోర్నెడోలకి కొంతయినా కారణం అయిపోతున్నాయని అభిజ్ఞవర్గాల అభిప్రాయంట. కనీసం కొన్ని విమర్శలు చూస్తే అలా అనిపిస్తోంది మరి.

నిజానికి నాకసలయినా వీళ్ళందర్నీ నిలేసి అడగాలనిపిస్తోంది. ఏమనంటే, "అయితే ఏం?" అని. ఎందుకని అడగండి చెప్తాను.

మీరు ఎప్పుడయినా మీ చిన్నప్పటి ఫొటోలు తీసి చూసుకున్నారా? "నా చిన్నప్పుడు మాఅమ్మ పెరుగూ అన్నం ముద్దలు కలిపి పెట్టేది". లేకపోతే, మీ తెలుగు మాష్టారు, లేక సైన్సు మాష్టారు "నువ్వు చాలా తెలివైనదానివి, లేక –వాడివి, గొప్పవాడివవుతావు" అని చెప్పలేదూ? అవి మళ్ళీ మీరెప్పుడూ తలుచుకుని మురిసిపోలేదూ? – వీటన్నటికీ "లేదు", "లేదు", "లేదు" అని మీరంటే ఇంక నేను చెప్పేదేమీ లేదు. మరో బ్లాగుకెళ్ళిపొండి.

మీరింకా వింటానంటే నేను చెప్పేది ఇలా ఉంటుంది —

నా పాత కవిత, <u>లోకాలతలుపులు తెరుచుకున్నవేళ</u>"లో గతకాలపు సంగతులున్నాయి. బోలెడు వ్యాఖ్యలకి నోచుకున్న టపా అది. ఎందుకంటే ఆ కవితలో "ఆనాటి" మాటలే. అవే చాలామందికి తమ తమ ఆనాటిసంగతులు గుర్తుకి తెచ్చేయి. మనసుల్ని తడి చేసి ఉండాలి. నిజానికి నాకు ఆ కర్రిఆవూ, లేగదూడా అన్నమాటలు చప్పున స్ఫురించలేదు. చాలా చాలా ఆలోచించవలసివచ్చింది.

మరో విషయం. ఇది నేను మొదలు పెట్టినప్పుడు నాఆలోచన వేరు. "అయ్యో ఆనాటి ఆ విషయసంచయం ఇప్పుడు లేదే" అని కాదు. ఆరోజు నేను వరండాలో కూర్చుని ఉదయిస్తున్న సూర్యుని, ఆకాశంలో మారుతున్న రంగుల్నీ చూస్తుంటే అనిపించింది "అబ్బ ఎంత బాగుంది" అని. అది మాత్రమే రాయాలనుకున్నాను. ఆకాశం విశాలం, పృథ్వి విపులం … ఇలా అనుకుంటుంటే తోచింది మనిషికీ మనిషికీ మధ్య మాత్రం ఎడం పెరిగిపోతోంది అని.

గాస్ స్టేషనుకెళ్తే, self-serve, కూరలదుకాణంలో self-serve, బాంకులో drive in, Fast food దగ్గర రెండుగజాలదూరంనించీ మైకులో మాటాడాలి. ఫోన్ చేస్తే automated జవాబులు, ఆ

జవాబుల్లో మీకు కావలసిన సమాచారం దొరుకుతుంది అంటూ వస్తుంది. నూటికి తొంభైవంతులు మనకి కావలసిన జవాబు ఉండదు అందులో. ఈ automation వెనక ఊపిరున్న నిజమనిషిని వెతికి పట్టుకోడం ఓ పెద్ద కళ. IQ పైస్థాయిలో ఉన్నవారికే సాధ్యం. ఇవన్నీ మన సౌలభ్యంకోసమే అంటారు సాంకేతిక నిపుణులూ, ఆధునిక నరవరులూను.

నిజానికి నేను కూడా చాలామటుకు వీటిమీదే ఆధారపడతాను. ఎంచేతంటే, ఒకవేళ మనిషి దొరికినా వాళ్ళు నావేపు చూసిన చూపు చూస్తే, "ఆమాత్రం తెలీదూ నీకు?" అంటున్నట్టుంటుంది.

ఇంతకుముందు నేను మరో టపా రాసేను మాప్రాంతాల్లో ఆతిథ్యంగురించి. దానికి కూడా స్పందన బాగా వచ్చింది. చాలామందే బ్లాగులోనూ, ప్రత్యక్షంగా నాతోనూ తమకి కూడా అలాటి సుహృద్భావంతో కూడిన సహాయాలు అందేయని చెప్పేరు. ఇక్కడ నాప్రశ్న మనం ఇది ప్రత్యేకంగా చెప్పుకోవలసిన అవుసరం ఎందుకు వచ్చింది? అని. ఏదైనా మనం ఎప్పుడు చెప్పుకుంటాం? మనిషికి మనిషి సాయం చెయ్యడం అపురూపం ఎందుకయింది? ఎలా? ఎప్పుడు?

నిజానికి మనిషికి మనిషి సాయం ఒక మానవీయ విలువ కదా. గణవిభజన జరిగిన నాటినుండీ ఒకరికొకరు సాయం చేసుకోడం జరుగుతూనే వచ్చింది. మరి ఇప్పుడు అది ఆశ్చర్యంగా చెప్పుకోవలసిన పరిస్థితి ఎలా ఏర్పడింది?

ఎంతసేపూ "మాయింటికొస్తే నాకేం తెస్తావు?" "మీయింటికొస్తే నాకేమిస్తావు?" అనే రూలు ఎప్పుడు, ఎలా అమలులోకి వచ్చింది?

ఒక్కమాటలో నేను అడుగుతున్నది "లోకాలతలుపులు తెరుచుకున్నవేళ" అంటే దేశాల ఎల్లలు దాటి ఒకరినొకరం పలకరించుకోగలుగుతున్నాం కానీ మనిషికీ మనిషికీ ఎడం ఎక్కువయిపోతోంది. ఎంచేత అని? నిజానికీ ప్రపంచం కుంచించుకుపోడానికీ, మనసులు కుంచిచుకుపోడానికీ సంబంధం లేదు. ఉండకూడదు. సాటివాడికి సాయం పడడం అన్నది కూడా విస్తృతం ఎందుకు కాకూడదూ అనీ నాబాధ. అందుకే వెనక్కి తిరిగి చూసుకోడంలో కూడా తప్పు లేదు అని. తిరిగి చూసుకుని, మనం ఉండవలసింది అలా అని మనకి మనం చెప్పుకోడంలో తప్పు లేదు.

వెనకటిరోజుల్లో సంగతులు తలుచుకుని, ఆ క్షణాల్లో మనసు ఎలా పరవశించిందో ఈనాటి జీవితాన్ని తలుచుకుని అలా పరవశించగలగాలి. అలా కావాలంటే, మనిషికీ మనిషికీ మధ్య దూరం తగ్గాలి కానీ పెరగకూడదు. అదీ నేను చెప్పదలుచుకున్నది.

నాకీ చింత మొదలవడానికి కారణం – నోరి నరసింహశాస్త్రిగారి వ్యాసాలు. నన్నయ మొదలుకొని కవులు మహాభారతంలాటి కావ్యాలు రాయడం ప్రజలలో ధార్మికబుద్ధి

క్షీణించిపోతున్నప్పుడు, జాతిచరిత్ర గుర్తు చేసి, జాతిపౌరుషం, ధర్మం పునరుజ్జీవింపచేయడానికి అని రాసేరు.

000

(మొదటి ప్రచురణ ఏప్రిల్ 28, 2011. పునఃప్రచురణ ఆగస్ట్ 4, 2018)

## అమ్రికా టుర్మ్రరికా

ఈమధ్య అమెరికాలో పసుపు వాడకంగురించి ప్రబోధలు ఎక్కువయిపోయేయి. ఇదివరకు కూడా ఉందేమో నాకు తెలీదు. నేనిప్పుడే గమనించేను. మొదటిసారి మోకాలు నొప్పి అని డాక్టరు దగ్గరికి వెళ్తే, పసుపుగుణం తెలిసింది. ఆ డాక్టరుగారు కొనమన్న పసుపుమందు ధర మన దేశీదుకాణాల్లో దొరికే పసుపుకి పదింతలుంది. మనవాళ్లలా ప్లాస్టిక్ సంచులలో కాక కనులకు విందైన సీసాలలో అందించడం అధిక సౌకర్యం. ఇంకా ఏవో ఆరోగ్యకరగుణాలు కూడా ఉన్నాయిట ఆ సుందరసీసాలలో.

ఇంతకీ అసలు కత ఏమిటంటే –

నేనీ ఊరొచ్చి ఏడేళ్లయింది. ప్రతిరోజు ఆ వీధులే తిరుగుతున్నాను. ప్రతిరోజూ నాదారిలో ఒకావిడ కనిపిస్తారు. లటీనో కావచ్చు.

సాధారణంగా నాకొక టైమంటూ లేదు. పొద్దున్న 8-12 మధ్య లోపున ఎప్పుడు తోస్తే అప్పుడు బయల్దేరుతాను. ఒక దిక్కంటూ లేదు. వీధిలో పడ్డాక, ఉత్తరం, దక్షిణం, తూర్పు, పడమర ఎటు తోస్తే అటు వెళ్తాను. ఏ వేళలో ఎటు వెళ్లినా ఆవిడ ఎదురవడమే విశేషం. ఏవో గ్రహాలు మా కార్యక్రమం నిర్ణయించి మమ్మల్ని నడిపిస్తున్నట్టు. అదీ నాకు వింత.

రెండో వింత సాధారణంగా ఇక్కడ నాలుగుసార్లు చూస్తే, అసలు రెండోసారి అయినా, హలో అంటూ పలకరిస్తారు. కొందరు బాగున్నావా అంటారు. ఇంకా కొందరు ఎక్కడున్నావు, ఏంచేస్తున్నావు అని అడుగుతారు. నాకేశసౌందర్యం మెచ్చుకున్నవారు కూడా లేకపోలేదు.

ఈవిడ మాత్రం ఎప్పుడూ పలకరించలేదు. మరీ ఒకే sidewalkమీద నడుస్తూ ఎదురొస్తే, నేనే వినిపించీ వినిపించకుండా హలో అంటాను.

ఆవిడా అలాగే మందరస్వరంలో ఏదో చిన్నశబ్దం చేసి దాటుకుపోతుంది.

ఇప్పుడు అసలు కథకొస్తాను.

ఆమధ్య, రెండు వారాలయినట్టుంది, ఒకరోజు చేతికర్ర పుచ్చుకు బయల్దేరేను. ఆరోజు ఆవిడతో పాటు మరొకాయన ఉన్నారు. ఆయన అప్పుడప్పుడు కనిపిస్తారు, ఆవిడలా రోజు కాదు. కానీ కనిపించినప్పుడు తప్పనిసరిగా నన్ను పలకరిస్తారు.

ఆరోజు కూడా పలకరించి, "ఈమధ్య కనిపించడంలేదేం?" అనడిగేరు.

కాలునొప్పిమూలంగా అట్టే తిరగడంలేదని చెప్పేను.

ఆ పక్కనున్న ఆవిడ, అదే ఈకథలో ప్రధానపాత్ర, We wish you all the best అంది.

నాకు ఆశ్చర్యం. సరే అని ధన్యవాదాలు చెప్పి ముందుకి సాగిపోయేను.

మళ్ళీ నిన్న కనిపించిందావిడ.

నన్ను దాటుకు పోటోతూ, చటుక్కున ఆగి, వెనుదిరిగి ఎలా ఉన్నావు అని అడిగింది.

నేను రవంత విస్మయము చెందినదానినై, బాగానే ఉన్నాను అన్నాను.

అప్పుడండీ ఆవిడ మొదలుపెట్టి ఆగకుండా పది నిముషాలు మాటాడింది.

తనకి arthritis అనీ, రోజు నడుస్తాననీ, నడవడం మంచిదనీ, ఎక్కువ చేయకూడదు కానీ ....

ఇలా కొంతసేపయేక, ముక్తాయింపుగా, "పసుపు. పసుపు వాడాలి. ఒంటికి చాలా మంచిది. అలాగే అల్లం కూడా" అని సలహా చెప్పింది.

అంచేత నేనిప్పుడు పసుపు వాడకం పెంచేను. ఉడుకుతున్న బియ్యంలో కూడా అరచెంచాడు పసుపు వేసేస్తున్నాను, చేదా ఏమిటి, పులిహోరలో వేసుకోడంలేదా అని నాకు నేనే నచ్చచెప్పుకుని.

ఆలోచిస్తే ఆవిడ నన్ను ఇంతకుముందు పలకరించకపోవడానికీ, ఇప్పుడు పలకరించడానికీ కూడా కారణం అర్థం అయింది. నాకు కాలునొప్పి అని తెలిసేక, నేను కూడా ఆవిడలాటి మనిషినే అని గుర్తించింది అన్నమాట.

ఈ మనిషి కూడా నాలాగే బాధ పడుతోంది అనుకుంటే ఆ ఆనందమే వేరు కదా. ఏ అరమరికలూ లేకుండా మాటాడడానికీ కారణాలు తెలునొచ్చేయి నాకు.

అదీ కథ.

(నవంబరు 18, 2020)

# నసాంకేతికం మరోసారి

నా నసాంతిక విద్య ఎలా మొదలయిందో, ఈ విద్యలో ఎంత ప్రావీణ్యం ఎలో సంపాదించేనో 2008లో ఒక టపా రాసేను. (చూ. **ఎన్నెమ్మకతలు సం. 1**). అది ప్రాథమిక విద్య అనుకుంటే ఇది పైస్థాయి అన్నమాట.

చెప్పేను కదా customer supportని పిలిస్తే, "కంప్యూటరు పెట్టెలోంచి తీసేవా?" దగ్గర మొదలు పెట్టి, "electric cord కంప్యూటరుకి తగిలించేవా?", "రెండో కొస గోడమీద outletకి తగిలించేవా?" అంటూ బ్రహ్మ నారదుడికి బోధించినచోట ఎత్తుకుంటాడు. ఆ మెట్లన్నీ ఎక్కడం అయిపోయిందని చెప్పి, ఆక్షణంలో నేను ఎక్కడివరకూ వచ్చేనో చెప్తుంటే పాపం ఆ క.ప్ర. (customer service ప్రతినిధి) మౌనంగా పూర్తిగా వింటాడు. అందుకు సందేహం లేదు. అది వాళ్ళ కంపెనీ పాలసీ అని కూడా చెప్తాడు కొండొకచో. నేను చెప్పడం పూర్తయిందని నమ్మకం కుదిరేక, నాకంత కష్టం కలిగినందుకు సానుభూతి వెలిబుచ్చి, నా ఓరిమిని కొనియాడి, ఆ తరవాత కంప్యూటరు పెట్టెలోంచి తియ్యి అంటూ మళ్ళీ మొదటికొస్తాడు.

ఇంతకీ అసలు నాకొచ్చిన కష్టాలేమిటో, వాటిని పరిష్కరించుకోడానికేం చేసేనో చెప్తాను. అది రెండు స్థానాలలో – జాలంలోనూ, ముఖపుస్తకంలోనూ – జరగడంచేతనూ, వాటిని నాకు నేనే పరిష్కరించుకోడంచేతనూ నేను నా సాంకేతిక విద్యలో రెండోపాదం ప్రవేశించేను అనే నానమ్మకం.

ఓం ప్రథమంగా తెలుసుకోవలసింది ఫోనులో పిలిస్తే పైన చెప్పిన తంతు కానీ చాట్, ఇమెయిలయితే కొన్ని మెట్లు దాటేయవచ్చు.

జాలకష్టాలు. ప్రత్యేకించి ఇమెయిలు చిక్కు -

నేను నెలరోజులక్రితం ఇతర మాధ్యమాలలో అంటే ఇంగ్లీషు పత్రికలలో చర్చలలో ఓ వేలు పెడదాం అని సరదా పుట్టి మరో తెరపేరుతో ఓ ఐడి పెట్టుకున్నాను hotmail లో. దాంతో వచ్చింది తంటా. password తప్పు, నీ ఖాతా తొలగించేం, అనీ ఫలానా చోటికి వెళ్ళి పునరుద్ధరించుకోమనీ తాఖీదు వచ్చింది. సరే ఆ పేజీకి తరలివెళ్లి తొంగి చూస్తే, అది నిజ మనిషి కాదు, అగోచర సహాయకారి (virtual). సరే నా సొద చెప్పుకుంటే, పని చేస్తున్నట్టే కనిపించింది. కానీ నీ సెల్ నెంబరియ్యి, అక్కడికో కోడు పంపుతాం అంది. అదుగో అక్కడే వచ్చింది తంటా. ఈ డెవలపర్లూ, ప్రోగ్రామరులూ గట్టిగా నమ్మే విషయాల్లో ఒకటి – ప్రతి మనిషికీ సెల్లులు, లాప్టాపూ, ఐపాడూ, టాబ్లెట్టూ వంటివి అన్నీ ఉంటాయని. నాలా ఓదో ఒక్క డొక్కుతో పని జరుపుకునే నిర్భాగ్యులు బోల్డుమంది ఉంటారన్నది వారి ఊహకైనా అందని విషయం. వాళ్ళ పద్ధతి చూస్తుంటే నాలాటివారికి "అక్కడ స్థానం లేద"ని బోర్డు కట్టుకోడమే తరువాయి అనిపిస్తుంది.

నాకు అమిత తంటా ఎప్పుడు కలిగిందంటే, Microsoft email account తెరిచేక, విండోస్ ప్రవేశించడానికి సంకేతచిహ్నం అడిగితే ఆ ఇమెయిల్ సంకేతచిహ్నం ఇచ్చేను. నేను వేరే అవుసరంకోసం సృష్టించుకున్న తెరపేరూ, ఆ సంకేతచిహ్నం జీడిమరకలా స్థిరమయిపోయింది. అది నేను చాలా ఆలస్యంగా గ్రహించేనని వేరే చెప్పక్కర్లేదు కదా.

"సెల్ నెంబరు లేకపోతే ఫోన్నంబరియి, మేం ఫోను చేస్తాం" అనొచ్చు కదా. అదీ లేదు. నేనే పిలవడానికి కూడా లేదు.

అలా కొంతకాలం కుస్తీ పట్లయేక, కాస్త మంచీ మర్యాదా తెలిసినవాడయితే "నేనింకేం చెయ్యలేను. ఇది నాjob descriptionలో లేదు. Microsoft వాళ్ల ఫోన్నంబరుందా, ఉంటే ఆ నెంబరు పిలువు అని చెప్పి, ఇంకా తరవాతేం జరిగిందో తనకి చెప్పమని కూడా చెప్పి శలవు తీసుకున్నాడు.

అప్రస్తుతమే కానీ నాకు specialitiesతో కూడా చిక్కుగానే ఉందని చెప్పకతప్పదు. పూస కొడతాను కానీ లడ్డూ చెయ్యను, మోచేయి చికిత్స చేస్తాను కానీ మణికట్టు చెయ్యను అంటూ మొత్తం పనినో శరీరాన్నో ముక్కలు ముక్కలు చేసేస్తున్నారు. అక్కడికి మోచేతికీ మణికట్టుకీ సంబంధం లేదన్నట్టు. ఇది నిజంగా నాకు అనుభవైకవేద్యం.

ఇంతకీ తరవాతేం జరిగిందంటే, మళ్లీ విండోస్ ప్రవేశించబోతే నా సంకేతం అడగడం, నేనిచ్చింది కాదనడం అయింది. ఇదేదో ఏలిన్నాటి శనిలా ఉందనిపించిందంటే నమ్మాలి మీరు. నేను సరిగ్గానే టైపు చేసేను. అది మాత్రం మళ్ళీ చెప్పమంది. నాలుగు చుట్లయేక నీకు గుర్తులేకపోతే మార్చుకోవచ్చు, ఇదుగో ఈ లింకు తెరిచి మార్చుకో అని ఓ టోడి సలహా తగలేసింది నీలితెరమీద. అక్కడా నాకు ఒళ్ళు మండింది. తెరుచుకోని తలుపుదగ్గర పని చేయని లింకు ఇస్తే ఏం లాభం? విండోస్ తెరుచుకుంటేనే కదా ఆలింకులోకి ప్రవేశం?!

అప్పుడన్నమాట ఇట్నుంచి అటు నేనే ఆ ప్రతినిధికి పాఠం పెట్టేను గట్టిగా, "అసలు తెర తీయకపోతే జాలంలోకి ఎలా వెళ్తాను, నాసంకేతం ఎలా మార్చుకుంటాను?" అని. ఎదుట మనిషి కాదు కదా. రెండు రోజులు ఇమెయిలూ లేదు ఏ మెయిలూ లేదు. కానీ విశేషం ఏమిటంటే ఆ పనికిమాలిన సలహా మాత్రం కనిపించడం మానేసింది. అది నేను సాధించిన మొదటి విజయం. ఆ తరవాత మళ్ళీ తెర తెరుచుకోడం జరిగింది. ఎలా అంటే నాకు తెలీదు. కానీ మళ్ళీ మూత పడకుండా హడావుడిగా మరో తెరపేరుతో మరో ఖాతా పెట్టేను hotmail కాదు. outlook ఖాతా. నిజానికి ఈ రెండూ Microsoft వాళ్ళవే కనక, ఈసారి విండోస్ లాగిన్ కష్టం తీరిపోయింది.

ఆ ఊపులోనే Microsoft login కాకుండా మరో వసతి కూడా ఉందని కనిపెట్టేను. అది login on local machine. ఇక్కడ మనం ఏ సంకేతమూ ఇవ్వకపోతే, మొత్తం సంకేతచిహ్నం గోల వదిలిపోతుంది.

హెచ్చరిక. ఆహా మాలతిలాప్టాపులో సంకేతచిహ్నం రక్షణ లేదు, అంటే ఆ లాప్టాపు తస్కరించేస్తే ఆవిడరాతలన్నీ తస్కరించేయవచ్చు అని కాపీరాయుళ్ళెవరేనా అనుకుంటే పప్పులో కాలేసినట్టే. నారాతలన్నీ బ్లాగులోనో, ముఖపుస్తకంలోనో బాహాటంగా ఎల్లరకూ అందుబాటులో ఉన్నాయి. నా లాపుటాపులో అంతకు మించి ఏమీ లేవు. మా అమ్మ అన్నట్టు తస్కరులకు దొరికేది రాగి తీగెలూ, ప్లాస్టిక్ పెచ్చులూ మాత్రమే.

ఇంక ముఖపుస్తకం కత.

సెప్టెంబరులో యం.యస్ సుబ్బలక్ష్మిగారి శతజయంతి సందర్భంలో United Nations విడుదల చేసిన స్టాంపు నా statusమీద పెడితే, ఆ స్టాంపుమీద నాపేరు ప్రముఖంగా కనిపించింది, ఆవిడబొమ్మ నాదే అయినట్టు. లేదా, ఆ బొమ్మలో ఉన్నావిడ పేరు నిడదవోలు మాలతి అయినట్టు. అది తొలగించే ప్రయత్నంలో పొడి అక్షరాలు మా.ని. అని పెడితే తప్పుకుంటాయేమో అని చూసేను. కానీ పని చెయ్యలేదు సరి కదా మా.ని. అన్న పొడి అక్షరాలు కూడా అందంగా లేవు. ఏదో మానీయ్ అన్నట్టుంది. సరే బాగులేదు మళ్ళీ వెనక్కి మార్చేద్దాం అనుకుని ప్రయత్నించేను. ఆ క్షణంలో నేను ఒక ప్రయోగం చేసి చూస్తున్నాననే అనుకున్నాను. కానీ ముఖపుస్తకంవారు వెంటనే "నీపేరు మా.ని, 60 రోజులవరకూ మార్చడానికి వీల్లేదు" అన్నారు. నిజానికి అది నాకు నచ్చలేదు. అక్కడ నామిత్రులకీ నచ్చలేదు. సరే, ఏం చేస్తాను, అడిగినవారందరికీ జవాబులు చెప్పుకుంటూ 60 రోజులూ అందరం భరించేం.

60వ రోజున తెల్లారగట్ల లేచి గబగబ దంతధావనం, కాఫ్యాది నిత్యాలు ముగించుకుని, చీకట్లోనే ముఖపుస్తకం తెరిచేను పేరు మార్చడానికి. నేను సరిగ్గానే టైపు చేసేను కానీ ఇంటిపేరు నడదవోలు అని వచ్చింది. అయ్యో అనుకుంటూ మళ్ళీ తప్పు దిద్దుకోబోతే, మళ్ళీ అదే జవాబు. "నీపేరు నడదవోలు మాలతి, అది మార్చాలంటే మళ్ళీ మరో 60 రోజులు తపస్సు చేయాలి" అని. ఈలోపున మిత్రులు ఎందుకు నడదవోలు అని మార్చుకున్నారు అని అడగడం మొదలు పెట్టేరు. కనీసం కొందరైనా ఈవిడకి పేరు పిచ్చిలా ఉంది అని అనుకునే ఉంటారని నా అనుమానం. నిజంగా నాకు ఆశ్చర్యం వేసింది కూడాను పేరు ఇంత పరీక్షగా చూసేవాళ్ళున్నారా అని. కొంత మురిసిపోయేను కూడా.

ఇంతలో మరో విశేషం జరిగింది. ఒక మిత్రుడు కానివారి వ్యాఖ్య పెట్టేరు. వ్యాఖ్యలో దోషం లేదు కానీ అదెలా సాధ్యం అయిందనే నాకు తికమక అయింది. నామిత్రులు కానివారికి చదివే వసతే కానీ వ్యాఖ్యానించే వసతి లేదు కనక నాకు సందేహం కలిగింది hack చేసేరేమోనని.

ప్రతీ చర్యకీ ప్రతిచర్య ఉన్నట్టే, hack అయితే సంకేతచిహ్నం మార్చుకోమంటారు. అలా చెయ్యడానికి settings ప్రవేశించేను. అక్కడ report problem నొక్కితే, కనిపించిన మెను చూసి తెల్లబోయేను. నావెనకటి రెండు పేర్లూ కలిపి మొత్తం మూడు పేర్లు – నడదవోలు మాలతి, మా.ని.,

నిడదవోలు మాలతి – కనిపించేయి. ఆహా పండె నానోములు అనుకుంటూ నా నిజ నామధేయం నిడదవోలు మాలతి మీద నొక్కేను.

మళ్లీ ఇక్కడ మరొక సారి గుర్తు చేస్తున్నాను. పైన విండోస్ ప్రవేశంలాగే ఇక్కడ కూడా అనిపించింది నాకు. ఎందుకంటే, నేను నా ఖాతా హాకయినట్టుంది అని ఎప్పుడు చెప్పేనో ఆ సమయంలో ఉన్న పేరే కదా లెక్కలోకి రావాలి. వెనకటిపేర్లమీద ఇప్పుడు hack చేయడం సాధ్యమా? నాకు తెలీదు.

ఏమయితేనేం, సందు దొరికింది కదా అనుకుని, అట్టే నస పెట్టకుండా, నా నిజ పేరుమీద నొక్కేసేనే కానీ ఇంకేం చిక్కులొస్తాయో అని గుండెలు కొట్టుకుంటూనే ఉన్నాయి.

నా statusమీద నాపేరు చుక్కల్లో చంద్రుడిలా మెరుస్తూ కనిపించినతరవాత కూడా భయమే. అది నాకొక్కదానికే కనిపిస్తోందా? ఒక్క నిముషమో ఒక్క గంటో మాత్రమే కనిపిస్తుందా? ఈ పేజీ తెరిచి ఉన్నంతసేపే కనిపించి మళ్లీ మాయమయిపోతుందా? సరే, ఇంకేమైనా నాచేతుల్లో లేదు అనుకుంటూ కొంతకాలం వేచి చూచి, ఆపేరు అలాగే నిలబడి ఉన్నందుకు సంతోషించి ప్రకటించుకున్నాను నామిత్రులకి.

అలాగన్నమాట 60 రోజులు ఆగకుండా వెనకటిపేరు నా నిజపేరు నిలబెట్టుకోగలిగేను.

(నవంబరు 28, 2016)

# ఈ సంస్కృతి కృత్రిమం

సాధారణంగా మనం సంస్కృతి అన్న పదం ఒకజాతికో, ఒకదేశానికో చెందిన తినే తిండి, కట్టే బట్టా, తలదాచుకోడానికో ఇల్లూ, ఆచారాలు, పద్ధతులు, నీతినియమాలవంటివి విషయపరంగా వాడుతాం. నాకు తెలిసినంతవరకూ ఇవి చాలామటుకు ఆచరణీయమైనవీ, ఆదరణీయమైనవీ అయే అయిఉంటాయి. కొన్ని సంప్రదాయాలు కోడిపందేలులాటివి కొందరికి ఇప్పుడు నచ్చడం లేదు. అది వేరే సంగతి. మామూలుగా సంస్కృతి అంటే జాతి ఘనంగా చెప్పుకునేవిగానే ఉంటాయి.

ఈమధ్య అమెరికాలో మాత్రం కల్చర్ అన్న పదానికి మరో రకమైన అర్థం ఏర్పడింది. కొన్ని అంతగా మెచ్చుకోతగనివి కూడా కల్చర్ అన్నపేరుతో గౌరవాన్ని పొందుతున్నాయి. ఉదాహరణకి gun culture, locker room culture, bar culture వంటి పదాలు కొన్ని వర్గాలకి గొప్పగా ఉంటే, కొందరికి కంటకప్రాయం.

రెండు రోజులక్రితం ఫ్లోరిడాలో స్కూలుపిల్లలమీద ఒక కుర్రాడు తుపాకీతో జరిపిన మారణహోమం నన్ను కుదుపేసినంతగా ఇదివరకెప్పుడూ మరే కాల్పులూ కుదపలేదు.

ఒక స్కూలులో 19 ఏళ్ళ కుర్రవాడు పెద్ద తుపాకీ ప్రయోగించడంతో 16మంది విద్యార్థులు, విద్యార్థులని రక్షించే ప్రయత్నంలో ముగ్గురు టీచర్లూ మరణించేరని వార్త.

ఈ సంవత్సరం అంటే ఒకటిన్నర నెలల్లో 18 స్కూళ్ళలో ఇలాటి కాల్పులు జరిగేయి. 2023 జూన్ నాటికి 30. ఈ లెక్క స్కూళ్ళలో కాల్పులకి మాత్రమే. ఇవి కాక బజార్లు, ఇళ్ళూ, చర్చిలు, రెస్టారెంట్లూ కలుపుకుంటే ఇంకా చాలా జరిగిఉంటాయి. లెక్కలమాట పక్కన పెట్టి, అసలు ఈ కాల్పులు ఎందుకు జరుగుతున్నాయి అని ప్రశ్నించుకుంటే, రాజకీయంగా చర్చలు మామూలుగానే సాగుతున్నాయి. ప్రజలు దుఃఖంలో ఉన్నారు చర్చలకిది సమయం కాదని ఒకరూ, ఇప్పుడు కాకపోతే మరెప్పుడు అని మరొకరూ అరుచుకుంటున్నారు. ప్రతి కాల్పుల తరవాతా ఇదే తంతు. పుష్పం సమర్పయామి అన్నట్టు నాలుగు ఓదార్పు మాటలు, రవంత కినుక, ఊళ్లో ఉంటే ఫొటో సెషను, లేకపోతే టీవీలో ఇంటర్వ్యూలు. ఆ తరవాత కథ కంచికీ, కబుర్లరాయుళ్ళు ఇళ్ళకీ. దీనికి బలం గన్ కల్చర్ అన్న పదం ఒకటీ, తుపాకులు పట్టుకు తిరగడానికి మాకు “హక్కు” ఉందని అరిచేవారిసంఖ్య మరొకటి.

మొన్నటి దారుణ హింస చూసేక, నాకు ఈ కల్చర్ పదం ఎంత దుర్వినియోగం అవుతోందో అనిపిస్తోంది. కల్చరుకీ కల్టుకీ తేడా ఉంది కానీ ప్రస్తుతం, వీరంటున్న గన్ కల్చరు మాత్రం కల్ట్ లాగే అనిపిస్తోంది.

తుపాకీని ఎంత తేలికగా ఉపయోగిస్తున్నారో కొన్ని ఉదాహరణలిస్తాను.

– కారులో సంగీతం మరీ గట్టిగా వినిపిస్తోందని కాల్చిపారేసేడు ఇద్దరు కుర్రాళ్ళని ఒకాయన.

– కారుతాళాలు అమ్మ తీసి దాచేసిందని అమ్మని కాల్చేసేడు మరొక అబ్బాయి.

– ఎవర్నైనా చంపితే అనుభవం ఎలా ఉంటుందో చూదాం అని ఒకడు

– ఏమీ తోచక ముగ్గురు అబ్బాయిలు ఒక jogger ని

– తనకి ఇష్టమైనపిల్ల మరొకడితో వెళ్ళిందని, ఆ మరొకడిని

– టీచరు తనకి మంచిగ్రేడు ఇవ్వలేదని

– స్కూలునుండి బహిష్కరించేరని (తాను క్రమశిక్షణ ఎందుకు పాటించలేదన్న సంగతి లెక్కలోకి రాదు)

ఇందులో ఒక్కటి కూడా నేను కల్పించింది కాదు. అన్ని సంఘటనలూ నిజంగా జరిగినవి.

వీటన్నటివెనక ఉన్న సంస్కృతి ఏమిటంటే తోచిన సమాధానం ఒక్కటే. ఆత్మప్రదక్షిణం. “నేను” అన్న అహం. తనకి కావలసినట్టు జరగలేదని. అంతే గానీ అవతలిమనిషి ఏం చేసేడు, అది నేరమేనా అన్న ఆలోచన లేకపోవడం. నేను, నాకు, నాది అన్న భావానికి ఉన్నప్రాధాన్యం మరి దేనికీ లేకపోవడం.

ప్రస్తుతం సమాజం అంటూ ఏమీ లేదేమో అనిపిస్తోంది. ప్రతి ఒక్కరూ ఎవరికి వారే విడిగా ఒక సమాజం అయిపోయేరు.

నేను గెలవాలి

నామాటే చెల్లాలి

నేనే అందరికంటే గొప్పవాణ్ణి

— తెలివైనవాణ్ణి

— బలవంతుణ్ణి

— భాగ్యవంతుణ్ణి

**— నాకు కాని అమ్మాయి మరొకరికి కారాదు (If I can’t have her, nobody else can.)**

**ఇదే జీవనసరళి అయినప్పుడు మనం అంటూ కలిసికట్టుగా ఉన్న సమాజం, ఏమీ లేదు. ప్రతిఒక్కడూ తానే సమాజం, మిగతావాళ్లంతా తనఇష్టప్రకారం నడుచుకోవాలి అనుకుంటాడేమో.**

**హక్కులు హక్కులు అంటూ పెచ్చరిల్లిపోయేవారు గమనించవలసింది ఏ హక్కు గానీ హింసాత్మకం అయి, మరొక ప్రాణానికి హాని చేస్తే, ఆ హక్కు హక్కు కాదు, నేరం అవుతుంది. మరొకరి ప్రాణం తీయడానికి ఎవరికీ హక్కు లేదు. ఈమధ్య నేరస్థులు మరణశిక్ష తప్పించుకోడానికి నేరం అంగీకరిస్తే, వారికి యావజ్జీవ కారాగారశిక్ష విధించడం చూస్తున్నాను.**

అక్కడ తెలుస్తోంది కదా ప్రాణంమీద తీపి. తనప్రాణానికి ఉన్న విలువ, తాను తీసినప్రాణానికి ఉంటుందన్న ఆలోచన కనిపించదక్కడ. ఇలాటివి జరుగుతున్న అమెరికా అంటే మనవారికి నెత్తిమీద దేవత.

అమెరికా చదువులు, ఉద్యోగాలకోసం పిల్లల్ని చిన్నప్పట్నుంచీ మాలీసు చేసే తల్లిదండ్రులు తెలుగుదేశంలో ఉన్నారు. తుపాకీకల్చరు మనవాళ్ళు అట్టే పాటించకపోవచ్చు కానీ కార్లూ, డ్రింకులు పిల్లలకి అలవాటు చేయడం చూసేను. వాటివల్ల ప్రమాదాలు జరగడం చూసేను. అపార్థం చేసుకోకండి. మనదేశంలోనూ ఉన్నాయి విపరీతధోరణులు. అమెరికాలో తుపాకీతో కాల్చేస్తుంటే, మనదేశంలో పెట్రోలు పోసి తగలబెడుతున్నారు. నేను అడుగుతున్నది ఏ సంప్రదాయం, ఆచారం, పద్ధతి ఎలా వచ్చిందో, మూలకారణాలేమిటో, అవి ఈకాలానికి పరిస్థితులకీ వర్తిస్తాయో లేదో సరి చూసుకుని, అవుసరమైతే కాలానుగుణంగా మార్చుకోవలసిన అవుసరంగురించి ఆలోచిస్తున్నారా అని మాత్రమే.

ఒకవైపు ప్రపంచీకరణపేరుతో, పాశ్చాత్యసంస్కృతి, నిజానికి అమెరికాసంస్కృతి, ఆదర్శం అంటూ, సాకేంతికం ప్రసాదించిన వసతులతో వసుధైక కుటుంబం వచ్చేసిందని మురిసిపోతూ, ఆసంస్కృతి ఎలా సాకారం అయిందో, వారిపద్ధతుల ఆంతర్యం ఏమిటో తెలుసుకోకుండా పై పై నడవడి మాత్రమే తీసుకోడంమూలంగా జరిగే అనర్థాలు చూడండి. “నేను, నాకు మాత్రమే, నా…” అన్నది దివ్యమంత్రం అయిపోయింది. అమెరికాలో ఎవరిబాధ్యత వారిదే అన్న సూత్రం పాదుకోడానికి కారణం 200 ఏళ్ళక్రితం వలసవచ్చిన pilgrims ఎదుర్కోవలసి వచ్చిన ఆర్థిక పరిస్థితులు. తమకి అలవాటు లేని వాతావరణంలో నిలదొక్కుకోడానికి పడిన అనేక బాధలు. ఆ పరిస్థితులలో ఎవరి మంచికోసం వారు పాటుపడాలన్న సూత్రం తయారు చేసుకున్నారు. అది ఇప్పుడు వెర్రితలలు వేసి, స్వార్థంగా మారిపోయింది.

అలాగే సాహిత్యంపేరుమీదుగా జరుగుతున్న ఆర్భాటాలు. ఎదటివారి ఆలోచనలు, అభిప్రాయాలు, ఆశలూ, ఆశయాలూ- అన్నీ డొల్ల వీరిదృష్టిలో. వేదాలలో ఏముందో సూచన ప్రాయంగానైనా ఉండదు, తెలుసుకునే ఉద్దేశం ఉండదు వీరికి. “వేదాల్లో అన్నీ ఉన్నాయిష” అంటూ వెక్కిరిస్తారు సందర్భశుద్ధి లేకుండా. అక్కడా అక్కడా చదివిన నాలుగుమాటలు పుచ్చుకుని, తమకి అంతా తెలిసిపోయినట్టు మహోద్ధృతంగా వాదించేస్తారు మైకులు అక్కర్లేని గొంతుతో. వాగాడంబరమే కానీ విచక్షణ కనిపించదు అలాటి వాదనల్లో.

దీనినే కృత్రిమ సంస్కృతి అంటున్నాను నేను. ఈ విషయంమీద ఇంకా చాలా రాయొచ్చు కానీ ఎంత రాసినా పాయింటు అదే.

(ఫిబ్రవరి 17, 2018)

## ధనం కంటే బలవత్తరం అహం

ఇండియాలో స్త్రీలదుస్థితిగురించి కుప్పలుతిప్పలుగా ఉన్నాయి కథలు. మనదేశంలో మనం నిత్యం చూస్తూనే ఉన్నాం, సరే. విదేశాల్లో కూడా మనదేశంలో ఆడవాళ్లగురించి ఇదే అభిప్రాయం చాలా బలంగా ఉంది. అదే అభిప్రాయాన్ని బలపరుస్తూ మనవాళ్ళు అవే కథలు చెప్తారు, అదేదో మనకి మాత్రమే ప్రత్యేకం అయినట్టు. ఇది నిజం కాదు అని అనడం లేదు నేను. చెప్పకూడదని కూడా అనడం లేదు. కానీ ఏ దేశంలో మనుషులగురించైనా సమగ్రమైన అవగాహన కావాలంటే విభిన్నకోణాలు చూడాలి. అమెరికాలో దరిద్రులగురించి, రోడ్డువార బతుకులగురించి, స్త్రీలదుస్థితి గురించి వార్తల్లో అట్టే కనిపించవు. మనవాళ్లు అది చూసైనా నేర్చుకోరు. కేవలం మనదారిద్ర్యం, స్త్రీల హీనస్థితి మాత్రమే చిత్రిస్తారు. ఎందుకంటే అవే అమెరికాలో అమ్ముడవుతాయి. వాటికే పురస్కారాలు వస్తాయి.

మరొకరికి మనసంస్కృతిగురించి మనం చెప్పినప్పుడు కనీసం మంచీ చెడూ రెండు కోణాలూ చూపాలి కదా. నేను అనువాదాలు చేసినప్పుడు కొన్ని వ్యథలకథలు చేసేను కానీ అన్నీ అవే చేయడానికి ఒప్పుకోలేదు. ప్రతిమనిషిలోనూ బలాలూ, బలహీనతలూ కూడా ఉంటాయి. అలాగే సామూహికంగా ప్రతి జాతిలోనూ బలవంతులూ, బలహీనులూ ఉంటారు. మొత్తం సంస్కృతి పరిచయం చేయాలంటే అన్ని కోణాలు చూపడం అవుసరం.

గత 5,6 నెలలుగా అమెరికాలో మిలియనీర్లూ బిలియనీర్లూ అయి, సమాజికంగా ఉన్నత పదవులలో ఉన్నవారి ఇళ్ళలో ఆడవాళ్ళని క్రూరంగా హింసించడం వార్తల్లో చూస్తున్నాను. సమాజంలో పెద్ద పెద్ద హోదాల్లో ఉన్నవాళ్ళు, ఆర్థికంగా ఎనలేని బలంగలవారు ఇంట్లో ఆడవాళ్ళమీద తమ భుజబలం చూపించడం చూస్తే వారే వీరా అని ఆశ్చర్యపోతాం. నీటుగా మూడు పీసుల సూటులో నున్నగా దువ్వుకున్న క్రాపులతో మొహాన చిరునవ్వుతో ఎంతో మర్యాదస్తులలా కనిపిస్తారు. ఇంట్లో భార్యని శారీరకంగానూ మానసికంగానూ కూడా హింసిస్తుంటారు. అంతే కాదు. అలా హింసకు గురైన స్త్రీలని హేళన చేసేవాళ్ళని కూడా చూస్తున్నాను.

అలా హింసకు గురైన స్త్రీలని చాలామంది అడిగే ప్రశ్న, "ఎందుకున్నావూ ఆ ఇంట్లో, ఎందుకు అతన్ని వదిలిపోలేదూ?" … ఇంకేదో ఎందుకు చెయ్యలేదూ అంటూ అదేదో ఆ స్త్రీలదే తప్పు అన్నట్టు కబుర్లు చెప్పేవాళ్లని కూడా చూస్తున్నాను. దీనిమీద మరో రెండు పేజీలు రాయొచ్చు కానీ ఇది చాలు కదా ఒకరు మరొకరిని హించించడం ఏదో ఒకదేశపు ప్రత్యేకలక్షణం కాదని చెప్పడానికి.

నేను పరిష్కారాలు సూచించడంలేదు. సూచించగల పాండిత్యం నాకు లేదు. కానీ నామనసులో మెదులుతున్న ఆలోచనలు మాత్రం చెప్పకుండా ఉండలేను.

ఎందుకు అతన్ని వదిలేయలేదూ? అన్న ప్రశ్న అడగడం చాలా తేలిక. దీనికి సంద్రాలు మాటల్లో చెప్తాను. "పగలల్లా కష్టపడి, సీకటడ్డాక తాగొత్తాడు. తాగినప్డు ఒల్లు తెలవదు. నాలుగిచ్చుకుంతడు. మల్ల తెలివొచ్చినంక తప్పయిపోసాదంటా ఏడస్తడు. ఆడు మంచోడేనమ్మా, సితకతంతడు గానీ మల్ల శాన పేంవ నానంటె." ఇది తెలుగుకథల్లో సర్వసాధారణంగా కనిపించే మాట. సంద్రాలుమాట అని ఎందుకన్నానంటే అలాటి సంఘటనలు కిందితరగతి జనాలలోనే ఉంటాయన్న అపోహ కొందరికి ఉంది. నిజానికి మధ్యతరగతి, పైతరగతి జనాల్లో కూడా ఇదే తర్కం.

నేను ఈమాటలు హాస్యానికి చెప్పడం లేదు. పట్టి చూస్తే, ఆమాటలవెనక ఉన్న నిజం వివరంచడం తేలిక కాదు. అసలు చెప్పలేం. ఎందుకంటే ప్రతి ఒక్క వ్యక్తి పరిస్థితి, మనస్తత్వం, వాస్తవాలు ఆ ఒక్క వ్యక్తికి మాత్రమే తెలుస్తాయి. అనుభవమయి ఉంటాయి. అమ్మ, అక్క, చుట్టాలు, స్నేహితులు, సైకో తెరపిస్టులు- అందరూ కూడా తాము చూసిందో విన్నదో మాత్రమే తలుచుకుని వ్యాఖ్యానాలు చేస్తారు. పుస్తకాలఉపయోగం కూడా ఈవిషయంలో పరిమితమే.

అందుకే ఎవరైనా నన్ను సలహా అడిగితే, నిర్మొహమాటంగా నాతరం కాదని చెప్తాను. నాకు తెలుసు. నాఅనుభవాలు, నాఅవగాహన, నాపరిస్థితులు ప్రాతిపదికగా నేనేం చేస్తానో ఏమి చేయగలనో నాకు తెలుసు కానీ అది ఇతరులకి పనికిరాదు. ఎందుకంటే వారి అనుభవాలు, అవగాహన, పరిస్థితులు, చిత్తస్థాయి వేరు కనక. ఎవరికి వారు నిర్ణయాలు చేసుకోవాలి గానీ మరొకరు చెప్పలేరు. ఒకవేళ చెప్పినా అది అంతరాంతరాల ఎక్కడో తగినదే అని తోస్తేనే ఆ సలహా ఆచరణలో పెట్టడం జరుగుతుంది.

స్కూలు చదువులు సమాజంలో నెగ్గుకు రావడానికి, పేరు తెచ్చుకోడానికీ, ఐదంకెల ఆర్జనలకీ తగినట్టు తయారు ఇస్తాయేమో కానీ మనిషిని మనిషిగా చేసేవి కావు. ఈరోజుల్లో పిల్లలని సమాజంలో ఉన్నతస్థాయికి చేరేలా నానాయాతనలూ పడే తల్లిదండ్రులు మనిషిగా సాదారణ నీతులు—పొరుగువాడికి కాస్త చేయందించు, వాడు కూడా మనిషే, నీలాటివాడే వాడు కూడా—లాటివి నేర్పడం లేదు అని నాకనిపిస్తోంది. కష్టపడి పైకొచ్చినవారి కథలు చెప్తారు. నువ్వేం కావాలనుకుంటే అది కాగలవు. నీఅంత తెలివైనవాడు లోకంలో లేడు అంటూ ప్రోత్సహిస్తారు. ఇవన్నీ బాగానే ఉన్నాయి. అమెరికాలో చూసేను. ఇండియాలో కూడా ఇదే పద్ధతి ఇప్పుడు. సగటు తెలివితేటలు ఉంటే, అద్భుతం, అమోఘం, అంటూ ఆకాశానికెత్తేయడం. ఇదే ప్రమాదం. ఇదే కళ్ళు నెత్తికెక్కేలా చేస్తుంది. భారవికథ అందరికీ తెలిసిందే కదా. "నాఅంతటివాడు మరి లేడు," అన్న ఆలోచనకి ఇక్కడే బీజం పడుతుంది. అదే మిగతావారిని తక్కువగా చూడడానికి

దారి తీస్తుంది. వ్యక్తివిజయానికున్న విలువ వైయక్తికనీతికి లేకుండా పోతుంది. ఇప్పుడు ఇలా అని ఎవరైనా ఆలోచిస్తున్నారా? లేదనే అనుకుంటున్నాను.

ప్రోత్సాహంపేరుతో అతి చేసి, మనిషిని డబ్బుతో కొలిచే యంత్రంగా తయారు చేయడం న్యాయం కాదు. కష్టపడి ఎంతో పేరుప్రఖ్యాతులు తెచ్చుకున్నవాడు ఒకడుంటే, కష్ట పడ్డా కడుపు నిండనివారుగా సామాన్యులుగా మిగిలిపోయేవారు వేలల్లో, లక్షల్లో ఉంటారు. ఇది వాస్తవం. పిల్లలకి ఈ వాస్తవం కూడా తెలియాలి. అప్పుడే అహంభావం తగ్గించుకుని, తనలా విజయం సాధించనివారిని, ఆర్థికంగా తనకంటే తక్కువ అయినవారిని గౌరవించగలుగుతారు.

అందుకే అంటున్నాను ఇది ఇంట్లోనే ప్రారంభం కావాలి. పిల్లలు చెప్తే వినరు. చూసి నేర్చుకుంటారు. అమ్మా నాన్నా ఎలా మాటాడుతున్నారో, ఏం చేస్తున్నారో వాళ్ళూ అదే మాటాడతారు, అదే చేస్తారు. సరేలెండి, ఇవన్నీ కాపీబుక్కు నీతులు. అందరికీ తెలిసినవే.

అంచేత, ఇంతటితో ఈ టపా సమాప్తం.

ooo

(మార్చి 20, 2018)

## అహంభావసారూప్యం

ధనంకంటె

అధికారంకంటె

బలమైనది అహం.

ఈనాడు ప్రపంచం సమస్తాన్ని

నడిపిస్తున్న ఏకైక సూత్రం

దీనివల్ల నాకేమిటి లాభం?

స్నేహాలు, ద్వేషాలు,

చేతులు కలపడాలూ

తన్నుకు చావడాలూ అన్నీ

ఏదో ఒక స్వప్రయోజనం ఆశించే.

సాహిత్యంలో భావసారూప్యం సహితం

అహంభావసారూప్యం అయిపోతోంది.

(జులై 12, 2021)

## వినోదం?

హుషారుగా జీవించాలన్నది ఈనాటి  ఆదర్శం, ఏకైక ధర్మసూత్రం

చదువు సరదాగా ఉండాలి

ఇంటిపని వంటపని తేలిగ్గా అయిపోవాలి

ఉద్యోగం సరదాగా ఉండాలి.

ఆనందంగా ఉంటేనే దానికి మర్యాద దక్కుడు

చుట్టాలతో స్నేహితులతో ఇంటివారితో పొరుగువారితో

సంబంధాలన్నీ కిలకిలా గలగలా ఆడుతూ పాడుతూ సాగిపోవాలి.

000

మాచుట్టుపట్ల ఊళ్లు తగలడుతున్నాయి.

వందమైళ్లవరకూ పొగవాసన కొడుతోంది

కొన్ని కోట్ల ఆస్తులు అగ్నికి ఆహుతి

ప్రాణనష్టం ఇప్పటికి 50మందిదాకా

ఇంకా ఎన్ని ప్రాణులు పోవాలో మంటలార్పేలోపున.

000

ఈ మారణహోమానికి మూలం ఆనందం!!

"ఎవరికి వారే నా ఆనందమే నాకు ముఖ్యం" అన్న వితండవాదం.

ఈ అగ్ని ప్రజ్వలించడానికి కారణం

campfire, సగం కాల్చి పారేసిన సిగరెట్లు

లేళ్ళవేటలో పేలిన తుపాకీలు రాల్చిన నిప్పు రవ్వలు.

000

సరదాలకీ, వినోదాలకీ, జీవితాన్ని అనుభవించడానికీ

ఇచ్చిన విలువ బాధ్యతలకి లేదు మరి

ఈ నవనాగరీక ప్రపంచంలో.

సూర్యునిచుట్టూ గుడి కట్టినట్టు

మట్టిరంగు పొగ చూడ్డానికి బహు సుందరంగా ఉంది

ఫొటో తీయడానికి మనసొప్పలేదు.

000

(కాలిఫోర్నియాలో కొన్ని ఎకరాల అడవులు దహనం మూడురోజులుగా)

(నవంబరు 14, 2018)

## ఇది నా అరణ్యం

పూర్వం  మునులు నిత్యజీవితంలోని ఒంఝాటాలు తెంపుకు అరణ్యాలను ఆశ్రయించేరు. ఎందుకంటే ఇంట్లో ఉండి తపస్సు చేసుకోడం సాధ్యం కాదని. ఇంట ఇల్లాలూ, పిల్లలూ చేసే రణగొణధ్వనులు కాదు అవాంతరం. అంతకంటె ఘోరం శ్రేయోభిలాషులూ సుహృన్మిత్రులూ

వచ్చి అతడు గతంలో చేసిన పాపకార్యాలు పదే పదే ముందుకి తెస్తూ సానుభూతిపేరున చేసే రచ్చ. అదీ దుర్భరం.

గతం మరిచిపోనివ్వరు. కెలికి కెలికి గతం గుర్తుకి తెస్తారు. ఎంతో ప్రేమ ఒలకబోస్తూ. దానికి ప్రతి ఇదుగో,

ఇది నా అరణ్యం.

నాకు నేను సృష్టించుకున్న అదృశ్యహవేలీ.

ఆదానప్రదాల హంగామా ఉండదిక్కడ.

పూలు రారమ్మని భ్రమరాలను పిలువవు.

జాంపండు చిలుకను ఆహ్వానించదు.

నేనేమి ఆస్వాదిస్తానో నా ఇష్టం.

నాప్రపంచంలో నేనే నిర్ణయిస్తాను నాకేమి కావాలో.

నీమాటలు వినిపించవు.

నీచిత్రాలు కనిపించవు.

కాదూ కూడదని మారాంచేస్తే

ignore, delete, block, unfollow, unfriend యప్ఫీ ప్రసాదించిన వరాలు.

ఇదీ నీబతుకు అంటూ నువ్వు నాకోసం ఆవిష్కరించిన చిత్రరాజం నాకు శూన్యంగా కనిపిస్తుంది.

నేను క్షేమం. నువ్వు క్షేమమనుకుంటూ నాకు నేనే చెప్పుకుని శలవు తీసుకుంటాను అనుదినం.

000

(జనవరి 26, 2018)

## క్షణికమేనా?

బతుకు క్షణికమే కదా
క్షణికానికీ క్షణికానికీ వ్యత్యాసం
క్షణంనుండి క్షణానికి ప్రయాణం
అలనాడు కథలు రాయుట మొదలిడినరోజుల్లో
సాహితీవేత్తలు సెహభాషని తలలూచినరోజు ఓ క్షణికం
అనువాదమార్గాన సాగినదినాలలో
గణనీయ ప్రొఫెసర్లు భుజం తట్టినప్పుడు మరో క్షణికం
తెలుగుతూలిక తెరిచేక మరో క్షణికం
బతుకు నాలుగోపాదం ప్రవేశించినవెనక
ముఖపత్ర మిత్రసంచయం నడుమ నడయాడు సంబరమూ అంతే.
    సాహితీగ్రూపులో ఆమాత్రం కూడా లేదేమో
అందుకే అనుకుంటాను
బతుకు ఒక్క క్షణంతో అయిపోలేదని.

(నవంబరు 18, 2015)

## ఆనవాళ్ళు లేవు

గంభీరంగా విస్తరించుకున్న అంభోరాసి

శూన్యంగా ఆకాశం



కాకలు తీరీన ఏ చిత్రకారుడో తీరిచి దిద్దిన క్షితిజరేఖ

పాదాలక్రింద జారిపోతున్న ఇసుకరేణువులు

ఒడ్డున నిర్దుష్టంగా రూపు కట్టనినీడలు

అశ్రాంతంగా ఒకొక అలా మోసుకొస్తున్న మరో కల

ఈ తీరం వదలడానికి మనసొప్పదు

రేపటిదాకా ఆగడానికి నాహస్తం ఒప్పదు.

(July 25, 2017)

నేను ఉన్నాను.

నాసమాధిప్రక్కన నిలిచి విలపించకు.
నేనక్కడ లేను, నేను నిదురపోలేదు.
నేనున్నాను వేనవేలై వీస్తున్న సమీరాలలో
నేనున్నాను మంచులో స్ఫటికమణివలె దీపించు కాంతిపుంజాలలో.
నేనున్నాను పైరులపై పరుచుకొన్న ప్రభాతకిరణాలలో.
అలవోకగా కురుస్తున్న శరత్కాలపువానచినుకులలో.
ప్రభాతసమయంలో నీవు కనులు తెరచినవేళ
ప్రశాంతమై విహరించేపక్షిగణంతో నీలో మేల్కొను సంభ్రమాన్ని నేనే.
నిర్ఝరనిశీధిలో చిరుతారకలమిణుకులలో ఉంది నాఉనికి.
నాసమాధిదగ్గర నిలబడి వ్యథ చెందకు
నేను లేనక్కడ. నేను మరణించలేదు.

000

Mary Elizabeth Fry ఈకవిత రచించిన సందర్భం ఆసక్తికరమైనది. అంతకుముందు ఏమీ రాయలేదు. ఛందస్సు లేదు. పదాలు వాటంతట అవే వచ్చేయిట. ఇది రాసినతరవాత ప్రచురణకి పంపలేదు. తెలిసినవారికి చూపుతూ వచ్చింది.

Northern Irelandలో యుద్ధంలో చనిపోయిన ఒక సైనికుడు చనిపోయినతరవాత అతనితండ్రి ఆ కుర్రవాడిసంచీలో కనిపించిన ఈకవితను BBC radioలో 1995లో చదివేరు. 1996లో BBC Bookwormవారు "అత్యంత ప్రాచుర్యం పొందినకవితలు" ఏవో చూడడంకోసం poll చేస్తే ఈ కవితకి 30,000 write in ఓట్లు వచ్చేయి.

అనేకవిధాల అనేకమంది ఈకవితని ఆదరించేరు. the Challenger space shuttle, the Lockerbie bombing, the 9-11 terror attack on New York's twin towers సంస్మరణసభల్లో ఈకవిత గానం చేసేరు.

మరొక విశేషం. ఈకవిత ప్రచురించేక, రచయిత్రి కాపీరైటు హక్కులు తీసుకోలేదు. "ఇది నాది కాదు, యావత్ప్రపంచానికి చెందిన కవిత" అని ఆమె అభిప్రాయం.

ఆ తరవాత కూడా కొన్ని రచనలు చేసింది కానీ ఈకవితకి వచ్చిన ప్రాచుర్యం మరే రచనకీ రాలేదు. అయితేనేమి. అశేష ప్రజానీకాన్ని ఆకర్షించినకవిత ఒక్కటి చాలదా? గంగిగోవుపాలు గంటెడైనను … Mary Elizabeth Frye జన్మ ధన్యం.

(మే 11, 2017)

## సగం తెరిచిన తలుపు

నేను రాసిన ప్రతి పదం
సగం తెరిచిన తలుపు



ప్రతి పదానికీ నీ భావాలు అద్ది
సృష్టిస్తున్నావు మరో చిత్రం.
సర్రియలిస్ట్ కళాఖండమది.
నాగది తలుపుల్లోంచి
పొరుగింటి మధ్యగదిలోనుండి
ఆచివర గవాక్షంలోనుండి అస్పష్టంగా
కనిపిస్తున్న ఆ చిత్రరాజమును వ్యాఖ్యానించడానికి
మరో మహాకవి జన్మించవలె.
నీకూ నాకూ మరొక మహావాక్యం ప్రసాదించవలె.
అంతవరకూ ఈ ఎదురుచూపులు తప్పవు.

(జనవరి 24, 2017)

(ఈ చిత్రంలో విచిత్రం ఏమిటంటే, నాగదిలోనుంచి చూస్తే, నాకిటికీ అద్దాలలోంచి పొరుగువాటా గదిలో ముందు, వెనక కిటికీలలోంచి ఆ వెనక ఉన్న తరుసంతతి కనిపించడం.)

# పత్తరాలు

నాల్రోజులక్రితం లంకెలబిందెలాటి అట్టపెట్టెలో దొరికిన పాత ఉత్తరాలు. వరదల్లో తడిసి పోస్టాఫీసు యంత్రాల్లో నలిగి రంగు మాసిపోయి రాత అలుక్కుపోయి మిగిలిన ఈ ఉత్తరాల గుట్ట.

ఏ మధ్యాహ్నాలో అర్థరాత్రులో భోజనాలయేక, నిత్యనైమిత్తికాలు ముగించుకు తీరిగ్గా కూర్చుని నిదానంగా రాసుకుపోయిన ఊసులు. బుర్రల్లో పుట్టి రక్తనాళాలద్వారా వేళ్ళల్లోకి



ప్రవహించి కలం ఇంకులోకి సీదాగా జారి కాగితాలమీద రూపు కట్టిన కబుర్లు. తుడుపులూ కొట్టివేతలూ లేవు. Cut and paste లేదు. ఎంత హాయి అవి!

నేను కూడా అంత తీరిగ్గానూ కూర్చుని కళ్ళు పొడుచుకు చూస్తున్నా అలుక్కుపోయిన అక్షరాలు ఊహించుకుంటూ అర్థాలు వెతుక్కుంటూ చదువుతున్నా. తోచినవి తోచినట్టు కథలు అల్లుకుంటే ఎలా ఉంటుందో?! అని ఆలోచిస్తూ.

అహో, ఉత్తరాలూ పత్తరాలూ గుట్టగా – శిశిరమేతెంచెనంటూ గలగల్లాడుతూ రాలిన పండుటాకుల్లా, ఆరముగ్గిన అరటిపండు తొక్కలా మాగి కమిలిపోయి అక్షరాలు అలుక్కుపోయి వరదలో నాని చివికిపోయి పోస్టాపీసు సార్టరులో చిత్తుగా నలిగి, చిరుగులు పడి మిగిలిన అర్థ పత్రాలు, అర్థరహిత పత్తరాలూ. చదవనా?

కనీసం 15 ఏళ్ళకి ముందు 30 ఏళ్ళ కాలవ్యవధిలో అందుకున్నవి ఇప్పుడు చదివితే ఎలా ఉంటుంది? అసలు అర్థం అవుతాయా? ఎన్ని మరిచిపోయేనో …ఇప్పుడు అవి మళ్ళీ ఏమి గుర్తుకి తెస్తాయో, ఏవి నాబుర్రని తొలిచేసి మరింత గందరగోళంలో ముంచేస్తాయో.

తదేకదృష్టితో వాటివేపు గుచ్చి గుచ్చి చూస్తున్నాను – అమ్మా, నాన్నగారూ, అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్లూ, స్నేహితురాళ్ళు రాసినవి వివిధ దశల్లో వేరు వేరు ఊళ్ళనుండి – విశాఖపట్నంనుండి వాషింగ్టన్ డీసీ వరకూ.

ఏది ఎవరిదగ్గరనుండి అయిఉంటుందో – అదొక పజిలు. నాతోనే పందెం వేసుకుని కళ్లు చికిలించి చూస్తున్నాను. కొన్ని సుళువుగానే తెలుస్తున్నాయి కానీ కొన్ని చిక్కుప్రశ్నలయి సవాళ్ళు విసుర్తున్నాయి.

ఆలోచిస్తుంటే ఏదో కథ గుర్తొచ్చింది. కుటుంబరావుగారో సుబ్రహ్మణ్యశాస్త్రిగారో జ్ఞాపకం లేదు. అల్లుళ్ళకాలేజీ చదువులకి మామగార్లు మదుపు పెట్టే రోజులు. కథలో "మాఅల్లుడి ఉత్తరం ఆఖరివాక్యం చదివితే చాలు" అంటాడు కథకుడు. "బాగా చదువుకుంటున్నాను" అని మొదలు పెట్టి, కాలేజీలో వ్యాపకాలన్నీ రాసి, చివర "కాబట్టి ... రూపాయలు పంపవలెను," అని ఉంటుందిట. నాఉత్తరాలు అలా ఉండవులెండి. ఊరికే నాకు గుర్తొచ్చిందంతే.

ఒకొక ఉత్తరం రంగూ, ఉత్తరంలో భాషా, కాలక్రమంలో రూపు మారుతూ వచ్చిన కవర్లూ, ఆకారాలూ, వాటిమీద ముద్రలూ చూస్తూ ఆలోచిస్తూ కాలయాపన కొంత సేపు. ఎవరు ఏం రాసి ఉంటారో గుర్తు తెచ్చుకోడానికి ప్రయత్నిస్తూ మరికొంత జాప్యం.

తీసి చూడమంటోంది మనసు. కాదు కాదంటూ మొరాయిస్తోంది చెయ్యి. ఏమూలో బెరుకు, ఇదీ అని వర్ణించలేని పిరికితనం. ఏం చదవాల్సొస్తుందో? ఏ మరిచిపోయిన కథలు తిరిగొస్తాయో? ఆనందదాయకం అవుతాయా? అయోమయంలోకి తోస్తాయా. బుర్రలో లేని తలపులు తవ్వి తీసి, లేని కలతలు తెచ్చిపెట్టగలవు కూడా కదా. ఎందుకు సుఖానున్న ప్రాణాన్ని దుఃఖపెట్టుకోడం?

"నీకు ముసల్తనం ఒచ్చేసింది."

ఇదా ముసిల్తనం?అమ్మలు తన బొమ్మలున్న ప్లాస్టిక్ డబ్బా తీసుకుపోయి, మళ్ళీ "ఇవి నీవి" అని తిరిగి తీసుకొచ్చి నాముందు పెట్టకపోతే అసలు ఈ ఉత్తరాలమాట తల్చుకునేదాన్నేనా?

"బిడ్డ తిర్గి తెస్తే మాత్తరం నివ్వు సూడాల్నెక్కడున్నాది?"

ఎక్కడా లేదు. చూడాలని లేదు. చూడాలని ఉంది కూడా. అవునూ కాదూ. సదసద్సంశయం. బతుకే ఓ ద్వంద్వం. కావాలనుంటుంది. అఖ్ఖర్లేదనీ ఉంటుంది. అడగడుగునా చీలిన దారే! అడుగుడుక్కీ సంశయమే ఆ రెండోదారిలో వెళ్ళి ఉంటే ఏం కనిపించేదో – అస్తమానం అదే యావే!

నాలుగు దశాబ్దాలలో పారేసినవి పారేయగా మిగిలినవి ఇవి. ప్రతి ఉత్తరంలోనూ ఏదో ఒక విశేషం ఉండే ఉండాలి. నేను అందుకున్న ప్రతి ఉత్తరం దాచలేదు. కొన్ని కొంతకాలం ఉంచి పారేశాను. కొన్ని వెంటనే పారేశాను. కాలగతిలో ఒకొకరే నాజీవితంలోనుండి తప్పుకుంటుంటే, అదే క్రమంలో వారికి సంబంధించిన ఉత్తరాలూ, కాయితాలూ, కార్డులూ చిత్తుకాయితాలబుట్టలోకి విసిరేశాను.

ఎదురుగా కుప్పమధ్యలో ఏరోగ్రాంమీద అమ్మపేరు తొంగి చూస్తోంది. యన్. శేషమ్మ ఇంగ్లీషులో. బహుశా ఉత్తరంమీద ఎడ్రెస్ రాసినవాళ్ళెవరో రాసి ఉండాలి. కాయితంరంగు చూస్తే

అది చివరిరోజుల్లో రాసింది కావచ్చు. అమ్మ రాసిన ఉత్తరాలు చింపడానికి చేతులు రావు. హుమ్. అదో భ్రమ. … నేను ఉంచినంత మాత్రాన వాటికి కొత్తగా వచ్చే ఘనత ఏముంది? నాతరవాత ఏమవుతాయి?

ఇదుగో, ఇలాటప్పుడే జీవితంగురించి బహు విశాలదృక్పథం వచ్చేస్తుంది నాకు. కొన్ని శతాబ్దాలూ, యుగాలూ, కల్పాలూ తలుచుకుంటాను. మహా ఋషులూ, చక్రవర్తులూ, వేదవేదాంగవిదులూ కాలగతిలో కలిసిపోయేరు కదా. వాటిమధ్య నేనెంత, నా ఉత్తరాలెంత? నేను ఈరోజు ఏమి చేసినా, చెప్పినా, ఎవరిని పలకరించినా, ఎక్కడికి వెళ్ళినా పూట గడవడానికే తప్ప వాటికి అంతకన్న విలువేముంది అనిపించదూ ఎవరికి మాత్రం?

కానీ … ఇప్పుడు ఇవి పారేస్తే, భవిష్యత్తులో "అయ్యో ఎందుకు పారేసేను, దాచుకుని ఉంటే బాగుండేది కదా" అని విచారించే సమయం వస్తుందా? హుమ్. ఏం భవిష్యత్తు? … మహా అయితే మరో రెండేళ్ళు, అంతే కదా. ఈ మధ్యకాలంలో నా గతంగురించి వగచే రోజు వస్తుందనుకోడం హాస్యాస్పదం కాదూ?

మళ్ళీ కుప్పవేపు చూసేను. బహుశా ఆ ఉత్తరాలన్నీ వరసగా పేర్చితే స్టాంపు ధరలు ఎలా పెరిగేయో తెలుస్తుంది. దేశంలో పేరే కాయితాలమీద రాసి మడిచి మరో కవర్లో పెట్టి పోస్టు చేసే సంప్రదాయం మారి ఇన్లాండు కవర్లు వచ్చేక ఆ కవర్లకి వాడే కాయితం మరీ అల్పం అయిపోయింది. కనీసం ఏరోగ్రాములకయినా కాస్త మంచి కాయితం వాడితే బాగుండు.

(మే 27, 2015)

## ఉత్తరాల్లో "నేను" నేనేనా?

మైత్రిగురించి కొన్ని టపాలు రాసేను కానీ ఈ ఉత్తరాలసందర్భంలో మరో రకం ఆలోచనలు వచ్చేయి నాకు. అవే ఇవి.

స్నేహం విషయంలో అందరి అనుభవాలూ ఒక్కలాగే ఉండవు. స్నేహాలు ఎలా ఏర్పడతాయో నేను వేరే చెప్పక్కర్లేదు కదా. స్థలం, కాలం, సమాజంలో తమస్థాయి, కులం, గోత్రం, ఉద్యోగాలూ, అభిరుచులూ – ఏవైనా కావచ్చు ఇద్దరిని ఒకచోటికి చేర్చడానికి. ఎటొచ్చీ, నావిషయంలో ఒక సంగతి మాత్రం నిజం. నాకు నేనై ఎవరితోనూ స్నేహం చేసుకోడానికి ప్రయత్నించలేదు. నాస్నేహితులంతా వారు నన్ను ఎంచుకున్నందున మొదలయినవే. ఇప్పటికీ నానుంచి ఫోను అందుకునేవారు ఏడాదికొకరు కూడా లేరు. అందుకు ప్రత్యేకకారణం నేనేదో దిగొచ్చేనని కాదు. నాగురించి నాకున్న భయాలే నాకు అడ్డొస్తాయి. నాతో మాటాడ్డం వారికి ఇష్టం ఉంటుందో ఉండదో, వారికి నచ్చినపద్ధతిలో నేను సంభాషణ సాగించలేనేమో … ఇలా ఆలోచిస్తూ ఊరుకుంటాను. అందుకు తగ్గట్టు కారణాలు వెతుక్కుంటాను. పొద్దున్నా, సాయంత్రం, రేపూ, ఆదివారం, వాళ్లు పన్లో ఉంటారేమో, భోజనాలవేళేమో, శెలవురోజు అతిథులు ఉంటారేమో ఇంట్లో … ఇలా నాకు నేనే సాకులు చెప్పుకుని వాయిదాలు వేసుకుంటూ పోతాను.

నా పూర్వమిత్రులు రాసిన ఉత్తరాలు చూస్తుంటే ఇప్పుడు కొత్తగా మరో విషయం స్ఫురించింది. వీరందరూ కోరినది నాస్నేహమా, వారు "ఊహించుకున్న మాలతి" స్నేహమా? వాళ్ళు ఊహించుకున్న "మాలతి" ఎలా ఉంటుంది? ఇప్పుడు లేదని నాకు ఖచ్చితంగాతెలుసు. మరి వారికి కనీసం ఆ ఆలోచనైనా ఉందా?

అలా అనుకోడానికి కారణం ఆ ఉత్తరాల్లోని ఉదాత్త మధుర, మనోజ్ఞ భావాలు. అవి చదువుతుంటే ఒక్కొక్కరూ తమ ప్రవృత్తులని నామీదకి ప్రసరింపజేస్తున్నారేమో అన్న సందేహం కలిగింది నాకు. అలాటిసందేహం ఎందుకొచ్చిందంటే – సాధారణంగా ప్రతి హృదయం సృష్టిలో అందాలకి స్పందిస్తుంది. ముఖ్యంగా నవయౌవన్మేషణవేళ. వాళ్ళు కవితలు అంటూ పేరు పెట్టుకు ఏమీ రాయకపోవచ్చు. కథలు అల్లకపోవచ్చు. అలాటివారిలో చాలామంది అందమైన వస్తువు చూసినప్పుడు, తమ ఊహలని సుందరమైన పదాలలో ప్రకటితం చేస్తారు. అది ఈ ఉత్తరాలలో నాకు కనిపించింది. అవి చదువుతుంటే ఆ ఉత్తరాలు అందుకుంటున్న నేను కనిపించలేదు నాకు. రాసినవారి మనోభావాలే వాటినిండా!

యూనివర్సిటీకాలంలో ఒక స్నేహితురాలు. శలవులకి ఇంటికెళ్ళినప్పుడు రాసింది – When I think of you, I think of early dawn and its reflection in a dew drop అని. తరళబిందువులో ప్రతిఫలించిన ఉదయకిరణాల సొయగాలు! ఎంత అందమైన భావన! ఆరోజుల్లో అంటే 17, 18 ఏళ్ళవయసులో అటువంటి కమ్మని భావశకలాలు మనోఫలకంమీద నర్తిస్తాయి. ఆ తరవాత క్రమంగా డిగ్రీలూ, పెళ్ళిళ్లూ, పిల్లలూ, ఉద్యోగాలూ వంటి లౌకికవ్యాపారాల్లో పడినతరవాత ఈ సుందరభావాలకి చోటూ ఉండదు, కాలమూ దొరకదు నూటికి తొంభై పాళ్లు.

నేను అమెరికా వచ్చేక అప్పుడప్పుడు ఉత్తరాలు రాసుకున్నామేమో కానీ ప్రస్తుతం నాముందు ఉన్న ఒకే ఒక ఉత్తరం తన అన్న హఠాత్తుగా చనిపోయేయిన వార్త మోసుకొచ్చినది. చిన్నవాడే. యాభైలోపునే కావచ్చు. అసలు ఆ అమ్మాయి నాకంటే రెండు, మూడేళ్ళు చిన్న. నాకు పరిచయమైన 30 ఏళ్ళలోనూ తండ్రి రోడ్డుప్రమాదంలో పోయేరు. తరవాత అన్న, తల్లి, బావ, … 30-40 ఏళ్ళ వ్యవధిలో ఇన్ని మరణాలు ఒక వ్యక్తికి అనుభవమయితే ఆవ్యక్తి మానసికస్థితి ఎలా ఉంటుంది? “మీలాగ కర్మ అనుకోమంటావా. నేనలా అనుకోలేను,” అని రాసింది. మీలాగ అంటే హిందువులని. ఆవిడ హిందువు కాదు. కానీ నొప్పి అందరికీ ఒకటే కదా. మనసుని సమాధానపరుచుకోడంలో మతపరమైన తేడా ఉంటుందా? కర్మ కాకపోతే వాళ్లు మరేదో అనొచ్చు. ఎంత ఆలోచించినా ఈ ఉత్తరానికి నేనేం జవాబు రాసేనో జ్ఞాపకం రావడంలేదు. నేను అట్టే మాటాడకపోయినా నామీద తనకి ప్రత్యేకమైన అభిమానం ఉందనే అనుకుంటాను. వాళ్లనాన్నగారు పోయినప్పుడు మేమింకా యూనివర్సిటీలో చదువుతున్నాం. శలవులకి ఇంటికి వెళ్ళినప్పుడు జరిగింది ప్రమాదం. తరవాత తిరిగి క్లాసులు మొదలయినప్పుడు వచ్చేక చెప్పింది నాకు 10 పేజీల ఉత్తరం రాసిందిట. అది నాకు అందలేదు. అప్పటికే కనీసం మా postmans కి తెలుసు నేను రచయిత్రిని అని. నిడదవోలు మాలతి, విశాఖపట్నం-2 అని కవరుమీద ఉంటే, నాకు అందేది. అలాటిది ఎంతో వేదనతో నాస్నేహితురాలు రాసిన ఉత్తరం నాకు అందలేదు. ఏమనుకోడం? మరి కర్మ అనుకోవాలా?

మధ్యాహ్నాలు క్లాసుకీ క్లాసుకీ మధ్య టిఫిను తినడానికి, విశ్రాంతికీ షష్ఠిపూర్తి మహల్ అని ఒక రెండు గదుల ఇల్లు ఉండేది. ఇప్పుడూ ఉందేమోలెండి ఆ ఆవరణలో. దానివెనక ఉన్న జీడి తోటల్లో ఇద్దరం తిరిగేవాళ్ళం మా విశ్రాంతి సమయాల్లో. అట్టే మాటల్లేవు. ఇద్దరం ఎవరి ఆలోచనల్లో వాళ్లు మునిగి తోటలో తిరిగేం. అది నాకొక మధురస్మృతి. ఆ తరవాత చదువు ముగిసి చెరో దారీ అయిపోయిన తరవాత, ఉత్తరాలు చాలా తగ్గిపోయేయి. దాదాపు 40 ఏళ్ళతరవాత మళ్లీ వాళ్ళఊరు వెళ్లేను తనని చూడడానికి. సాంఘికంగా బాగా పైకొచ్చింది, ఇల్లూ, కారూ, కొడుకూ, కోడలూ, మనవరాలూ … అన్నీ వరసగా లెక్కప్రకారం జరిగిపోయేయి. నేనంటే ఉన్న అభిమానం మారిపోయింది అనను కానీ తన వ్యక్తిత్వంలో మార్పు కొట్టొచ్చినట్టు

కనిపించింది. నేనింకా తన ఊహల్లో ఉన్న నేనేనేమో కానీ తను మాత్రం నాఊహల్లో ఉన్ననాటి తను కాదు!

మరో ఉత్తరం తీసేను. అది నా 5వ ఫారం (10వ తరగతి)నాటి స్నేహితురాలు గత ఏడాది రాసిన ఉత్తరం. ఆనాటి మరొక క్లాస్మేటు అమెరికా వచ్చి, నా ఆచూకీ లాగి పట్టుకని, మాఇద్దరినీ మళ్ళీ జత కూర్చింది. ఆనాటి ఈశ్వరి మళ్లీ అదే స్థాయిలో "మల్లెపూవుల్లా పరిమళిస్తూ నీ ఉత్తరాలు ..." అన్న వాక్యం చూసి ముగ్ధురాలినయిపోయేను. తనకి కూడా మధురోహలు అలాగే ఉన్నాయన్నమాట అనుకోకుండా ఉండలేకపోయేను!

కొందరు "అమ్మలా" "అక్కలా" అనో "నేను మీకూతురిని అనుకున్నా కోడలిని అనుకున్నా మీఇష్టం" అనో తేలిగ్గా అనేవాళ్లని చాలామందినే చూసేను. ఈ చుట్టరికాలు కలుపుకోడం మనకే. నన్ను మాత్రం వాళ్ళు అలా అనుకోడానికి నేనేం చేసేను అన్న సందేహం పట్టి పీడిస్తుంది.

60వ దశకంలో పరిచయమైన స్నేహితురాలు రాసిన ఒక ఉత్తరంలో "మనిద్దరిమధ్య వయోబేధం అట్టే లేకపోయినా, అమ్మ లేదన్న వేదన మరిచిపోయేలా చేసేవు," అన్న వాక్యం చదువుతుంటే ఆ రోజుల్లో నేనేం చేసి ఉంటాను అని బుర్ర బద్దలు కొట్టుకున్నాను కానీ ఒక్క సందర్భం కూడా తోచలేదు. అది నాకు సాధ్యం అని నేను అనుకోలేనసలు. ఆ అమ్మాయికి అలాటి సాంత్వన కలగడానికి తనే ఆ పరిస్థితికి మానసికంగా సిద్ధమయి ఉందేమో. నేను ఆ సమయంలో అక్కడ ఉండడం కాకతాళీయం. ఇంగ్లీషులో దీన్నే "తగుసమయం తగుస్థానం" అంటారు. కాలం, ఖర్మం కలిసి రావడం అంటాం మనం. ఇదంతా నాకు మరింత ప్రస్ఫుటంగా ఎందుకు మనసులో మెదులుతోందంటే, ఆ అమ్మాయి అమెరికా వచ్చినప్పుడు, నాకు మెయిలిస్తే, నేను జవాబు ఇవ్వలేదు. ఇవ్వలేకపోయేను. ఎందుకంటే ఆ రోజుల్లో "అమ్మతనం" ప్రదర్శించే స్థితిలో లేను. నాకు తెలుసు మీరు దారుణం అంటారని. సాధారణంగా ప్రతివారూ ఆనాటి నేస్తాలకోసం ఆవురావురని ఎదురు చూస్తుంటారు కదా. మరి నాకెందుకు జవాబు ఇవ్వాలి అనిపించలేదు అంటే నా మానసికస్థితీ, సామాజికస్థాయి కూడా అంత అస్తవ్యస్తంగా మారిపోయేయి కనక.

నేనెంత మారిపోయేనో ఎత్తి చూపుతున్నాయి ఆ ఉత్తరాలు. ఒక జీవితకాలంలో 30, 40 ఏళ్ళు అంటే దాదాపు సగం జీవితకాలం అనుకోవచ్చు. నేను చాలా మారిపోయేను. ఆనాటి ప్రవృత్తి ఇప్పుడు నాకు లేదు. నాఅభిప్రాయాలు చాలా మారిపోయాయి. నిజానికి ఒకరకంగా మొద్దు బారిపోయేనేమో కూడా. ఒకొక ఉత్తరం చదివి పక్కన పెట్టేసేను. నాలో ఏ స్పందనా లేదు సరి కదా చాలామంది చెప్పేలా, "చలించిపోయేను, మనసు ఆర్ద్రమయింది" అని కూడా అనిపించలేదు. నిర్లిప్తతతోనే చదివేను. ఇంకా ఏ దాపరికాలూ డొంకతిరుగుళ్ళూ లేకుండా చెప్పాలంటే,

హాస్యాస్పదంగా కూడా అనిపించేయి. ఇంకొంచెంసేపు ఆలోచించేక, ఆనాటి స్వభావము అది. వారంతా వల్లమాలిన అభిమానాలు ప్రదర్శించేరు ఆ ఉత్తరాల్లో.

వాటికి నేనేం జవాబులు రాసేనో తెలీదు. ఇవి చూస్తుంటే పక్కన కూచుని సెల్ఫోనులో మాటాడేవారూ, పక్కన పడుకుని కలవరించేవాళ్లు తలపుకొచ్చేరు. అవతలివారు ఏం మాటాడుతున్నారో మనకి తెలీదు. వీరిమాటలనిబట్టి వారి మాటలు ఊహించుకోవాల్సిందే. ఇక్కడ ఐరనీ ఏమిటంటే నామాటలే నాకు తెలీదు. ఈఉత్తరాలు వారివ్యక్తిత్వాలని ఆవిష్కరిస్తున్నాయి. ఆ ఉత్తరాల్లో "నేను" నేను కానని నా అంతరాత్మ ఘోష పెట్టింది. ఇది మరో ఆలోచనకి దారి తీసింది.

గత పదేళ్ళలో నాకు పరిచయమైనవాళ్ళలో చాలామంది – ముఖ్యంగా నాబ్లాగుద్వారా పరిచయమైనవాళ్ళు – నాకు స్నేహబుద్ధి ఎక్కువే అనుకుంటారు. నన్ను అడిగితే అది సైబర్ స్నేహం సృష్టించే భ్రమ అంటాను. ఫేస్బుక్కు ప్రవేశించేక ఈ రీతి స్నేహాలు కొంచెం శృతి మించేయేమో అని కూడా అనిపించింది నాకైతే. ప్రధానంగా నీలితెరమాటున పుట్టి వృద్ధిపొందిన స్నేహాలు కనక వీటిలో ఊహాగానాలకి ఆస్కారం అనంతం మరియు అపారం.

చిన్నతనంలో ఏ అరిసెముక్కో అయిపోతుందేమోనన్న బెంగతో కొసరి కొసరి కొరుక్కు తింటారు పిల్లలు. అలాగే స్నేహాలూను – స్కూల్లో కలిసిన స్నేహితులు చదువయేక ఉద్యోగాలు వెతుక్కుంటూ మరో ఊరు పోతారేమో. పొరుగింటిఅబ్బాయి మరోయింటికి మారిపోయి దూరం అవుతాడేమో. ఆఫీసులో స్నేహితురాలు పెళ్ళి చేసుకు మరో ఊరు వెళ్లిపోతుందేమో అనుకుంటూ అనుక్షణం తపన పడిపోతారు. పెద్దయేక ఇవన్నీ సర్వసాధారణమే, ఈ స్నేహాలలో చాలా భాగం ఇలాగే ముగుస్తాయి అని గ్రహిస్తారు. ఆ భావనకి అలవాటు పడిపోతారు. నేను పడిపోయేను.

నా అమెరికను స్నేహాలు మరోరకంగా సాగేయి. సూక్ష్మంగా పట్టి చూస్తే, అలనాటి మిత్రత్వాలు మనసుని తాకేవి అయితే అమెరికనులతో స్నేహాలు మెదడుకి మేత పెట్టేవి అయేయి. విదేశీయులు మనవాళ్ళలా బంధుత్వాలు కలుపుకోరు. ఆత్మీయతలు వెల్లడించినా గజం దూరంలో నిలబడే. అమెరికనులకి నేనొక "స్టడీ." మన సంస్కృతిగురించి తెలుసుకోడానికి కోరిక గలవారే నాతో స్నేహం చేస్తారు. అలాటివారు నాకు ముగ్గురు బాగా దగ్గరయేరు. నేను విస్కాన్సిన్లో ఉన్నప్పుడు పరిచయం అయి, తరవాత ఊరు మారినా పరిచయం నిలుపుకుంటూనే వచ్చేరు ఉత్తరాలద్వారా.

(జులై 8, 2015)

# తోచీ తోచనమ్మ!

తోచీ తోచనమ్మ తోటికోడలి పుట్టింటికెళ్ళిందని సామెత.

వెనకటిరోజుల్లో ఇలా ఉండేవి కబుర్లు -

"పిన్నీ, ఏం చేస్తున్నావు?"

"ఏం లేదు. ఏం తోచక అలా సీతమ్మక్కఇంటికెళ్దామా అని ఆలోచిస్తున్నా. ఇంతలో నువ్వొచ్చేవు."

"బావుంది. నేనూ తోచకే ఇలా వొచ్చేను,."

లేకపోతే,

"ఏరా, ఇలా వచ్చేవు, నేనే అనుకుంటున్నా మీయింటివేపెళ్దాంవని."

"తోచక వచ్చేను. సినిమాకెళ్దాం, వస్తావేమిటి?"

"సినిమాకెందుకులెద్దూ, అలా బీచికెళ్దాం, కాస్సేపు కబుర్లు చెప్పుకోవచ్చు"

అదీ కాకపోతే,

"పద, నాకూ తోచడం లేదు. సినిమాలన్నీ చూడ్డం అయిపోయింది కదా ఇప్పటికే రెండుమార్లు, పద కామేశ్వరికెంటికెళ్దాం."

"ఇప్పుడక్కడికెందుకూ?"

"ఏం లేదు. వాళ్ళక్కయ్య ఖరగ్పూర్ నించి వచ్చిందిట పండక్కి. (లేకపోతే పురిటికి). చాల్రోజులయింది చూసి."

ఇలా ఉండేవి కబుర్లూ, కాలక్షేపాలూ అప్పట్లో. ఇప్పుడసలు తోచలేదన్నమాటే వినిపించదు, ఖర్మ. ఎక్కడ చూసినా రోజుకి ముప్పైయారు గంటలుంటే బాగుండనేవాళ్ళే కానీ, అబ్బ ఇంత తీరక, చెయ్యడానికి పనేం లేక తోచక ఛస్తున్నా అన్నవాళ్లు కనిపించరు. ఈ టీవీలూ, ఐపాడులు లేనిరోజుల్లో ఏం చేసేవారో అని అంటూ అక్కులు నొక్కుకునే వాళ్ళే ఎక్కువిప్పుడు, మ్ ... ఏమో బాబూ, నామటుకు నాకు ఏ పనీ లేకపోతే, ఏదో కల్పించుకుని పొద్దు పుచ్చుకునేస్తాను. మరీ అంత 36 గంటలు అఖ్ఖర్లేదు కానీ 24 గంటలుంటే నేను సణక్కుండా గడిపీగల్ను. ఎలా అంటావూ ...

ఏమో, చెప్తే నువ్వు నవ్వుతావు, లేదా విసుక్కుంటావు నామొహంలా ఉందని.... ... సరే, నువ్వు అంత మొహమాట పెడుతున్నావు కనక చెప్పక తప్పదు. నువ్వన్నట్టు నిజంగానే ఈమధ్య ... మూణ్ణాలుగు నెలలయినట్టుంది ... ... మరీ బతుకు నిస్సారం అనిపిస్తోంది. అబ్బ, పొద్దెప్పుడు పోతుంది బాబూ, ఎప్పుడు మంచమెక్కడం అంటూ ప్రాణం గుబగుబలాడుతోంది.

వెనకటిరోజుల్లోలా గబుక్కున ఇరుగింటికో పొరిగింటికో పోయే సౌఖ్యాలు ఇప్పుడేవీ? మామూలుగా మీఅందరిలా ఏ స్నేహితుల్నో చుట్టాల్లో పక్కాల్నో ఫోనులో పిలిచి మాటాడలేను మరి. ఎందుకంటావా, ఏమో … అసలు నాకెప్పుడూ అశ్చర్యంగానే ఉంటుంది ఏముంటాయి మాటాడ్డానికంతసేపు అనీ. అంతెందుకూ, నిన్నే పిలుద్దాం అనుకుంటాననుకో పొద్దున్నే మొదలు పెడతా అలా అనుకోడం. ఇప్పుడు కాఫీలవేళేమో, ఇప్పుడు పిల్లల్ని స్కూలికి పంపేవేళేమో, ఇప్పుడు పడుకుంటుందేమో, మళ్ళీ వంట చేసుకుంటోందేమో … పోనీ, రాజుని పిలుద్దాం అనుకుంటే ఏదో కుర్రాడు పనిలో ఉంటాడు, లేదా తన సాటికుర్రాళ్ళతో కబుర్లు చెప్పుకుంటాడు … ఇలా ఎవర్ని పిలవాలనుకున్నా వాళ్ళపనులు వాళ్లకుంటాయి, వాళ్లనెందుకు ఇబ్బంది పెట్టడం అనిపిస్తుంది. వాళ్ళు నన్ను పిలవరా అంటావేమో … పిలుస్తారు, కాని వాళ్ళకి వీలయినప్పుడు పిలుస్తారు కద, నేనంటే ఏ పనీ పాటూ లేకుండా ఉన్నాను కనక నన్నెప్పుడు పిలిచినా ఫరవాలేదు … అవుస్లే నీకు నవ్వుతాలుగానే ఉంటుంది. పోనీ, మాలుకెళ్ళొచ్చు కదా అంటావు, ఏముంది మాలులో, అవే బట్టలూ, అవే జోళ్ళూ, ఆ మనుషులూ … ఏ షాపులోనూ పట్టుమని పదిమంది కనిపించరు కొనేవాళ్ళు. మరి వాళ్ళకి ఎలా చెల్లుతాయో ఆ సరుకులు, వాళ్ళకి ఆదాయం ఎలాగో …

ఎందుకొచ్చిన గొడవలివన్నీ, నాగూట్లోనే ఏదో ఓ పని పెట్టుకు, చేసుకుంటే పోలే అనుకుని మన దేశవాళీ దుకాణానికెళ్ళి తాజా కూరలు గంపెడు కొనుక్కొచ్చేసేను పది రోజులకిందట. మరి అవన్నీ తినలేను కదా. అంచేత చక్కగా కడిగి, ఆరబెట్టి, చెక్కు తీసి, ముక్కలు కోసి … ఇలా కాలక్షేపం చేసేను. ఆ తరవాత వాటిని ప్లాస్టిక్ సంచులలో జాగ్రత్త చేసి, ఆసంచీ చేత్తో ఒత్తుతూ గాలి బయటికి తోసేసి, జిప్పేసి, ఫ్రీజరులో పడేసేను. అదుగో, చూసేవా, ఎందుకంత శ్రమ, వాళ్ళే చక్కగా ఫ్రీజు చేసి, అమ్ముతున్నారు కదా అంటావు.

చెప్తాను ఎందుకంటే – మొన్న అదేలే నెల్రోజులయినట్టుంది గోపాలంగారొస్తున్నారని బజారుకెళ్ళి చూస్తుంటే ఆ ఫ్రోజెన్ ములక్కాడ ముక్కలు కనిపించేయి. ఆఁ, ఆఁ, తారీకులు చూసుకునే కొన్నాను. మనసరుకులకి మామూలుగా అన్ని పేకెట్లమీదా ఉండదు కానీ ఆరోజు ఆ ములక్కాడ పేకెట్టుమీద మాత్రం జనవరి 2014 లోపున వాడేసుకోమని తారీకు కూడా ఇచ్చేడు. నేనెంతో మురిసిపోతూ ఇంటికి తెచ్చుకుని, సాంబారుకి కావలసిన సంభారాలన్నీ కూర్చుకుని, ఈ ముక్కలు ఉడకబెట్టబోతే, అడక్కు, నామొహంలా, అక్షరాలా నామొహంలాగే ఉన్నాయి. నామొహం అని ఎందుకంటున్నానా? వాటిక్కూడా నామొహానికున్న వయసే ఉన్నట్టుంది, ఫ్రీజరులోనే ఎండిపోయేయి. అక్కడికీ ఆశ చావక, వాటిని ఉడకబెట్టి, సాంబారులో పడేసి, తినడానికి కూర్చుంటే, రామ రామ, మళ్లీ నాచిన్నప్పటిరోజులే జ్ఞాపకం వచ్చేయి. ఈసారి పెరట్లో ములగచెట్టు కాదు. వేపచెట్టు. నా చిన్నప్పుడు పళ్ళు తోముకోడం జ్ఞాపకం వచ్చింది.

నవ్వుతావేమిటి, నిజంగానే, నీకు తెలీదు మరి, ఆరోజుల్లో వేపపుల్లలు ఆరోగ్యం అని అప్పటికప్పుడు వేపచెట్టు కొమ్మ నమిలి, కుంచె చేసుకుని, దాంతో పళ్ళు తోముకునేవాళ్లం. అచ్చంగా అలాగే అనిపించిందనుకో ఈ ములక్కాడలు నముల్తుంటే. ఒక ముక్కయితే చేదు కూడా తగిలింది నాలుక్కి!! అంచేత, రెండిందాలా కలిసొస్తుంది, అటు పొద్దు పోతుంది, ఇటు తాజా కూరా అని నేనే వేసుకుంటున్నాను మంచు పాతర.

ఇంతకీ ఇవాళేమయిందనుకున్నావు … అసలు ఈపాతరలేసుకోడం వచ్చేక, తెల్లారి లేస్తూనే, రాత్రికి ఏం కూర చేసుకుందామా అని ఆలో చించి, నాఫ్రీజరులో ఏమున్నాయో నెమరేసుకుని, తరవాత మిగతా పనులు చేసుకోడం కూడా నారోజువారీ పని అయిపోయింది. ఇవాళ కూడా అలాగే తిథివారనక్షత్రాలు చూసుకుని, ఈ దినము బూడిద గుమ్మడికాయ ముక్కలకి సుదినము అనుకుంటూ ఫ్రీజరు తెరిచేను. తీరా చూస్తే, నాలుగు సంచుల్లో ఏది బూడిదగుమ్మడో తెలీలేదు. ఇంత చాకిరీ చేసినదానివి ఆ సంచులమీద పేర్లు రాసిపెట్టుకోలేదూ అని అడక్కు. నిజానికి ఇక్కడ ప్లాస్టిక్ డబ్బాలమీద తేదీ అని ముద్రలేసేస్తారని కూడా నాకు తెలుసులే. …అవునవునవునవును. … నాక్కూడా తెలుసు ఆ సంగతి. ఏం చెయ్యను, హుమ్, నా నిర్మాణక్రియాశీలతలో లోపం అది. మరియు ఇంకో అవునవునవునవునవు… హాయిగా మంచుపాతరేసినవే కొనుక్కుంటే సరి అంటూ మళ్ళీ మొదలెట్టకు కచేరీ. బాగులేకపోతే పారేసి, మళ్ళీ కొనుక్కోవచ్చు కదా … అవునవునవునవునవును …

కాదు, కాదు, అన్నీ కాదులే. కాకరకాయ ముక్కలూ, బెండకాయముక్కలూ స్పష్టంగానే తెలుస్తాయి. కానీ బూడిదగుమ్మడికాయా, సొరకాయా, బెంగుళూరు వంకాయా, ఇవన్నీ ఒక్కలాగే ఉంటాయి కదా. ఏ కూరయితేనేమిటి, పోపేసి, ఉప్పూ, కారం చల్లేస్తే సరి, ఏ కూరయినా, ఏకసూత్రం అంటుంది మా అక్కయ్య కానీ నాకలా కాదు. బూడిద గుమ్మడికాయ అయితే అవియల్, బొప్పాయికాయయితే పోపేసి, నువ్వులపొడి, సొరకాయయితే ఆవ పెట్టి చెయ్యకపోతే నాకసలు అది కూరే కాదు. ఇన్ని పద్ధతులు నీకే చెల్లు అని సుందరి నన్ను హేళన చేస్తుంది. అవును మరి, ఆవిడగారికి ఆపీసులో పని, ఇంట్లో స్కూళ్ళకెళ్ళే పిల్లలు, నెలకి ఇరవై రోజులు ఊళ్ళంట తిరిగే ఇంటాయనా, వారం వారం వచ్చే పోయే చుట్టాలూ… ఆవిడకెక్కడ తీర్తుంది ఇలాటి ఎంపుళ్ళకి. ఉహుఃహుః. చిక్కదు. కానీ దానిక్కారణం నేను కాదు కద, నన్నానేం లాభం. కావలిస్తే ఉద్యోగం మానేసుకోమను. ఉద్యోగం మానేయడం సులువే కానీ  పిల్లలెక్కడికి పోతారు? వాళ్ళు పుట్టకముందయితే అదో దారి. ప్చ్.

పిల్లలంటే గుర్తొస్తోంది ఈమధ్య టీవీ చూడ్డం కూడా దుర్భరంవయిపోతోంది ఈ ఎన్నికల మేళంతో. చెప్పుకోడానికి సుప్రసిద్ధ యూనివర్సిటీల్లో పెద్ద చదువులు చదువుకున్నాం అంటూ డంబాలు పోతారు. తమలాటి మేధావులు మన నెత్తిమీద దేవతలు, అదేలే నాయకులు అవడం

మనం చేసుకున్న పుణ్యం అన్నట్టు కబుర్లు చెప్తారు, తీరా వాళ్లు వెలిబుచ్చే ఒక్కొక్క అభిప్రాయం వింటే, వీళ్ళా మనల్ని ఉద్ధరించేది అని ఏడవాలనిపిస్తోంది. చూసేవా ఆడాళ్లబతుకులమీద వీళ్లు చేసే వ్యాఖ్యానాలు. వింటుంటే కడుపులో దేవినట్టుంటోంది నాకయితే. వీళ్లు ఏ స్కూల్లో చదువుకున్నారో … ఆడమనిషిమీద అత్యాచారం చేస్తే, ఆఆడమనిషి హాయిగా వెనక్కివాలి ఆనందించొచ్చు కదా అనేవాడొకడూ, రేప్ వల్ల పిల్లలు పుట్టడం సైంటిఫిగ్గా అసంభం అనేవాడు మరొకడూ… వీళ్లమెదళ్ళలో ఓ భాగం, బాగా పెద్ద భాగమే తొర్ర అయి ఉండాలి. వీళ్ళు నాయకులైతే ఆడాళ్లబతుకులు చెప్పఖ్ఖర్లేదు, పాతరాతియుగంపే మేలు. … వీళ్ళనించి మనని బ్రోచేవారెవరురా అని పాడుకోవాలి. పాపం, అమెరికాలో ఆడాళ్ళకి ఆ పాట కూడా రాదు కనక వీళ్ళని రక్షించేవాళ్ళు లేరన్నమాటే. ఖర్మ! వాళ్ళకి మిగిలింది పాట్లే…

తోచక పుస్తకాలు చూస్తే ఎప్పుడో మా అన్నయ్య పంపిన పతంజలి యోగసూత్రాలు కనిపించేయి. సరే, ఆయనేం అంటారో చూద్దాంవని తీసేను. అథో బ్రహ్మ జిజ్ఞాసా! హాహా. తత్త్వజిజ్ఞాస అని కాదు కానీ అంత చిన్న వాక్యాలు చూడగానే చదవగలిగినందుకూ, అంత చిన్నవాక్యంలో అంత అర్థం సాగదీసి ఆయనెవరో వివరించినందుకూ. అల్పాక్షరం అనల్పార్థం అంటారు కదా. పతంజలికి ఈవిషయం చక్కగా అవగతమయినట్టుంది. ఆ చిన్న వాక్యంలో నర్మగర్భంగా మనం ఆలోచించుకోడానికి కావలసినది చాలా ఉన్నట్టుంది. యోగాసనాలమాట ఎలా ఉన్నా నిత్యజీవితంలో పనికొచ్చేవి కూడా చాలానే ఉన్నాయి. నాకిలాటివి నచ్చుతాయి. పైగా ఇలాటి చిన్నవాక్యాలు మననం చేసుకుంటే మనసులోకి వస్తున్న దుష్ట ఆలోచనలు పక్కకి తప్పుకోడం జరుగుతుంది కదా. అదే అంటున్నా. దేవుళ్ళూ, దెయ్యాలూ నమ్మకాలున్నా, లేకున్నా, మనకి కలిగే కోపాలూ, తాపాలూ, కక్షలూ, కార్పణ్యాలూ వదిలించుకోడానికి ఇలాటివి ఉపయోగపడతాయి కద. చూడు, ప్రత్యక్షానుమానాగమః ప్రమాణాని – సరైన అవగాహన కలగాలంటే సరైన విశ్లేషణ, సరైన ఉదాహరణలు అవశ్యంట. ఇది మరి ఎవరికైనా ఉపయోగపడేదే కదా, ఆస్తికులా నాస్తికులా అన్నమాట లేకుండా. అనుభూతవిషయ అసంప్రమోషః స్మృతిః అంటే జ్ఞాపకం అంటే అనుభవపూర్వకమైన వస్తురూపం. వితర్కబాధనే ప్రతిపక్షభావనమ్ – సందేహాలమూలంగా మనస్తాపం కలిగినప్పుడు, ప్రతిపక్షభావన, అవతలివేపునుండి ఆలోచించడం అవసరం అంటారు. ఇది ఎవరికైనా ఆలోచించదగ్గ భావనే కదా. ఎదటివారు ఎందుకలా ప్రవర్తించేరు అని ఆలోచిస్తే, మన మనస్తాపాలు చాలామటుకు తొలగిపోతాయి. … అదేమిటి లేస్తున్నావు.. ఆఁ అప్పుడే మూడున్నరయిందా. … చూసుకోనేలేదు. అవున్లే పిల్లలు, మరిది గారు … టిఫిన్లు, కాఫీలు …ఈలోపున ఇంకా ఏవో పనులు … సరే పద, పద, మూడుగంటలసేపు ఇట్టే గడిచిపోయింది. మాటాడుకున్నట్టే లేదు. …

(ఆగస్టు 23, 2012)

## నన్ను నన్నుగా నిలబెట్టినవి!

గగనసీమలకెగసిన మహావృక్షం
దిగంతాలకు పరుచుకున్న మహార్ణవం
హృదయవైశాల్యాన్ని చాటుతున్న మేఘపథము
భూమిని కౌగలించుకు నిల్చిన పర్వతశ్రేణి
నాఅస్తిత్వానికి గురుతులయి శోభించేయి
ఉన్నచోట ఉన్నట్టు నన్ను నన్నుగా నిలబెట్టేయి.

(ఇవి మన అల్పత్వాన్ని గుర్తు చేస్తాయి అంటారు చాలామంది. కానీ ఇవన్నీ నాకు మరింత ధైర్యాన్ని, ఆత్మనిగ్రహాన్నీ, ఆత్మవిశ్వాసాన్ని కలిగిస్తాయి అంటాను నేను.)

(ఆగస్ట్ 20, 2021)

## నన్ను నేను చదువుకుంటున్నాను

నన్ను చదువుకుంటున్నాను.
జీవితం పంతులమ్మ కాదు
జీవితం వల్లించదు కాపీపుస్తకంలోని సుభాషితాలు.
ఋషులూ తాత్వికులూ బోధించిన పరమసత్యాలు తలకెక్కవు.
నేనిరుక్కున్న సంఘటనలు చదువుకుని తెలుసుకున్నాను
అందుకేనేమో నాతలపులు నాకు మాత్రమే అర్థమవుతాయి.

(నవంబరు 29, 2020)

## నేను నేనెలా అయేనంటే

నేను నేనెలా అయేనంటే
నేను నీలా అనుకోను కనక
నాకు మరణం అమంగళం కాదు కనక
నాకు నిరీహ సాధారణమనోవికలం అని తెలుసు కనక
నేనెక్కడుంటే అదే నాచోటు అనుకోగలను కనక
నాకు మెప్పులు కాదు, విషయవిస్తరణే ముఖ్యం కనక
నీమాటలో నేను కొత్తగా తెలుసుకోగలది ఏమని చూస్తాను కనక
నువ్వేం చెప్పేవో తర్కించి చూసుకుంటాను కానీ

నీకు నేనేమి చెప్పగలనా అనుకుంటూ  అహంకరించను కనక
నాతెలుగుఆలోచనలకి మద్దతుగా ఆంగ్లపండిట్సుని ఆరువు తెచ్చుకోను కనక
నేను నేనయేను. నేను నేనుగా విడిగా నిలబడిపోయేను.
నన్ను నేను నమ్ముతాను.
నన్ను నేను గౌరవించుకుంటాను.

(ఆగస్ట్ 14, 2023)

## పుష్పం సమర్పయామి

ఆవాకిలి నాది కాదు
ఆ మాలిని నేను కాను
ఆ సుమశోభలు నారచనాచమత్కృతి కాదు.
అయినా అనుకుంటాను
పుష్పం సమర్పయామి అని

(నా నిత్యసంచారంలో కనిపించే పూవులగురించి అనుకున్న మాట)

(మే 8, 2019)

## మొత్తం నూటఅయిదు!

గ్రహస్థానాలూ జన్మనక్షత్రం లెక్కలు గట్టి ఎంతకాలం జీవిస్తానో చెప్పే రోజులు తరించేయి. ఇన్సూరెన్స్ కంపెనీలూ, సాంకేతిక సాఫ్టువేరూ చెప్పగలవిప్పుడు. వారి ప్రశ్నలు ఇలా ఉంటాయి.

రోజుకి ఎన్ని సిగరెట్లు తగలేస్తావు?

అస్సలు కాల్చను.

ఎన్ని డ్రింకులు?

అస్సలు తాగను.

నీకారులో ఎంతమందిని ఎక్కించుకుంటావు, ఒకరా, ఇద్దరా?

సున్నామందిని.

నీఆయుర్దాయం నూటఅయిదు.

ఓహో అనుకుని నేను నా లెక్కలు మొదలు పెట్టేను. 105 అంటే మరో 22ఏళ్ళమాట (2020లో). అంటే అప్పటికి నేను రోజుకి ఒక టపా చొప్పున 8,280 టపాలు కనీసం రాయాలి Facebookలో.

ఇవాళా రేపూ పుట్టినపిల్లలు కొత్తపాఠకులుగా నాపేజికి వస్తారు. వాళ్ళకి నచ్చినట్టు రాయాలి.

ఇంకా, నేను ఇప్పుడు ధరిస్తున్న బట్టలు మళ్ళీ కొత్తగా స్టైలులోకి వస్తాయి.

ప్రజలు రాజరికాన్ని నిష్పూచీగా అంగీకరిస్తారు. అప్పుడు రాజు, రాణీ అనరు. ప్రధానమంత్రి, అధ్యక్షుడూలాటి పేర్లయితే ఉంటాయి కానీ వాళ్ళు అనుభవించేదీ నడుచుకునేదీ కూడా చక్రవర్తులలాగే.

కులాలు అంతరిస్తాయి. వాటిస్థానంలో మూడు తరగతులు– ఉత్తమ, మధ్యమ, దిగువతరగతులు అంగీకరింపబడతాయి. వాటికి ఈమధ్యనే శంకుస్థాపనము బహు ఆడంబరమూగా జరిగింది.

తెలివితేటలంటే యంత్రాలనీ, మధ్యమ, దిగువతరగతి జనాలనీ వాడుకోగలతెలివి అన్న నిర్వచనం స్థిరపడుతుంది.

పిల్లలకి చదువులు పాఠశాలలనబడే భవనాల్లో కాక వీధుల్లోనూ బజారుల్లోనూ నేర్పబడతాయి.

కర్ణాటకసంగీతం అంటే హిప్పీగెంతులుగా ప్రజలు ఆమోదిస్తారు.

తెలుగంటే ఇంగ్లీషే అనీ, ఏదో ఒక మారుమూల ఇంగ్లీషుకి తెలుగు అన్న పదం రూపాంతరంగా వాడుతున్నారే తప్ప అది భాష కాదని అందరూ ఒప్పుకుంటారు. తెలుగు వేరే భాష కాదని ప్రభుత్వాలు ప్రకటిస్తాయి.

000

ఉలిక్కిపడ్డాను ఈ ఆలోచనలు ఎంత భయంకరం. నాఆయుర్దాయం పునః పరిశీలించుకోవాలి. లేదా లోకం మార్చేసే పద్ధతి కనిపెట్టాలి. 105 మాత్రం భయంకరం!

(నవంబరు 29, 2020)

## చిన్నినా 'జ్ఞ' కు శ్రీరామరక్ష!

నన్ను నేను కాపాడుకుంటున్నాను
శ్రేయోభిలాషుల అనవసరసలహాలనుండి
అర్థరహిత సానుభూతి సుడిగాలినుండి
మూసకట్టు భావాలవరదలనుండి
నోటిమాటకి పొసగని నుదుటి హాసరేఖలనుండి
నన్ను నేను కాపాడుకుంటున్నాను.

వాదాలే వేదాలై తమనమ్మకాలే బ్రహ్మసత్యాలు కాగ
హక్కురక్షణలంటూ కంఠశోషలతో
నాఅభిప్రాయాలను గౌరవించక నామీద ముద్రలేసే అజ్ఞానులనుండి
అసలువిషయానికి ఎసరు పెట్టి అక్షరదోషాలను మాత్రమె ఎంచేటి
మూషికమార్జాల గురువరులధాటినుండి
నన్ను నేను కాపాడుకుంటున్నాను.

చిన్నదానికి పెద్దపీట వేసి, సప్తవిధ అతిశయోక్తులతో
అందలాలెక్కించు వాఙ్మయదురంధురులనుండి
వినయమును అజ్ఞతగ నెంచు మిడిమిడి జ్ఞానులగీర్వాణమునుండి
నన్ను నేను కాపాడుకుంటున్నాను.

నన్ను నేను కాపాడుకుంటున్నాను
ఉద్ధరేదాత్మనాత్మానం ఆత్మానమవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధుః ఆత్మైవరిపురాత్మనః
అని నాకు నేనే బోధించుకుంటూ
నన్ను నేను కాపాడుకుంటున్నాను.

(ఆగస్టు 2, 2023)

## నాకలం

మనసుచీకటికోణాల్లో దాగిన "నేను" నాకలం.
ఎదురుపడి పలకలేని భావాలను ఒలికిస్తుంది
నోట వెలువడని వేదనను రూపిస్తుంది.
ఆప్తమిత్రమై అనునయిస్తుంది.
తెలిమబ్బులచాటున ఎనలేని మర్మాలు.
ఈ మొగ్గలు రేపటి రోజాలు
రాత్రినుంచి పగటికీ, పగటినుంచి రాత్రికీ
నిరంతరప్రయాణం.

(ఆగస్ట్ 6, 2021)

అజరామరం

చిట్టితల్లీ, గుర్తుందా?
నీకు ఎనిమిదేళ్లప్పుడు
"పని నేర్చుకో, నేనెల్లకాలం ఉంటానా," అంటే
నువ్వు "అవును ఎప్పుడూ ఉంటావు. నీకు మరణం లేదు" అన్నావు.
చిన్నగా నవ్వుకున్నాను.

నీకు పదహారేళ్ళప్పుడు
"కుట్లు నేర్చుకో, ఊడిన బొత్తాయైనా కుట్టుకోడం రావాలి" అంటే
"బొత్తాయి కుట్టడం వచ్చినవాడినే చేసుకుంటాను," అన్నావు.
నవ్వొచ్చింది నీతలపోతకి.

నాలుగు దశాబ్దాలు గడిచేయి. నువ్వే అన్నావు.
"నువ్వు అజరామరం కావాలి. అలా అవదని నాకు తెలుసు.
నువ్వు ఉన్నంతకాలం సుఖంగా ఆరోగ్యంగా ఉండేలా చూసుకుంటాను."

అమ్మలూ నామటుకు నాకు
అజరామరమై ఉన్నట్టే ఉంది ఇప్పటికే.
నాటిగీ మూడు స్టేషన్లు దాటిపోయినా
మొదటి స్టేషనులోనే పల్టీలు కొడుతున్నాయి నామనసూ మెదడూ.
నీతీరుతెన్నులు నాకు బ్రహ్మపదార్థం.
నీభాషా భావాలూ లీలగానైనా పొడగట్టవు నాబుద్ధికి.
నీలోకం నాకు పెరలోకం.
నాలోకంలో నాగూటిలో నేను
అజరామరమైన అక్షరమై అక్షరజీవినై
చెలగనా నీ చేతనలో కలకాలం!!

(ఆగస్ట్ 13, 2020)

## సాపత్యము

సాపత్యం ఉంది రామాయణకర్త్రి మొల్లతో నాకు
శ్రీకంఠమల్లీశునివరం మహారచయిత్రి మొల్లప్రజ్ఞకి మూలము
భారతి, ఆంధ్రపత్రిక, సాహితి మున్నగు పత్రికలు స్ఫూర్తి నాకు.
(కథలబడిలో నేర్చినది కాదని గ్రహించగలరు)
మొల్ల వరించెనట ఏకాంతము.
నేనున్నూ కోరుకున్నాను ఒంటిపాటు.
ఆమె వ్రాసెనట రామాయణము శ్రీకంఠమల్లీశుని ఆలయప్రాంగణమున ఏకాంతంలో.
నేను నాగూటిలో కూర్చుని రాసుకుపోతున్నాను కథలు, కబుర్లూ, తదితరాలూ
మొల్లరచనలను ఆనాటి రాజసభలలో పండితులు తిరస్కరించిరని కింవదంతి.
నారచనలను ఈనాటిపండితమ్మన్యులూ టెల్గూఅసోసినులూ(ASSN) గణుతించరు గదా.
కవయిత్రి రచించిన కావ్యము సార్వజనీనము, సార్వకాలీనము.
నారచనలకు మనికి నేను లింకులిచ్చుకుంటున్నంతకాలము.
సాపత్యము లేదు నిజానికి. ఊరికే సరదాకిది వ్రాయబడెను.

మార్చి 17, 2023

## స్వేచ్ఛ

ఏ నాలుకలు తల్లిభాష ఉచ్చరించలేవో
ఏ ప్రజలు పరభాషను మనఃపూర్వకంగా నెత్తికెత్తుకుంటారో
ఏ జనులు మాతృభాషను స్వేచ్ఛందంగా కలుషితం చేస్తారో
ఏ ప్రజలలో నా సంస్కృతి అన్న స్పృహ శూన్యమో
ఏ జాతికి ఎరువు తెచ్చుకున్నభావాలు శిరోధార్యమో
ఆ స్వేచ్ఛ స్వేచ్ఛ కాదు. ఆ స్వాతంత్ర్యంలో అర్థం లేదు.
ఆ స్వేచ్ఛ నాకొద్దు. ఆ స్వాతంత్ర్యదినం నాకు ఉత్సవదినం కాదు.
ఆ జాతి నాది కాదు. ఆ దేశం నాది కాదు.
నాదేశంలో నేను పరదేశీగానే ఉండిపోతాను.

(ఆగస్టు 14, 2021)

## దుఃఖం

నన్ను లోలోపలి చీకటిగుహలోకి లాక్కుపోతుంది
నాచూపుని గుండెలోతుల్లోకి మళ్ళిస్తుంది.
శ్రేయోభిలాషుల ఓదార్పుల్లా ఉక్కిరిబిక్కిరి చేస్తుంది
కుండపోతగా కురిసిన జడివానై, వెల్లువై
మూలమూలలా నక్కిన కల్మషాన్ని ప్రక్షాళిస్తుంది.
మబ్బు విడినఎండలా తేజోవంతమవుతుంది.
Phoenixలా బుగ్గిలోనించి ఉత్థానిస్తుంది.
విరిగిపడేముందు ఉత్తుంగతరంగంలా మళ్లీ పైకి లేస్తుంది.
దుఃఖానికి మించిన మందు లేదు మనోవికారాల ప్రక్షాళనకి.

## నా బోధివృక్షం

ఎన్నో ఏళ్ళగా ఈదారిని నడుస్తూనే ఉన్నా
ఎందుకో నిన్ననే నాకన్నుకానింది.
క్షణకాలం ఆగి పరీక్షగా చూడాలనిపించింది.
ఆ చెట్టునీడలో కూర్చోవాలనిపించింది నిష్కారణంగానే.
ఈ పేరు తెలీని వృక్షం నాకు
బోధివృక్షం కాగలదేమో అనుకుంటూ …
చేతిలో ఫోనువంక చూసేను.
మిరుమిట్లు గొలిపే వెలుగుతో
నారేపురేఖలను రేఖామాత్రం చేస్తూ ….
నామెదడులో శూన్యం పరుచుకుంది.
అనుమానం నివృత్తి అయిపోయినట్టే ఉంది.
సృష్టిలో ప్రతి తరువూ బోధివృక్షమే.

(సెప్టెంబరు 6, 2019)

## సంఘజీవి

సంఘమ్ శరణమ్ గచ్ఛామి
కుతర్కంతో
కువిమర్శలతో
కుళ్ళు భావాలతో
అసంబద్ధపు ప్రలాపాలతో
అర్థం పర్థం లేని వ్యాఖ్యానాలతో
వికటాట్టహాసాలతో
వినయపూర్వకం కాని అభ్యర్థనలతో
విసిగిపోతున్న వారి వేదనాలాపాలతో
విసిగించే వాచాలురతో
విరాట్ స్వరూపమై విజృంభించిన ఆ సంఘాన్నే ఆశ్రయించేను.
ఆ సంఘంలోనే నా ఉనికీ మనికీ.
ఆ సంఘమే నాకు రోజు వెళ్ళదీస్తున్నది.
ఆ సంఘమే నాకు ఉపశమనం
ఆ సంఘమే నాకు శ్రీరామరక్ష!

(జులై 18, 2021)

## కలలూ అలలూ

అదొక కలకలం.
పుట్టినప్పట్నుంచీ గిట్టేవరకూ ఒక ప్రయాణమైతే
ప్రతి స్టేషనులోనూ ఎక్కేజనం, దిగేజనం.
బతుకు సాగరమైతే
చేపట్టిన ప్రతి వ్యాపకం లేచి పడే అల.
గజమెత్తు లేచి విరిగిపడే ప్రతి అలా
మరో కలకి మార్గదర్శి.
నాలుగు అలలు విరిగి పడ్డాక
ఐదో కలకోసం నిరీక్షణ
కౌతుకం నిన్నటినుండీ రేపటివరకూ చిటపటలాడే నిప్పురవ్వ
బతుకు నిరతాగ్నిహోత్రం.

(జూన్ 15, 2019)

## ఆ కళ్ళే!!

పలకరిస్తాయి, కవ్విస్తాయి, నవ్విస్తాయి
రారమ్మంటూ మురిపిస్తాయి.
స్నేహరుచులు చిప్పిలుతాయి.
వెక్కిరిస్తాయి. ఉడికిస్తాయి, ఏడిపిస్తాయి,
ఎన్నెన్నో కతలు చెపుతాయి.
కలువలతో, పద్మాలతో, మీనాలతో పోలిక
కామాలూ, వామాలూ, విశాలాలు విశేషణాలతో విస్తరిస్తారు కవులు!
ఆ కళ్లే
ఇంతచిన్నవి, ఇంత లోతు
అంటూ నర్సులచేత నస పెట్టిస్తాయి.
ఏదో పేరు చెప్పి ఈ మందూ ఆ మందూ
వైద్యవిదులచేత చెప్పిస్తాయి.
కనిపించనిరోజులే మేలు.
పుస్తకాలు చదవలేదన్నబాధ లేదు
అక్షరదోషాలయావ లేదు.
దుమ్ము దులపాలన్న ఆలోచన లేదు.
అన్నంగిన్నెమసి వదల్లేదన్న జ్ఞానం లేదు.
ఫొటోలు కెమెరా చూసుకుంటుందిలే అన్న ధీమా.

(జులై 17, 2021)

## జ్ఞాపకాలు.

మరుపులూ జ్ఞాపకాలూ చిరుతరగలై తేల్తూంటాయి మానసాకాశంలో.
ఆ వెనక కలిగిన అనుభవాలతో స్వరూపాలు మార్చుకుంటూ పోతాయి.

000

## సత్యం

కొత్తగా పోయేదేమీ లేదని గ్రహించేక
నిజాలు చెప్పడం బహుతేలికయింది.

## నీఅనాదరణ చెప్పింది నిజం

నువ్వు నన్ను పొగిడినప్పుడు
అవును కాబోలు అనుకుని మురిసిపోయేను.
తిట్టిపోసినప్పుడు
పోనీలే మరేదో బాధ అనుకుని సమాధానపడ్డాను.
చూడనట్టు నాపక్కనించి పోతూన్నప్పుడు
తెలిసింది నీదృష్టిలో నేనేమిటో!
నా అస్తిత్వానికి విలువ కట్టిన షరాబు నీఅనాస్థ

000

## అక్షరస్థితి

చుక్కలు గీతలై, అక్షరాలై
పదాలై వాక్యాలై
పేరాగ్రాఫులై, పేజీలై
ఏరులై పరుగులు పెడుతున్నాయి..
మంది మీరినఇంట మజ్జిగలా
భావాలు జలధారలై
పలుచబడి పారుతూ పోతున్నాయి.
నల్దిక్కులా గాలివాటుగా కొట్టుకుపోతున్నాయి.
నేనేమి చెప్పబోయేనో నాకే తెలీలేదు.

000

## దస్తూరీతిలకం

భూర్జపత్రములనుండి
తాటాకులకెక్కి
కాగితాలధిష్ఠించి
కంప్యూటరులో ‘కీ’లుగా రూపొంది
దస్తూరి కుక్కలు చింపిన విస్తరయింది.

000

## వాగ్భూషణము

వాగ్భూషణమే సుభూషణము మర్త్యులకు.
కీబోర్డు వచ్చేక నావేళ్లకి తలకట్టూ, గుడి, గుడిదీర్ఘం తెలీకుండా పోయేయి.
“ఎంత బాగుందో” అని చెప్పబోతే, “వేలేయి చాలం”టూ ఇమోజీలు!
“అద్భుతం”, “మనోజ్ఞం” అంటూ నా ఉత్సాహం వెలిబుచ్చబోతే,
అంగుళంన్నర చదరంలో GIFలు గలగల్లాడేయి నన్నే అదరగొడుతూ.
అంతర్జాలం నాభాషనీ చేతివ్రాతనీ అవతారాలలోకి ముడిచేసింది!!
నాపదాలు నావి కాకుండా పోయేయి.
ముచ్చికిరీటాలూ, కాకిబంగారం ఆభరణాలయినట్టే.
నే మర్త్యుని గానో, గతకాలపు, వెలసిపోయిన జీర్ణ వస్త్రమునో!?

(జూన్ 8, 2022)

## అభిప్రాయాలు

లోకంలో అభిప్రాయాలు ఎన్నో లేవు.

చెప్పే వారినిబట్టీ, వారితీరునుబట్టీ
దూషణ భూషణ తిరస్కారాలు.
అభిప్రాయాలే కానీ భిన్నాభిప్రాయాలు లేవు.
ఉన్నవి వేరు వేరు అభిప్రాయాలు వేరు వేరు విషయాలమీద.
ప్రతి ఒక్కరికీ చెప్పడానికి చాలా ఉంటుంది.
నీమాటకీ వారిమాటకీ పొదన నాస్తి.
రామక్కా అంటే తామరాకా అన్నట్టు.
దరిమిలా
భిన్నాభిప్రాయాలు ప్రోత్సహించాలని
ఏకాగ్రీవంగా నిర్ణయించేరు సుప్రసిద్ధ పండితపరమేశ్వరులు.
ఒకొక అభిప్రాయమూ ఒకొక ద్వీపమయింది.
మొత్తం మానవవాళి ఒక అఖండ సత్త
అన్నభావం తుడిచిపెట్టుకుపోయింది సీదాగా.

## పిరికితనం

అష్టైశ్వర్యాలు గలవాడి ఆనందాన్ని
పిరికితనం హరించేస్తుంది.

000

## సాయం

సాయం ఒక వ్యవసాయం
అవుసరమైనవేళ అవుసరమైనది చేస్తే సాయం
సాయం చేయడమే ధ్యేయమయి
అయినవీ కానివీ చేసుకుపోవడం వ్యసనం.

000

## రుచులు

స్వగృహనుండి తెచ్చిన పిండివంటలు
ఇంటివంటలా ఉందని సంతోషం
ఇంటిపచ్చడి హోటలుపచ్చడిలా ఉండాలియ
ఇంటివంటలు ఇంటివంటల్లా ఉంటే అసంతృప్తి.
ఎంతసేపూ మరోలా ఉండాలన్న తాపత్రయమే.

000

## వాడేరా దైవము

ఒక మహా నాయకుడిని
ఒక మహా నటుడిని
ఒక మహా ప్రవక్తని
వాడేరా దైవము
అని ఆరాధించడం ప్రమాదం.
ఆమనిషిలో లోపాలను క్షమించి
అతడివల్ల జరుగుతున్న మంచిని మాత్రమే
చూస్తున్నాం అనుకోవడం.
నిజానికి జరుగుతున్నది ఆవ్యక్తిలోపాలను
మహోత్సాహంతో పూజించడం, పాటించడం.
ఇదే ప్రమాదం ఒక అమ్మనో అయ్యనో
వాడేరా దైవము అని ఆరాధించడంలో.

000

## ప్రజాస్వామ్య సర్కస్

నీతీ, నిజాయితీ, స్వలాభాలూ,
ఒకొకరి ఔన్నత్యాలూ, త్యాగాలూ
కుప్పగా కూలిపోయి ఏది ఏదో తెలీక
మనసు మొద్దు బారిపోయి
రాయిరప్పల్లో లేని రూపాలు వెతుక్కుంటూ
రోజులు  గడుపుకోడం మొదలయింది జనాలకు.
ఆ రాయీ రప్పని తప్పు పట్టకు.
నిశానీముద్రలు వేయగలవారు నాయకులై
అంతర్జాలం పారాయణగ్రంథమై
నవ్యనూతననాగరికత అలరారుతుంటే
ప్రజలు ఉత్తుత్తి "దినాలు" శాస్త్రోక్తంగా జరుపుకుంటుంటే
రాయీ రప్పా కలిగించే సాంత్వన అద్భుతం.

## విపులా చ పృథ్వీ?

చైనీస్ నూడుల్స్

ఇటాలియన్ pizza

ఫ్రెంచ్ వైన్

మెక్సికన్ టాకో

వర్ణక్రమం తిరగరాసిన బ్రిటిష్ ఇంగ్లీష్

శ్రీలంక బ్లౌజులు

తైవాన్ జోళ్ళు

జాపనీస్ కారు

హిందూ యోగా

ఇండియా మెదళ్ళు

లటీనో కూలీలు

తెల్లచర్మపు అడుగున ప్రవహిస్తున్న వివిధ రక్తస్పర్శలు

రెడ్ ఇండియన్ స్థావరాలను సంగ్రహించి

ఐరిష్ కాథలికులు వెలయించిన దేశం

అమందానందభరితులై అనుభవిస్తున్నారు అమెరికా ప్రజానీకం.

అపారపారావారాన్ని అధిగమించిన అహంకారమొక్కటే “స్వకీయం”!

ఇది అసలు సిసలు అమెరిక”నిజం”.

(సెప్టెంబర్ 5, 2016)

## స్వార్థం ఒక యోగం

ఇద్దరు వ్యక్తులు నాది నాది అంటూ కొట్టుకుంటే స్వార్థం
రెండు కూటాలు మాది మాది అంటూ
తన్నుకుంటే సామాజికన్యాయం.
కష్టజీవులకు అనుకూలచట్టాలు
భాగ్యవంతులపాలిట దుష్టచర్యలు
తమకి అనుకూలించిన చట్టాలు ఆనందదాయకం.
ప్రతికూలించిన పరమదుర్మార్గం.
దుష్టనాయకులంటూ వేరే లేరు.
ఎవరిదృష్టిలో ఏకారణంగా అన్నదే దుష్టనాయకునికి నిర్వచనం.
తమఆస్తి రక్షించని నాయకుడు అధికారమదాంధుడు.
పరిరక్షించినవాడొక్కడే నిజమైన నాయకుడు.

(నవంబర్ 10, 2020)

## నోది

నోది సెపుతానమ్మ నోది సెపుతా
నీబతుకేటో సెపుతా
నీఊరేదో సెపుత
ఏ పుటోలు ఏడ తీస్తివో సెపుత
ఏమి తింటివో, ఏ షాపుల ఏమి కొంటివో సెపుత
నీఆనుపానులన్ని సెపుత
నీగుట్టుమట్టులు సక్కంగ వివరిస్త
నీకెవురెవురు ఎరికో
ఏ మందల కలిస్తె నీకేటి ఒరుగుతాదో
నోది సెపుత,
నీ జలమదినాలు రెండో మూడో ఇట్టె కనిపెట్టి సెపుత
నీబుక్తి యుక్తులు సక్కంగ ఇడమరిసి పలుకుత
నోది సెపుతానమ్మ నోది సెపుత

- బాగున్నాది తల్లో నీనోది, అవుతే మరి ఓ నోదిమ్మా!

మరి నా బందుగులమాట చెప్పవైతివి. అన్నదమ్ములు, ఆలుమగలు, అక్కసెల్లెళ్లు, వదినామరదళ్లు, తల్లిబిడ్డలు ఆనవాలు గట్టవైతివేమి? అని ఆమె ప్రశ్నించగా,

నోదిమ్మ ఇట్లు వాక్రుచ్చెను, ఓ యమ్మ, ఎవురు ఎవురికేమైన నాకేమి ఒరిగేను, నీకేమి కలిగేను కొత్తంగ. వస్తారు పోతారు ఆరు, నిశ్చలముగ ఈడనుండేది నీవు, నేను అని.

ooo

(ఫలశృతి: ఇలాటి నోది నిత్యం వల్లిస్తూ జకర్బర్గ్ ఈఏడు (2020) "$23,415,973 సంపాదించేడు" అన్న వార్త స్ఫూర్తి ఈ నోదికి. ఉచిత లంచ్ (no such thing as free lunch) అనునది లేదు అని అమెరికన్ నానుడి.

తా.క. ఈ ఏడు, 2023, జుకర్బర్గ్ ఆదాయం 107 బిలియన్లు. ఇది ఉదారంగా వేదిక ఏర్పాటు చేసినట్టు కనిపిస్తూనే కోట్లు సంపాదించుకునే అమెరికన్ తెలివి.)

(సెప్టెంబరు 13, 2020)

## అంతర్జాలంలో స్థితప్రజ్ఞ

రాసినది పోస్టు చేయకుండా నిగ్రహించుకోగలవాడు

పోస్టు చదువకనే వ్యాఖ్య రాయాలన్న కుతిని ఆకట్టుకోగలవాడు

వ్యాఖ్యలు చూచి చలించనివాడు

ఖాతా deactivate చేసి తిరిగి చూడనివాడు

ఖాతా నిశ్చింతగా మూసివేయగలవాడు

పొసగనిచోట పొరలివచ్చు ఆంగ్లపదాలను ఆచి పట్టి ఆపుకొనగలవాడు

000

## టపాల కతలు

ప్రతి టపావెనక మరో టపాకాయ ఉంటుంది

తెలిసినవారు వ్యాఖ్యానిస్తారు.

తెలీనివారు వేలిముద్ర వేస్తారు.

తదితరులు మౌనంగా తప్పుకుంటారు.

000

## జాలమైత్రి అగమ్యగోచరము

"ఫ్రెండు"ల రాకపోకలు నిత్యనైమిత్తికాలు.

వచ్చేపోయే జనాలతో కిక్కిరిసిన రైల్వే స్టేషను.

టపా పోస్టు చేసి అప్పిస్తాం

వేలిముద్ర వేసి అప్పు తీర్చుకుంటాం.

ఎవరేమి ఇస్తారో ఎందుకిస్తారో అడగరాని ప్రశ్న

వర్చువల్ స్నేహం మాయామేయం.

000

## జాలపంచాంగము

ఉదయం ఆరునుండి తొమ్మిదివరకూ విశేషచూపులు

సాయంత్రము సాధారణము, వ్యాఖ్యలు అంతంతమాత్రము

పశ్చిమదిక్కున బెలూనులు ప్రేలును

తూర్పున వాగేశ్వరులకు** రాజభోగము

ఉత్తరదిశ వరదలు, దక్షిణదిశ భూకంపము

సాహితీక్షేత్రమున ప్రేమలేఖలు సుభిక్షమై చెల్లు.

అనామకులకూ, అథములకూ పూజలు పుష్కలము, క్రియ శూన్యము

సాధుమతులకు నామమాత్రము.

సాంకేతికవిద్య విజృంభించి చరిత్ర తిరగరాయబడును

చిత్రములు, సౌంజ్ఞలతో సంభాషణలు సాగును

మొత్తంమీద ఏయేడు కృత్రిమరాసివారికి రాజపూజ్యము తొమ్మిది, అవమానము నిండుసున్న

మాటకారులకు బృహస్పతి ఉచ్చదశలో ఉన్నాడు, సౌజన్యమూర్తులకు శనియోగము

తదితరులకు సందిగ్ధము.

సర్వే జనాః సుఖినో భవంతు.

000

**వాగేశ్వరులు – బడబడ వాగేవారికి ఈశ్వరులవంటివారు.

ఫిబ్రవరి 13, 2023

## వడ్డించిన విస్తరి

జాలవీధి వడ్డించినవిస్తరి

సాంకేతికనిపుణులు వడ్డిస్తున్నారు

వారు వడ్డించినది మనకి మహాప్రసాదం.

అందిపుచ్చుకోడం మహద్భాగ్యం.

అయ్యరుహోటలులో ఛీజ్ బర్గరు దొరకదు.

సీతమ్మధారసంతలో చెరుకుపానకమే గానీ స్కాచ్ విస్కీ దొరకదు.

ఇలాటప్పుడే విధివిలాసంమీద తిరుగులేని నమ్మకం కుదుర్తుంది.

# గుర్తుందా?

ఎవరికి ఏమీ జ్ఞాపకం ఉంటాయో ఆలోచిస్తే ఆశ్చర్యంగా ఉంటుంది.

సాయంత్రం ఆఫీసునించి వచ్చేటప్పుడు పాలు తీసుకురమ్మంటే మరిచిపోయేవారికి లెక్క లేదు.

రేపిచ్చేస్తాను పది రూపాయలప్పియ్యి అన్నాక, ఆ రేపు రాని రోజులెన్నో. అడిగితే, అయ్యో మరిచిపోయేను, రేపు పువ్వుల్లో పెట్టి మీఇంటికి తేనూ అంటూ దీర్ఘాలు తీసే పెద్దమనిషికి మళ్లీ ఆ రేపు రాదు.

"ఈజీగా అందరూ అనేస్తారు" కానీ "తేలిగ్గా" గుర్తు రాదు ఆ సమయానికి.

ఇహ బెస్టూ, వేస్టూ తలుచుకోడమే బెస్టు వేస్టు.

నేను పుట్టినరోజు జరుపుకోను కానీ పని గట్టుకు నాకు గుర్తు చేసేవారు - మొదట నావీలునామా రాసినవాడు.

తరవాత, నా పెన్షన్ ఖాతా నిర్వాహకుడు

మరియు, డాక్టర్లు. ఇక్కడ బహువచనమే వాడాలి. నాకున్నది ఒక్కటే శరీరం గానీ

అందులో ప్రతి భాగం వేరు వేరు వైద్యశిఖామణుల ఆధ్వర్యంలో ఉంది.

ఇంతమందిని పోషిస్తున్నానా నా అణాకానీ ఆదాయంతోనూ అని నాకే ఆశ్చర్యం.

ఆఖరికే అయినా అతిముఖ్యమైన అవ్యక్తరూపాన్ని తలుచుకోక తప్పదు.

అదే ముఖపుస్తకము. ఇది నాపుట్టినరోజే కాక ఏమి ఎప్పుడు రాసేనో కూడా గుర్తు పెట్టుకుని నాకు గుర్తు చేస్తూ ఉంటుంది.

ఇంతమంది అపరిచితులు నామీద కన్నేసి ఉంచేరు. ఇది మహరాజభోగము కాదా!!!

000

## విపర్యయము (కవిత)

జీవితంలో దీర్ఘకాలికప్రణాళికలు లేవు.
వేసుకున్న ప్లానులన్నీ ఏపూటకాపూటే ముగుస్తాయి
సమాజంతో తెగతెంపులు చేసుకోవాలనుకున్న నిర్ణయం
ఒక్కరోజు అనుభవంతో హతం.
ఏ బలహీనక్షణంలో ఇంటికి రానిచ్చిన ఏదో వాద ఘనాపాఠీ రచయిత్రి
నిజస్వరూపం ఆవిష్కరిస్తుంది
నాఆస్తీ అంతస్తులఅంచనాలతో తన ఐశ్వర్యప్రదర్శనతో.
మర్నాడు మరో ప్రణాళిక మొదలవుతుంది.
సమాజం నడిబొడ్డున వెలియునికి
బహుశా సూర్యాస్తమానంతో సమాప్తం.
నిజానికి నాదీర్ఘకాలికప్రణాళికలన్నీ ఒకరోజుతో ముగిసే కార్యక్రమాలే.

000

వెలియునికి -ఊరికి వెలుపల

విపర్యయము పదానికి నిఘంటువు వివరణ.

*తారుమారు : తెలుగు పర్యాయపద నిఘంటువు (జి.యన్.రెడ్డి) 1990*

అక(ట)(టా)వికటము, అడ్డదిడ్డము, అడ్డాదిడ్డి, అస్తవ్యస్తము, ఎటమడు(గు)(వు), క(క)(కా)పిక, కక్కరిబిక్కరి, గందరగోళము, గడబిడ, చిందరవందర, తడబాటు, తబ్బిబ్బు, తికమక, తిబిరి, మారుపాటు, విట(త)(తా)టము, విటతాటనము, **విపర్యయము**, విపర్యాసము, వీటతాటము, వీడుపాటు, వ్యత్యస్తము.

(జనవరి 29, 2023)

పోపులడబ్బా

మనిషి ఒక పోపులడబ్బా
ఆవాలు, మెంతులూ, జీలకర్రా, సింగినాదం
చిన్నచిన్న డబ్బీలలో.
అన్నీ కలబోసి వేయిస్తేనే పోపు.
పేర్లు పెడితే శాస్త్రం
ప్రయోగాలు పామరత్వం.
ప్రయోగాలు శాస్త్రాలయేక
పామరులప్రయోగాలలో అపభ్రంశాలఅన్వేషణ.
స్త్రీవాదం, తీవ్రవాదం, మితవాదం, భాషావాదం, భేషజాలవాదం
మానవతావాదంలో భాగాలని మరోవాదం
ఏదో ఒక ముద్ర ఆటోతుమీద వేసే అచ్చులా.
వాదాలకి అతీతం అంటే నేరం.
సమానత్వంకోసం పోరాటం
నాఆక్షేపణే పరిహాసాస్పదం..
తాతాచార్యులవారి ముద్ర భజం తప్పినా వీపు తప్పదు.
అప్పుడు అక్షరాలలో జీవించేను.
ఇప్పుడు వాదనలకు దాసోహం అనకపోతే
అయిపోహాలి అంతర్ధానం.
ఈనాటి సాహితీరంగం ఒక చదరంగం.

మార్చి 19, 2023

అరటిచెట్టు సమగ్రం, పరిపూర్ణం.

అరటిపూవు

అరటికాయ

అరటిపండు

అరిటాకు

అరటిమట్ట

అరటిదవ్వ

అరటిమూలంనుండి అరటిపిలకలు

అరటిచెట్టులో ప్రతి ఒక్కఅంగమూ ఉపయోగకరమే.

అరటిచెట్టులాటిదే కథ.
ఇతివృత్తం, పాత్రలు, సంభాషణలు, సంఘర్షణలు, సందేశాలు, జాతీయాలు, నుడికారాలు,
ప్రాంతీయాలు,కథకి మూలమైన మరోకథ, దాన్నిండి పుట్టుకొచ్చే మరోకథ ...
ఒకొకకోణానికీ ఒక ముద్దుపేరు. తమకోణమే వేదమంటారు. వాదమంటారు.
తాను మునిగింది గంగ. తాను వలచింది రంభ.

మార్చి 31, 2023

# ఎండాకాలం

చలికాలంలో వంటలు సుఖం.

వెచ్చగా పొయ్యిదగ్గర ఎంతసేపైనా నిలబడి ఎన్ని వంటలైనా చేసేస్తాను.

ఋతువు మారింది. ఎండలు పేలిపోతున్నాయి.

పళ్లెంలో గింజలు పోసి ఎండలో పెడితే పేలాలయిపోతున్నాయి.

నా దినచర్య మారింది.

కడిగినవే కగడుగుతూ తుడిచినవే తుడుస్తూ దులిపినవే దులుపుతూ కాలం గడుపుతాను.

సంచారసమయం మధ్యాహ్నంనించి తొలిసంజెకి మారుస్తాను.

ఉదయం 7 దాటితే స్కూలు పిల్లలు, 8 దాటితే కుక్కపిల్లలు

కుక్కపిల్లలు ఎవరివాకిట్లోనో తమకార్యం కానిస్తే, తమధర్మం నెరవేర్చే యజమానులని చూస్తూ,

వాడుముఖాలు పడ్డ పూలూ, చివుళ్ళని చూస్తూ విచారంగా ముందుకు సాగుతాను.

రబ్బరుగొట్టాలమర్చి మొక్కలకి నీళ్లు పెట్టిన యజమానులు నేలమాళిగలో స్థిరసైకిలుమీద

కండలు పెంచుకుంటుంటే అనిపిస్తుంది -

కాస్త బయటికి వచ్చి ఆ మొక్కలకి తామే నీళ్లు పోస్తే

గుండెబలంతోపాటు ఆహ్లాదం కూడా కదా అని.

ఇంటికొచ్చి, టివీ పెలిగిస్తే, ఎండలకంటే అన్యాయం.

గంటకూలీలు, దినభత్యాలకి పనిచేసేవారు ప్రకటించిన ఆందోళనకి

సీయీవోలూ నాయకులూ పెలిబుచ్చున కష్టాలూ, నిరసనలూ …

ఎందుకో నాకు సానుభూతి కలిగించవు.

నాదృష్టి అథోముఖంగా సాగుతుంది.

చెక్కపలకలమీద చిన్న నలుసులు కనిపిస్తాయి.

మళ్లీ తుడుపులూ, దులుపుళ్లలో పడతాను.

దివంగతులగూర్చి ఎవరేమంటున్నారో, దాన్నిబట్టి

నాసమయం వచ్చినప్పుడు నాగురించి ఏమంటారో ఆలోచిస్తూ

తుడుస్తూ, దులుపుతూ, ఆలోచిస్తూ సరిపుచ్చుకుంటాను.

000

నేలమాళిగ – basement

స్థిరసైకిలు – exercise bike

చెక్కపలకలు – hardwood floor.

## కావలెను

ఛాలెంజి కావలెను

వీధిలోకెళ్తే ప్రమాదమని

వీధిలోకి వెళ్లకమానము.

జులైలో వానలని తెలిసీ

వింబుల్డన్ జులైలోనె పెట్టుకుంటారు.

కిందటేడు కప్ నాదే కదా అని ఊరుకోడు ఆటగాడు

మళ్లీ రంగంలోకి దిగుతాడు.

చూసిచూసి కొట్టినబంతి గడిలో పడదు.

ఆట అంతటితో ఆగిపోదు.

మళ్లీ గెలవనేమో అనుకుని ఊరుకోడు ఆటగాడు

వానపడుతుందేమోనని ఆట ఏర్పాట్లు మానరు వింబుల్డన్ నేతలు

ఏమౌతుందోనని భయపడి ఆగిపోయిన ఎవరూ

ఏమీ సాధించిన దాఖలాలు లేవు చరిత్రలో.

పిరికివాడు మూలగదిలో ముడుచుకుపడుకుని

నిశ్శబ్దంగా, నిర్వీర్యుడై గతిస్తాడు.

విచ్చుకున్న కనుగవతో గోతిలోకి దూకడమే

ముందుకి నడిపించే శక్తి.

తనని తాను ఛాలెంజి చేసుకోడమే జీవసూత్రం.

జులై 19, 2023

## మా పదకోశం

తెలుగు తూలిక మొదలు పెట్టేక తెలుగుతనం నాకు పిచ్చిస్థాయిలోకి జారింది. తెలుగు ఇంగ్లీషు పదాలు కలిపేసి కొన్ని పదాలు సృష్టించేను. సరదాగా ఒక పదకోశం కూడా తయారు చేసేను. నాబ్లాగులో ఇంకా చాలా ఉండొచ్చు. ప్రస్తుతానికి కనిపించినవి ఇస్తున్నాను.

ఇవి శాశ్వతంగా భాషలో నిలిచిపోతాయని కాదు. అసలివి పండితులు అంగీకరించకపోవచ్చు కూడా.

ఇవి చాలామటుకు సందర్భానుసారం హాస్యానికో వ్యంగ్యానికో నాపోస్టులలో వాడినవి. అన్ని సమయాలలోనూ పనికి రావనుకుంటాను.

సర్వరేశ్వరులు - సర్వర్ అధినేతలు

నెట్చెలులు - నెట్‌లో పరిచయమైన స్నేహితులు.

నాన్యేకడమీకం - non-ఎకడమిక్ అని గానీ నా అన్య ఎకడమీకం అని గాని చెప్పొచ్చు.

అసాంకేతికులు - కీబోర్డుమీద చెయ్యేస్తే కంప్యూటరు విరిగిపోతుందేమోనని భయపడేవారు.

నసాంకేతికులు - అసాంకేతికులకి పండితులలాగాను, సాంకేతికులకి అపండితులుగానూ కనిపించేవారు, నస పెట్టే సాంకేతికులు అన్నమాట.

సా.వేరులు - సాఫ్టువేరు ఇంజినీర్లు

హా.వేరులు - హార్డువేరు ఇంజినీర్లు

అష్టకర్మావధానం - multi-tasking. మరో పేరు అనేకాగ్రత (ఏకాగ్రతకి ప్రతిగా)

సిస్టావధానం - Systemలను నిష్ఠగా పాటించడం

పెదరుశర్మ - Weather reporter.

ఇంగిలీకం - తెలుగులో ఇంగ్లీషు పదాలవాడకం, తెలుగూ ఇంగ్లీషూపదాలు కలిపి తయారు చేసిన మరోపదం.

ఇ-భిప్రాయాలు - జాలంలో వెలిబుచ్చిన అభిప్రాయాలు

మేలులాడుకొను - మెయిల్స్ లో మేలమాడుకొను

నెట్టవతారం - అంతర్జాలంలో కనిపించే అవతారం,

జాలాధీనం - జాలంలో ఎక్కడ ఎలా కనిపిస్తుందో తెలీని పరిస్థితి

మందపత్రాలు - mailing list

పేలిముద్రలు - likes

ఆమోదముద్రలు - కూడా likes

అనేకాగ్రత - Multitasking (ఏకాగ్రత కానిది)

తోకచుక్కలు - Comma

చెత్తభ్రమణం - Recycling

చెత్తక్షోభ - చెత్తభ్రమణంగురించి రాసినందువల్ల కలిగిన చిత్తక్షోభ

000

## సమీక్షలు

### శీలా సుభద్రాదేవి. **డా. పి. శ్రీదేవి (Monograph)**

సాహిత్య ఎకాడమీ ఆధ్వర్యంలో డా. పి. శ్రీదేవిగారి సాహిత్యవ్యాసంగం క్షుణ్ణంగా పరిశీలించి ప్రముఖ కవయిత్రీ రచయిత్రి శీలా సుభద్రాదేవి రచించిన పుస్తకం ఇది.

పి. శ్రీదేవి అంటే కాలాతీతవ్యక్తులు, కాలాతీతవ్యక్తులు అంటే పి. శ్రీదేవి అని తెలుగులోకంలో సుప్రసిద్ధం. కొంతమందికి ఆమె తెలుగు స్వతంత్రలో ఉపసంపాదకులుగా పని చేసేరని తెలిసిఉండొచ్చు. కానీ శ్రీదేవి చిన్నకథలు, కవితలు కూడా రాసేరనీ, విమర్శలు, సమీక్షలు కూడా ప్రచురించేరనీ, ఆమెకి చిత్రలేఖనంలో పరిచయం ఉందనీ తెలిసినవారు లేరేమో. ఉంటే చాలా తక్కువ అనుకోవాలి.

ఈ మోనోగ్రాఫులో లభ్యమైనంతవరకూ శ్రీదేవి జీవితచరిత్ర, తెలుగు సాహిత్యంలో వివిధశాఖలలో ఆమె చేసిన కృషిని సూక్ష్మదృష్టితో పరిశీలించి, విశ్లేషణాత్మకంగా వివరించేరు సుభద్రాదేవి. సుమారు పది సంవత్సరాలలో వృత్తిరీత్యా వైద్యరంగంలో పని చేస్తూనే సాహిత్యంలో ఇంత కృషి చేసేరా అని ఆశ్చర్యం కలుగుతుంది సుభద్రాదేవి సమకూర్చిన సమాచారం చూస్తే.

**కాలాతీతవ్యక్తులు** నవల 38 పేజీలలో విశ్లేషించేరు రచయిత్రి. ఇతివృత్తం, పాత్రచిత్రణ, ఆనాటి సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులనేపథ్యంలో శ్రీదేవి ఈనవలను ఎంత సమర్థవంతంగా నిర్వహించేరో గ్రంథస్థం చేయడం ఎంతైనా మెచ్చుకోదగ్గ విషయం. శ్రీదేవిగారి తాత్వికచింతనగురించిన విశ్లేషణ ప్రత్యేకంగా బాగుంది.

కవయిత్రి సుభద్రాదేవి శ్రీదేవి కవితలను సాటికవయిత్రిగా విశ్లేషించినతీరు మనసుకి హత్తుకునేలా ఉంది. అలాగే శ్రీదేవి ఉపసంపాదకురాలిగా పని చేస్తున్న రోజులలో చేసిన విమర్శలూ, సమీక్షలూ కూడా ప్రతిభావంతంగా చేసేరంటారు సుభద్రాదేవి.

తెలుగు సాహిత్యచరిత్రలో చెప్పుకోదగ్గ రచయిత్రి డా. పి. శ్రీదేవి. స్త్రీల సాహిత్యచరిత్ర, కాల్పనికసాహిత్యచరిత్రలలో ఆసక్తి గలవారు తప్పక చదవవలసిన పుస్తకం.

డా. పి. శ్రీదేవి. **కాలాతీతవ్యక్తులు నవల**. http://www.archive. org సౌజన్యంతో లింక్.

(అక్టోబరు 16, 2021)

## **శీలా సుభద్రాదేవి. కథారామంలో పూలతావులు** (వ్యాససంపుటి)

ఈ సంకలనంలో ఇరవైమూడు వ్యాసాలు, ఒక ఇంటర్వ్యూ ఉన్నాయి. వ్యాసకర్త్రి **నాదో చిన్నమాట** అంటూనే రెండు పెద్దవిషయాలే ప్రస్తావించేరు.

మొదటిది, నవలలు రాస్తేనే రచయితలా, ప్రతిభావంతమైన చిన్నకథలు రాసినవారిని ఎందుకు గమనంలోకి తీసుకోరు సంకలనకర్తలన్నది. ప్రధానంగా **తెలుగు కథ** 1910-2000, **వందేళ్లకథకి వందనాలు** వంటి సంకనలనాలలో ఎంపికగురించి ఈ ప్రశ్న. జాగ్రత్తగా పరిశీలించి చూడండి. ఈ సంకనాలలోనూ, ఇలాటి సంకలనాలలోనూ – అంటే తెలుగు సాహిత్యచరిత్రకి దర్పణాలుగా – సమకూర్చినప్పుడు తెలుగుకథలలోని వైవిధ్యం అంతా కనిపించదు. ఏదో ఒక కోణం- సాంఘికప్రయోజనంలాటిది- మాత్రమే దృష్టిలో పెట్టుకుని సంకలనం చేస్తే, ఆవిషయం పుస్తకంపేరులో తెలియాలి. **తెలుగుకథ 1910-2000, సాంఘికప్రయోజనం ఆవిష్కరించిన కథలు** అంటే వారి ధ్యేయం స్పష్టంగా తెలుస్తుంది. కానీ కేవలం **తెలుగుకథ, 1910-2000** అంటే ఆ కాలంలో మరేవిధమైన కథలూ లేవా అన్న సందేహం కలుగుతుంది. అలాగే నవలలు రాసిన ప్రముఖ రచయిత్రులకథలు రెండో మూడో తీసుకుంటే, చిన్నకథలు మాత్రమే రాసినవారిని నిర్లక్ష్యం చేసేరనే అనుకోవాలి. సుభద్రాదేవిగారి ప్రశ్న కేవలం కథలే రాసినా, అట్టే కథలు రాయకపోయినా, మంచి కథాలక్షణాలు కలిగిన కథలు ఈ సంకలనాలలో ఎందుకు చేర్చుకోలేదని.

రెండో అంశం సంకలనాలమాట అలా ఉండగా, అసలు తెలుగు కథాసాహిత్యానికి సారధ్యం వహించిన సాహితీవేత్తలు తమ ప్రస్తావనలలో- ఉపన్యాసాలలో, వ్యాసాలలో, విమర్శలలో, చర్చలలో- మంచి కథాలక్షణాలు కలిగిఉండీ స్త్రీలు రాసినకథలను నిర్లక్ష్యం చేస్తున్నారు. అనేకమంది రచయిత్రులకథలు ఈనాటి పాఠకులకు తెలియకుండా పోతున్నాయి, అంచేత ఈ వ్యాసరచన చేపట్టేనని చెప్పుకున్నారు వ్యాసకర్త్రి. ఈవిషయం ఈనాటి సాహిత్య అతిరథులూ, మహారథులూ ప్రత్యేకంగా గమనించాలి.

తెలుగుకథ చరిత్ర సమగ్రం కావాలంటే ఈ మరుగున పడిపోతున్న కథలు తప్పనిసరిగా ప్రస్తావించవలసిఉంది. ఒక మంచి ఉదాహరణ – రాచకొండ విశ్వనాథశాస్త్రిగారు మెచ్చుకున్న ఒక చిన్న కథ చెప్పుకోవచ్చు. ఆ కథపేరు **ఆ గదిలోనే**. రచయిత్రి యు. సత్యబాల సుశీలాదేవిగారు. ఒకే ఒకపేజీలో ఒక స్త్రీ జీవితచరిత్ర ఆవిష్కరించేరు రచయిత్రి. ఆవిడ రాసిన మరో ఆరు కథలు ఈరోజు కథానిలయంలో కనిపించేయి. అంతకుమించి ఆమెగురించిన వివరాలు ఎక్కడా దొరకలేదు. ఆ ఒక్క కథ గొప్పకథ. రావిశాస్త్రిగారు ప్రస్తావించకపోతే నాకు తెలిసేది కాదు.

సుభద్రాదేవి ఇరవైఇద్దరు రచయిత్రులకథలు ఉన్నాయి. మందరపు పద్మ లలిత విడిగా కూడా కథలు రాసేరు మందరపు పద్మ, మందరపు లలిత అన్నపేర్లతో. అలా చూస్తే, 23 రచయిత్రులు అనుకోవాలి. సుభద్రాదేవి ఈరచయిత్రులకథలు సేకరించి, వస్తుతత్వాన్ని పరిశీలించి చూచి, విమర్శనాత్మకంగా ఒకొక రచయిత్రికథలనూ పరిచయం చేసేరు. వ్యాసం చదివేక, పాఠకులకు ఆ రచయిత్రియొక్క భావజాలం విశదమవుతుంది. ఒకొక వ్యాసమూ సమగ్రం.

తెలుగుకథలు ఎక్కువగా చదివేవారికి కొందరిపేర్లు పరిచయం అయిఉండవచ్చు, కొందరిపేర్లు నామమాత్రంగా తెలియొచ్చు, మందరపు పద్మ, లలిత, వేదుల మీనాక్షీదేవి వంటివారి పేర్లు విని ఉండకపోవచ్చు.

మొత్తం సంకలనం అంతా చదివేక, స్త్రీల కథాసాహిత్యం మనకి తెలీనిది ఇంత ఉందా అని ఆశ్చర్యపోతాం. అందుకు సుభద్రాదేవిగారు ఈసంకలనంలో చేర్చిన రెండు వ్యాసాలు – రచయిత్రుల కథాసాహిత్యంలో వెనుకబాటుతనం ప్రభావం, రచయిత్రుల కథానికలలో భాషాపరిణామం – తోడ్పడతాయి.

సుభద్రాదేవిగారి లక్ష్యందృష్ట్యా ఆలోచిస్తే, ఇప్పటికే బహుళప్రాచుర్యం పొందిన, దాదాపు అన్ని సంకలనాలలోనూ కనిపిస్తున్న సీతాదేవి, కామేశ్వరివంటి రచయిత్రులని ఈసంకలనంలో చేర్చకుండా ఉంటే ప్రధానోద్దేశం మరింత పటిష్ఠంగా ద్యోతకమయేది అనే నాకు అనిపించింది,

సుభద్రాదేవిగారు చేపట్టిన ప్రణాళిక ఎంతైనా హర్షించదగ్గది, శ్రమతో కూడుకున్నది. ఆమేరకు శీలా సుభద్రాదేవిగారిని మెచ్చుకోకతప్పదు.

ఇలాటి సంకలనాలు ఇంకా ఇంకా రావాలి. వస్తాయనీ, సంకలనకర్తలు మరుగున పడిపోతున్న అనేకమంది రచయిత్రులనీ, వారికథలనీ వెలుగులోకి తీసుకురాగల ఆలోచనలు చేస్తారనీ ఆశిస్తున్నాను.

(జనవరి 2, 2021)

## చంద్రలత. దృశ్యాదృశ్యం నవల

ఇది సమీక్ష కాదు. చదువుతుంటే నాలో కలిగిన స్పందన మాత్రమే. ఆలోచనలు, సమీక్ష, పరిచయం అనకుండా స్పందన అనడానికి కారణం ఉంది. ఇటీవలికాలంలో నాలుగువందలపేజీల నవలని నాలుగురోజులలో నేను పూర్తి చేసింది ఇదొక్కటే. అంతగా నన్ను ఆకట్టుకుంది ఈనవల.

ఈనవలలో ఇతివృత్తం పర్యావరణరక్షణ. ఈవిషయమై చర్చలు ఈమధ్య విస్తృతంగా జరుగుతున్నాయి. టీవీలో వార్తలు వింటున్నాను కానీ పుస్తకాలు చదివే ఓపిక లేదు. ఈనవలలో కూడా సుదీర్ఘమైన ఉపన్యాసాలు ఉంటాయమో అనుకుంటూ మొదలు పెట్టేను కానీ, దానికి సంబంధించినవిషయాలు కథలో రచయిత్రి చొప్పించినతీరు మనోహరంగా ఉంది. కేవలం వస్తువుమీద నూటికి నూరుపాళ్లు దృష్టి ఉంచి రాసిన నవల ఇది.

నాకు పల్లెజీవితాగురించి ఏమీ తెలీదు. వారి ఆచారవ్యవహారాలూ, నుడికారం, తిళ్ళూ. తిప్పలూ అన్నీ నాకు కొత్తే. ఇతివృత్తంతోపాటు భాష అంటే పదాలూ, వాక్యనిర్మాణమూ – రచయిత్రి శైలి నన్ను ఆపకుండా చదివేలా చేసేయి.

మరోవిషయం – నవనాగరికత అంటే భారీ పరిశ్రమలస్థాయిలో అభివృద్ధిగానే ఇప్పుడు చెలామణి అవుతోంది. అయితే వాస్తవంలో జరిగేది – విస్తృతపరిధిలో భారీలెక్కలు వేసుకు చూసుకుంటారు గొప్ప గొప్ప చదువులు చదివినవారు. ఆసందడిలో సూక్ష్మవిషయాలు వారికళ్ళకి ఆనవు. వేలకొద్దీ లక్షలకొద్దీ ఒక వస్తువు ఉత్పత్తి చేస్తున్నప్పుడు, అవకతకవకగా తయారైన వస్తువులని ఏరిపారేస్తారు. మనుషులవిషయంలోనూ అంతే, తెలిసి కావచ్చు తెలియక కావచ్చు. జరిగేది మాత్రం అదే. యుద్ధంలో సైనికులలా, casualties.

పల్లె అభివృద్ధికోసం ఆనకట్టలు కట్టడం ఒక ప్రణాళికగా చేపట్టినవారికి ఆ పల్లెలొ ఒకొక రైతుజీవితం, ఒకొక రైతుకుటుంబం ఎంత ఘోరంగా తారుమారు కాగలదు అన్న ఆలోచన ఉండదు. తమప్రణాళికలోని అద్భుతమైన ఫలితాలే కనిపిస్తాయి. సాధారణంగా ఇలాటి నవల చేపట్టిన రచయితలు పక్కదారి పెట్టించడం కద్దు. దృష్టి అభివృద్ధిమీద ఉంచి, దేశానికి ఎంత మేలు కలుగుతోందో చెప్తారు. కీడువిషయం కూడా ఆ విస్తృతపరిధిలోనే అంచనాల వేస్తారు. దేశాభివృద్ధిని కాంక్షించినవారు సద్భావంతోనే వేసిన ప్రణాళికలూ, ప్రకృతిసహజమైన విపరీతాలతో కలిసి, ఒక్కజీవులబ్రతుకులని ఎలా ఛిన్నాభిన్నం చేసేయో ఈనవల చదివితే తెలుస్తుంది. నాకు కూడా ఇలాటి అభిప్రాయాలు ఉండడంచేత ఎంతో ఆసక్తిగా చదివేను.

ఈనవలలో కేశవ చివరకి సందిగ్ధావస్థ పడ్డది ఆ ఆలోచనతోనే. రచయిత్రి కథని ఆకొసకి తెచ్చినవిధానం చాలా బాగుంది.

పల్లెల్లో ఒకమనిషికీ మరోమనిషికీ, తండ్రీ కొడుక్కీ, అవ్వకీ మనుమరాలికీ, ఇరుగుకీ పొరుగుకీమధ్య ఉండే ఆప్యాయతలు మనసుకి నాటుకునేలా రాసేరు రచయిత్రి.

చివరిమాటగా, రచయిత్రి కొన్ని పదాలకి ఇచ్చిన అర్థాలు నన్ను ఆలోచనల్లో పడేసేయి. అందరికీ తెలిసేఉంటాయనుకున్న పదాలకి అర్థాలు ఇచ్చేరు. నాకు తెలీని కొన్ని పదాలకి అర్థాలు లేవు. అంటే నేను ఏవి అందరికీ తెలిసి ఉంటాయనుకుంటున్నానో  అవి ప్రచారంలో లేవు. అవి బహుశా నెల్లూరుప్రాంతంలో వాడుకలో ఉన్నవి అయిఉండొచ్చు!!

(మే 8, 2019)

## త్రిపురనేని ప్రమీల. **ఋణానుబంధం**

ఈ సమీక్ష "ఋణానుబంధం" కథగురించి అనడం కన్నా ఆ శీర్షికగురించి అనడంలో ఎక్కువ సమంజసం అనుకుంటాను.

కథానిలయంలో చూస్తుంటే ఈ ఋణానుబంధం శీర్షికకింద 69 కథలు కనిపించేయి. ఇన్ని కథలంటే అన్ని విభిన్నకోణాలు ఉంటాయి కదా, అవి ఆయా రచయితలు ఎలా ఆవిష్కృతం చేసేరు అన్న కుతూహలంతో కొన్ని కథలు తీసుకుని చదవడం మొదలు పెట్టేను. వాటిలో నాదృష్టిని ప్రత్యేకంగా ఆకర్షించింది త్రిపురనేని ప్రమీల రాసిన ఈ కథ, **ఋణానుబంధం**. రచయిత్రి వయసు 14, ఇంటిపేరు త్రిపురనేని కావడం కూడా కొంత కారణం నా కౌతుకానికి. ఈరచయిత్రి విషయంలో కొంత చర్చ జరిగింది. కొందరు పాఠకులు నేనెలా ఊహించేను అని ప్రశ్నించేరు. కథానిలయంవారు జీరాక్స్ చేసి పెట్టేరు కదా. ఆ రచయిత్రిపక్కన (14) అని ఉంది, కుండలీకరణంతో. అంచేత అనుకున్నాను. ఎంచేతంటే, సాధారణంగా పత్రికలు ఏదో కారణం లేకుండా అలా పెట్టరు. అది ఆ రచయిత్రి 14వ కథేమో అని ఒకరు సూచించేరు. 14వ కథ అయితే శీర్షికదగ్గర ఉంటుంది కానీ పేరు పక్కన ఉండదు. ఈవిషయంలో ఇంకెవరికైనా వివరాలు తెలిస్తే, నాబ్లాగులో పెట్టవచ్చు మీవ్యాఖ్య. నా ఈసమీక్షకి బ్లాగులో లింకు ఇక్కడ .

ఇప్పుడు ప్రమీలగారి కథ చూద్దాం. ఆమెకథలో అంశాలకి పూర్వాపరాలు నాదృష్టిలో – ఋణానుబంధం అన్నపదం వ్యవహారంలో అనేక సందర్భాలలో వాడుకలో ఉంది. ఒకొకప్పుడు ఊతపదంలా ప్రయోగించడం కూడా వినిపిస్తుంది. నేను చదివిన మరో నాలుగైదు కథల్లో కేవలం కారణకార్యసంబంధం అట్టే లేనప్పుడు ఋణానుబంధం అని సరిపెట్టుకోడం అనిపించింది. ఉదాహరణకి ఇంటినుండి పారిపోయిన ఇద్దరు యువకులు చేతిలో డబ్బు అయిపోయేక తమలాగే పారిపోయి వచ్చిన మరో యువకుడి డబ్బు వాడుకోడం, చివరలో అతను తెలివి తెచ్చుకుని తన డబ్బు వసూలు చేసుకోడం. ఇలా ఏవో కొన్ని సంఘటనలు పోగు చేసి ఓ కథ అల్లి ఋణానుబంధంవల్ల అలా జరిగింది అని చెప్పినకథలు చాలానే ఉన్నాయి. నేను కూడా రెండు కథలకి ఇదే శీర్షిక ఇచ్చేను.

కానీ ఈ పదానికి తాత్వికపరమైన అర్థం ఉంది. ప్రమీలగారికథ అలాటి తాత్త్వికచింతనతో కూడుకున్నది. అంత చిన్నవయసులో ఆ కోణాన్ని ఎలా ఆవిష్కరించేరు అన్న కుతూహలం కలిగింది నాకు. ఋణానుబందం అన్నపదం ఇంట్లో పెద్దవారు అంటే ఆమె విని ఉండవచ్చు. కానీ దాన్ని కథగా మలచడానికి నేర్పు కావాలి. ఈకథలో నేను అది చూసేను.

కథ ఎత్తుగడ – ఇంట్లో తాము అందరూ తమ్ముడిని పిల్లి అని పిలుస్తారు, వాడు పలుకుతాడు కూడా అని. పిల్లికీ, కుక్కకీ మనుషులపేర్లు పెట్టడం ఉంది కానీ మనుషులకి

పిల్లిపేరూ, కుక్కపేరూ పెట్టడం నా ఎరికలో లేదు. ఇది కథనానికి బలం ఇచ్చింది. ఆ తరవాత "ఎలా జరిగిందో చెప్తాను" అంటూ కథనం కొనసాగించడంతో పాఠకుడికి ఉత్కంఠత కలుగుతుంది. అది ఋణానుబంధం అన్న అభిప్రాయం ఎలా కలిగిందో వివరించడంతో కథ ముగుస్తుంది. శిల్పందృష్ట్యా సంపూర్ణంగా పరిపుష్టమైన కథ అనుకుంటున్నాను. కథకి శీర్షిక ప్రధానం. కథాంశం కూడా ప్రధానమే కానీ మొట్టమొదట మనకళ్ళ బడేది శీర్షికే కదా. ఈకథ శీర్షికలో తాత్వికచింతన కథకి అతికినట్టు సరిపోయింది. భాష అచ్చ తెలుగు. ఇవి నాకు ఆమోదకరమూ, హర్షదాయకమూ అయిన అంశాలు.

త్రిపురనేని ఇంటిపేరు అయితే గోపిచంద్ గారితో బంధుత్వం ఏమైనా ఉందా, ఉంటే వీరిద్దరిశైలిలో ఆ బంధుత్వఛాయలు కనిపిస్తున్నాయా అన్నవి నాకు కలిగిన ఉపప్రశ్నలు. ఇవి కథకి సూటిగా సంబంధించినవి కావు కానీ సాధారణంగా కథా, కథకుడినేపథ్యం తెలిస్తే కథని అర్థం చేసుకోడానికి కొంచెం ఎక్కువగా అవకాశం ఉంటుందని. నా కథలవెనక కథలు, నేనూ నారచనలూ వ్యాసాలు చూసి స్పందించినవారు కూడా ఈ అభిప్రాయాన్ని ధృవపరిచేరు. రమణమూర్తిగారు కూడా "చివరి చెప్పులు కుట్టేవాడు" రచయితతో స్వయంగా భాషించినతరవాత తమకి కొత్త ఆలోచనలు కలిగేయి అన్నారు. ఒక కథని పరిశీలనాత్మకంగా చూసి అర్థం చేసుకోవాలంటే ఇవన్నీ కూడా తోడ్పడగలవు అని మాత్రమే చెప్తున్నాను. అంతే కాని, ఇక్కడ నా అభిప్రాయం కథకుడు లేక రచయిత వైయక్తిక జీవితం అంతా అటు మూడు తరాలు ఇటు మూడు తరాలు తవ్వి తీసి, లేని అర్థాలు కల్పించి ఆశమ్మబోసమ్మ కబుర్లు ప్రచారం చెయ్యమని కాదు. ప్రస్తుతం ఇది జరుగుతోంది కొన్ని కథలవిషయంలో. తస్మాత్ జాగ్రత్త అని నా హెచ్చరిక!

కథకి సంబంధించినంతవరకూ నావ్యాఖ్యానం ఇంతే.

ఇక నాగొడవ. ఏ కథ నాకు ఆహ్లాదకరంగా ఉంటుంది, ప్రధానంగా కథల్లో నేను ఏమి చూస్తాను అన్న అంశాలకొస్తాను.

ఓం ప్రథమంగా శీర్షిక కుతూహలం రేకెత్తించేదిగా ఉండాలి. వస్తువు కూడా ప్రధానమే కానీ శీర్షిక నచ్చితేనే ఆ తరవాత ఏం చెప్పేరు అని చూస్తాను. నిజానికి ఋణానుబంధం నాకంతగా నచ్చేది కాదు కానీ పైన నాకారణం మనవి చేసుకున్నాను కదా. అలాగే బహుళ ప్రచారంలో ఉన్న మరో రెండు తప్పెవరిది, తనదాకా వస్తే శీర్షికలతో కూడా చాలా కథలు ఉన్నాయన్నారు అని రమణమూర్తిగారు. నమ్మకం అన్న శీర్షిక కూడా అలాటిదే. ఇలాటి అరిగిపోయిన రికార్డులాటి పేర్లు పెట్టడం అంత మంచిది కాదనే నా అభిప్రాయం. కథలో ప్రధానాంశాన్ని పదునుగానూ, నర్మగర్భంగానూ చూపించాలి శీర్షిక. 60, 70 దశకాలలో కొన్ని మరీ నేలబారుగా ఉండేవి. ఇదొక కథ, నిజంగా జరిగిన కథ లాటివి. ఆరోజుల్లో వచ్చిన ఒక హాస్యకథ – ఒక రచయిత "ఇది కథ

కాదు" అన్న శీర్షికతో ఒక పత్రికకి పంపేడు. సంపాదకులు, "అందుకే తిరిగి పంపిస్తున్నాం," అని తిరగ్గొట్టేరు.

నాకు రెండో అభ్యంతరం ఇంగ్లీషు శీర్షికలు. మరొక సంస్కృతిని ఆ సంస్కృతికి ప్రత్యేకమైన అంశాన్ని స్పృశించినప్పుడు తప్ప, ఇంగ్లీషుపేర్లు నాకు నచ్చవు. నేను కేశవరెడ్డిగారి కథలు చదవలేదు. ఇప్పుడు ఆయన గతించేక, నాకు కుతూహలం కలిగి రమణమూర్తిగారిని అడిగేను. ఆయన తనవద్ద ఇవి మాత్రమే ఉన్నాయనీ, కథలకీ నవలకీ చెప్పుతగ్గ తేడా ఉందని చెప్తూ పంపిన మూడు కథలు పల్స్ ఆఫ్ రోడ్, ద రోడ్, శ్రీభగవానువాచ. ఇందులో మొదటి శీర్షిక నాకు అయోమయంగా ఉంది. కథకి ఎలా నప్పిందో సరిగా తెలీలేదు. కథ అంతా ఒక తెగవారికి సహజమైన భాషలో రాసేరు. ఆ భాష ఒక కారణం కూడా కావచ్చు ఆ కథ అంతగా పాఠకులను ఆకర్షించడానికి. పాత్రలు మాటాడేభాషను బట్టి పాఠకులమనసులో ఆ పాత్ర రూపు కట్టడం జరుగుతుంది ఒకొకప్పుడు. ఆ భాషకి తగిన నుడికారమే శీర్షికలో కూడా ఉంటే బాగుండేది. మరొక ఉదాహరణ చెప్తాను. ఈమధ్య బహుళ జనాదరణ పొందిన "చివరి చర్మకారుడూ లేడు." ఈ పేరు చూడగానే నాకు చదవాలనిపించింది ఎందుకంటే అణగారిపోతున్న ఒక వృత్తివిద్య, ఆ విద్య ఆధారంగా జీవించే ఒకవ్యక్తిజీవితం కనక. అదే కథ cobbler అని పేరు పెట్టి ఉంటే నేను చూసేదాన్ని కాదు. ఎందుకంటే, ఇంగ్లీషుపేరు చూడగానే, ఆ కథ పాశ్చాత్యభావజాలంతో కూడుకుని ఉండవచ్చు అన్న అనుమానంతో. అది తప్పు అని తరవాత గ్రహించేననుకోండి అది వేరే కథ. కథలో "చెప్పులు కుట్టేవాడు అంటే cobbler" అని వివరించడం కూడా నాకు ఆశ్చర్యం కలిగించింది. ఈ వివరణ మన కథాసాహిత్యం ఏ దిశగా పయనిస్తోందో తెలియజేస్తుంది.

మరో బాధ – ప్రస్తుతం కథలో భాష అక్షరగతం చేయడం నాలుగు రకాలుగా సాగుతోంది. తెలుగులిపి, తెలుగులిపిలో ఇంగ్లీషు, ఇంగ్లీషులిపి(రోమన్)లో తెలుగు, ఇంగ్లీషులిపిలో ఇంగ్లీషు. నేను మొదటి సంప్రదాయాన్ని ఆహ్వానిస్తాను. చివరిసంప్రదాయం ఇంగ్లీషుకథ అయితే కథాంశం నాకు నచ్చినది అయితే గ్రహిస్తాను. మిగతా రెండు సంప్రదాయాలు నాకు కొరుకుడు పడవు. ఉప్పల లక్ష్మణరావుగారి అతడు-ఆమె నవలలో ఒక సంభాషణ మూడు పేజీలు తెలుగులిపిలో రాసిన ఇంగ్లీషులో సాగుతుంది. ఆపేజీలతో నానవలాపఠనం కుంటుపడిపోయింది. అయితే ఈ రోజుల్లో చాలామందికి ఈ భాష అలవాటయిపోయిందనీ, అంచేత వారి స్పందన నాస్పందనలా ఉండదనీ కూడా నాకు నిశ్చయంగా తెలుసు. ఇది ఒక కథని ఆస్వాదించే విషయంలో నాకూ, ఈనాటి పాఠకులకూ మధ్య తిరుగు లేని బేధం.

ఈనాడు విస్తారంగా ఆమోదిస్తున్న కథాంశాలలో కూడా నాకు నచ్చనివి ఉన్నాయి. అంటే అవి మాటాడకూడదని కాదు. నన్ను రంజింపజేయవు అని మాత్రమే చెప్తున్నాను. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, నేను మూడుతరాల ముందటి మనిషిని. ఈనాడు వస్తున్న కథల్లో

ఇతివృత్తాలూ, కథనం కూడా నాకు అగమ్యగోచరం. కథ "అరటిపండు ఒలిచి చేతిలో పెట్టడమో," "గోరుముద్దలు తినిపించడమో" కాకూడదు. కల్పిత కథకీ వ్యాసానికీ మధ్యగల తేడాలలో ఇదొక ముఖ్యమైన తేడా. కథలో ధ్వని ఉన్నప్పుడే పాఠకుడికి (అంటే నాకు) ఆలోచించుకోడానికి అవకాశం ఉంటుంది. మన ప్రాచీనసాహిత్యంలోని ఒకొక గ్రంథానికి అనేక పరిష్కరణములు ఉండడానికి ఇదే కారణం. అంతే కాదు. ఏ విషయాన్నిగానీ నిష్కర్షగా చెప్పడం ఏనాడూ సాధ్యం కాదు కూడాను. స్త్రీవాదులు, దళితవాదులు భాష కొందరికి మాత్రమే అనుగుణంగా వర్ధిల్లింది అని వాదించవచ్చు కానీ ఏ ఒక్కవాక్యమూ ఒక్క అర్థం మాత్రమే అందించగలదై ఉండదు. కనీసం వినేవారికి వేరు వేరుగా ధ్వనించవచ్చు. ఈరోజుల్లో ఇక్కడ స్పష్టంగా లేదు, అక్కడ స్పష్టంగా లేదు అని వ్యాఖ్యానించడం చూస్తే ఏమనుకోవాలో నాకు తెలీడంలేదు.

సూక్ష్మంగా, భాష, శిల్పం, ఇతివృత్తాలు – వీటివిషయాలలో నాఅభిప్రాయాలకీ ఇప్పుడు ప్రాచుర్యంలో ఉన్న అభిప్రాయాలకీ సహస్రాంతం వ్యత్యాసం ఉంది. అంచేత, ప్రమీలగారి కథ మిమ్మల్ని ఆకట్టుకోకపోతే నేను ఆశ్చర్యపోను. అది అవునో కాదో మరొకసారి నిర్ధారణ చేసుకోడానికి ఫేసుబుక్కులో పెట్టేను. ఇక్కడ కూడా అందుకే లింకు ఇస్తున్నాను,

కథానిలయంలో ఈ లింకు చూడండి http://kathanilayam.com/story/8461.

చివరిమాటగా, రచయితలు తమకథలమీద నాఅభిప్రాయాలు అడిగినప్పుడు నేను ఊరుకోడానికి కూడా ఇవే కారణాలు. నేను గత శతాబ్దపు చదరపు తునకని ;). నా ఆలోచనలూ, అభిప్రాయాలూ గతానుగతికం కాదు.

(మార్చి 4, 2015)

## ఇంటర్వ్యూలు

పొద్దు.కాంలో ఇంటర్వ్యూ కథామాలతీయం.

కల్పనా రెంటాల చేసిన ఇంటర్వ్యూ తూలిక.నెట్ గురించి

**మొల్లపురస్కారం సభ.** ఇది ఇంటర్వ్యూ కాదు కానీ ఈ సభలో వక్తలు నారచనలు నిజంగా చదివి, తమఅభిప్రాయాలు వివరించేరు. ఈ ప్రసంగాలలో నాకథలగురించి మంచి విశ్లేషణలు ఉన్నాయి కనక లింకు ఇస్తున్నాను. నిజం చెప్పాలంటే, నాపేరుమీద జరిగినసభల్లో నారచనలగురించి ఇంత విపులమైన ప్రసంగాలు విన్నది ఈ ఒక్క సభలోనే. విడియోకి లింక్ ఇక్కడ.

## నిడదవోలు మాలతి సాహిత్యవ్యాసంగం వివరాలు

తెలుగు తూలిక - బ్లాగు. మాలతి కథలు, వ్యాసాలు, కవితలూ, తదితర రచనలు.

thuika.net website , founded by Nidadavolu Malathi and featuring English translations of Telugu stories and informative/analytical articles on various topics in Telugu literature by Malathi and other writers/translators.

**నిడదవోలు మాలతి** తెవికీలో ఇక్కడ

**Nidadavolu Malathi** on wikipedia in English here

నిడదవోలు మాలతి రచనలు ఆర్కైవ్.ఆర్గ్ లో ఇక్కడ

సమాప్తం